# విశ్వమీమాంస

రచయిత:

కావ్యకంఠ వాసిష్ఠ గణపతిముని ('నాయన')

వ్యాఖ్యాత:

సర్వతంత్రి స్వతంత్రేత్యాది బిరుదాంకితులు

అయ్యల సోమయాజుల నరసింహశర్మ

కావ్యకంఠ భారతి, అనకాపల్లి

ఫిబ్రవరి 1982




ఈ గ్రంథ ప్రచురణమునకు
తిరుమల–తిరుపతి దేవస్థానము వారు
4,010 రూపాయలు ద్రవ్యసహాయము చేసిరి.
వారికి మా కృతజ్ఞులు.

# సంపాదకీయం

నాయనగారి రచనలలో 'విశ్వమీమాంస' విశిష్టమైనది. అపారమైన వైదిక సాహిత్యాన్ని ఆపోశనపట్టిన అగస్త్యుడు నాయన. ఇందులో సర్వవైదిక సాహిత్య సారాన్ని వైరుధ్యాలను పరిహరించి, అర్వాచీన తాత్త్విక సిద్ధాంతాలతో సమన్వయపరచి, సరళమైన రీతిలో అపూర్వ ప్రతిభతో అందించారు నాయన. స్వోపజ్ఞమైన వ్యుత్పత్తి స్వీయానుభవం గురుదేవుడైన భగవాన్ రమణమహర్షి కరుణాకటాక్ష స్థాలిలో పచనం కాగా లభించిన యజ్ఞ ప్రసాద మీ 'విశ్వమీమాంస' ప్రస్థాన త్రయానికి అనుబంధంగా వచ్చిన 'మరో ప్రస్థానం' ఇది. దీని రచనాకాలం 1927 సం. ప్రాంతమని తెలుస్తోంది. అయితే నాయన గారి ఇతర గ్రంథాలవలె ఇదికూడా రెండు మూడు సార్లు సంస్కరించ బడింది. మొదటి ప్రతిలో కేవలం 37 శ్లోకాలు మాత్రమే ఉన్నాయని, అది 'కియతో దీపికే సర్వం యయా సద్మ ప్రకాశ్యతే' అన్న వాక్యంతో పరిసమాప్త మైందని తెలుస్తోంది దీనికి ప్రమాణం ప్రస్తుత వ్యాఖ్యయే. తరువాత 1934 వ సం లో దానిని పెంచి 394 శ్లోకాల గ్రంథంగా రూపొందించారు. 1936 వ సం॥లో నాయనగారు ఆవాస మేర్పరచుకొన్న రోజులలో మరొక ప్రతి తయారైంది. దీనికి రెండవ ప్రతికి విశేష భేదం లేదని, మొదటి పరిచ్ఛేదంలో మాత్రం ఒక పదహారు శ్లోకాలు అధికంగా చేర్చారని కథనం. అయితే ఆ ప్రతి ఇంతవరకు ఎవరికీ లభ్యం కాలేదు. ఇప్పుడున్న మూడు ముద్రిత ప్రతులకు రమణాశ్రమంలో తయారైన రెండవ ప్రతి మాత్రమే మాతృక అని గ్రహించ వలసి ఉంటుంది.

'విశ్వమీమాంస'ను పరిపరిథమంగా తెలుగు లిపిలో అందించి లోకానికి మహోపకారం చేసిన వారు ప్రాతః స్మరణీయులు గుంటూరు లక్ష్మీకాంతంగారు. నాయనగారి శుశ్రూష చేసి, వారి ముఖతః అనేక విషయములు గ్రహించి తరించిన భక్తశేఖరులు. 'నాయన' అనే పేరుతో కావ్యకంఠముని జీవితచరిత్రను అనన్యరీతిని రచించిన మహోదారయశులు. వారు 'విశ్వమీమాంస'కు తెలుగులో తాత్పర్యాలు రచించి 1960 లో 'యలమంచిలి' నుంచి ప్రకటించారు. వీరు తమ ప్రతిని గురించి ఇలా రాశారు: "ఈ గ్రంథమున కొకప్పుడు నా కోర్కెపై శ్రీగణపతి మునులే స్వయముగా తాత్పర్యములను వ్రాయ నంగీకరించిరి. కాని వానిని వ్రాయుచున్న సమయమందే వారు నిర్వాణము చెందిరి. వ్రాయబడిన తాత్పర్యము లైనను పిదప లభ్యము కాలేదు. ఏ తత్కార్యము కష్టతరమైన దైనను గ్రంథమందున్న ప్రీతికొలది నేనే పండిత సహాయమును బొంది రచింప సాహసించితిని. నేనే తాత్పర్యములందక్కడక్కడ శబ్దార్థములను వదలి భావార్థముల నిచ్చియుంటిని. పండితు లందుకు నన్ను మన్నించి తదితర దోషము లేమైన దొరకినను క్షమింతురుగాక".

"విశ్వమీమాంస" 1970 లో మరో ముద్రణ పొందింది. ఈ ముద్రణ దేవనాగరిలిపిలో జరిగింది. మూలం మాత్రమే ముద్రితమైంది. ముద్రాపకులు నాయనగారి సన్నిహిత బంధువులు, సహృదయ శేఖరులు, విజయనగర వాస్తవ్యులు శ్రీ ఆర్యసోమయాజుల మధుకేశ్వరరావు. వీరు పశ్చిమాద్రిశిరస్థమైన "శిరసి" గ్రామము నుండి కావ్యకంఠవాణిని ఆంధ్రదేశమునకేగాక, సర్వ భారత దేశమునకు ప్రవహింపజేసిన నవ్యభగీరథులు. ఈ నాటి పరిశోధకులకు వీరు ప్రచురించిన గ్రంథాలు కల్పవృక్షాలు.

ప్రస్తుత ముద్రణ మూడవది. ఇందులో ప్రతిపదార్థంతో పాటు "సరళి" అను పేరుగల వ్యాఖ్యానాన్నికూడ ఇవ్వడం జరిగింది.

వ్యాఖ్యాతలు తెలుగునాట సుప్రసిద్ధ పండితులు శ్రీ అయ్యల సోమయాజుల నరసింహశర్మ. విశేషించి నాయనగారి కుటుంబ సభ్యులు కూడ కావడంతో శ్రీ గుంటూరి వారికి లేని ఒక విశేషావకాశం వీరికి లభించింది. శుశ్రూష చేతను, నిరంతర సాన్నిహిత్యం చేతను నాయనగారి అభిప్రాయాలను మరింత స్పష్టంగాను నిర్దుష్టంగాను తెలుసుకోవడం సాధ్యమైంది. అందుచేత కవి హృదయం శర్మగారు ఆవిష్కరించిన తీరు విశిష్టమేగాక అనన్య సాధ్యంకూడా అని తోచకమానదు.

నాయనగారి గ్రంథాలన్నిటినీ యథేచ్ఛగా ముద్రించుకోడానికీ, రేడియోద్వారా ప్రసారం చేయడానికీ అనుమతిని ప్రసాదించిన శిరసి వాస్తవ్యులు శ్రీ. శే. డి. ఎస్. విశ్వామిత్రగారికి, సవ్యాఖ్యానమైన తమ ప్రతి మొదటి ముద్రణకు మాకు సర్వాధికారాల్ని ఇచ్చిన శ్రీ అయ్యల సోమయాజుల నరసింహశర్మగారికి, గ్రంథ ముద్రణకు రూ 4010/- విరాళముగ ఇచ్చి ప్రోత్సహించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనాలను సమర్పించుకొంటున్నాను. ఈ గ్రంథాన్ని అచ్చుకు వీలుగా సాపు ప్రతిని రాసిఇచ్చిన మిత్రులు సహోపాధ్యాయులు శ్రీ కొల్లూరు సూర్యకోటేశ్వరరావు ఎం. ఎస్సి., ఎమ్. ఫిల్. గారికి, ఎన్నోవిధాల మాతో సహకరించి గ్రంథాన్ని అందంగా అచ్చు వేసి ఇచ్చిన ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూల్, విశాఖపట్నం వారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు. ఈ గ్రంథ ప్రచురణలో విశేషాసక్తిని కనపరచి ప్రోత్సహించిన ఆప్తమిత్రులు శ్రీ పూడిపెద్దిలక్ష్మణమూర్తి గారికి నా నమోవాకములు.

ఏ. ఎం. ఏ. ఎల్ కళాశాల
ఫిబ్రవరి 1982

గంటి శ్రీరామమూర్తి

# పీఠిక

[ఇది శ్రీ అ. స. శర్మగారి సుదీర్ఘ వ్యాసానికి సంగ్రహ రూపము
-సంపాదకుడు]

స్కందాంశ సంభవం దేవం
ఆచార్య రమణాహ్వయం
నమామి వాక్య శుద్ధ్యర్థం
జ్ఞాన మార్గానుభూతయే

వివర్తో విఘ్న నాథస్య
యః పూజ్యః పండితోత్తమః
తన్నమామి మమాచార్యం
పితుః శ్రేష్ఠం కులోన్నతమ్

కపర్ద మధ్య సంభూత శీకరాత్తః సుధాకరః
గౌరీహాస సమస్తాపం ధునోతు జగతాం ముదే

ఈ విశ్వమీమాంస ముముక్షువుల నుద్దేశించి వ్రాసిన శాస్త్ర గ్రంథము. ఇందు 8 అధ్యాయములు, 50 అధికరణములు గలవు. మొత్తం 392 శ్లోకములు. దీన్ని 'నాయన' అను నామాంతరము గల భగవాన్ కావ్యకంఠ వాసిష్ఠ గణపతిముని రచించారు. వారు భగవాన్ శ్రీరమణమహర్షి బోధనల ననుసరించి వ్రాసారు. ఇందులో సూక్ష్మముగ చెప్పిన కొన్ని విషయాలు 'రమణ గీత'లోను 'సద్దర్శనం' లోను వివరించబడ్డాయి, ఇది ఒక స్వతంత్ర ప్రస్థానము. అయినా ఇది శంకర మతానికి గాని, రమణ మతానికి గాని విరుద్ధము కాదు. మాయ, అజ్ఞానము పర్యాయములా? ప్రకృతులెన్ని? మూలావిద్య తులావిద్య అని అవిద్యలు రెండు గలవా? ఇట్టి చర్చలను శుద్ధ

శాంకర ప్రక్రియకు వ్యాఖ్యలు భిన్నరీతుల నుండుటచే నేర్పడినవి. దానిని శ్రీ నాగేశభట్టు ప్రశ్నించి విడిచాడు. అట్టి తర్క కర్కశత్వం లేకుండా ఈ శాస్త్రగ్రంథం వేద సమ్మతం గాను, అనుసంధానంగాను వచ్చేదానిని అనుభవంతో సూటిగ వివరించినది

ఉపనిషత్తులు ఇప్పటి వారికి దూరమయ్యాయి. సూత్రగ్రంథము కర్మయోగాదులైన కొన్ని విషయాలు చెప్పలేదు. గీత బ్రహ్మ విద్యలను పూర్తిగ వివరించలేదు. అందుచేత ఈ గ్రంథము ఆ లోపాలను పూర్తిచేస్తూ అనుక్తములు, అస్పష్టములు అయిన విషయాలను వివరిస్తూంది. అందుచేత ఇది ఒక ప్రత్యేక ప్రస్థానము.

ఈ నావ్యాఖ్యకు 'సరళ' అని పేరు. శాస్త్రార్థాలతో కాకుండా సాధకులకు అందుబాటులో ఉండాలని వివరణను సరళంగా రాసాను. అత్యవసర విషయాలను మాత్రం ఇక్కడ ప్రస్తావిస్తున్నాను.

1 నామౌచిత్యము

శంకరుల వారి 'శారీరిక మీమాంస' వ్యక్తిని కేంద్రంగా చేసి, ఆత్మబోధ చేసింది. అదే ప్రణాళికా రచనతో నాయన విశ్వాన్ని కేంద్రంగా చేసి ఇందులో ఆత్మబోధ చేశారు. కనుక ఇది 'విశ్వమీమాంస', ఇది విశ్వమే వేదగ్ం పురుషః' అని భావించి వివరణ నిచ్చింది.

2. సర్గము ,

ఈ గ్రంథం వివర్త వాదాన్ని ప్రతిపాదిస్తోంది. అంటే సువర్ణం కంకణాకారంగా ఎలా వివర్తమైందో, అలాగే ఆత్మ ప్రపంచంగా రూపొందిందంటుంది. పారమార్థిక సత్యము సువర్ణము. ఆకారాదికము ప్రాతిభాసిక సత్యము. కాని రెండవది వినాశ స్వభావము గలది అని వివరిస్తుంది. అజాత వాదాన్ని ఇది అంగీకరింపలేదు.

కాబట్టి సృష్టిక్రమాన్ని, ఉపనిషత్సమన్వయములో వివరించింది. ఇదీ అద్వైతమే అయినా వ్యావహారిక సత్యత్వము అతిరస్కార్య మంటుంది. అంటే ముక్తుని దేహంపై మనం గాయం చేస్తే అతనికి వేదన కలుగు తుందేగాని లేకుండా పోదు. కాని అతడు దేహం నుండి వేరైనవాడు కాన, దేహానుభూతియందు అహంకార వ్యాపృతి నందదు అని భావము. జగత్తును సృజించుట మన స్వప్న సృష్టి వంటి దనుటచే జగన్మిథ్యా త్వాన్ని కూడా ఇది అంగీకరిస్తుంది అనవచ్చు. ముక్తులు కానివారి సంఖ్య అధికము. వారికి గమ్యాలు మిథ్యాలో కాలే. వారి అనుభవం మిథ్య అంటే ధర్మప్రవృత్త్యాదుల ప్రయోజనం శూన్యం అవుతుంది. మాయ అంటే అనిర్వచనీయత్వమే కాని అసలు లేకపోవుట కాదు అని ఈ గ్రంథ వివరణ ఉపమాన వ్యాప్తిని వివరిస్తుంది. విశ్వ రూపుని సత్య పరిశీలనమే ఈ గ్రంథ విషయము. అయినా జగన్మిథ్యా త్వాన్ని ఇది ఎక్కడా తిరస్కరించలేదు.

3. అన్యమత నిరాసనము :

ఉపనిషత్తు సత్పదార్థాన్ని ఒక్క దాన్నే చెప్తోంది. మిగిలిన వన్నీ విభూతులే. భాష్యకారులైన పతంజలి, కణాదుడు, కపిలుడు, విభూతి సంఖ్యానకమే చేశారు. కాని సత్య పదార్థ నిరూపణ చేయ లేదు. అందుచేత వారికి సంఖ్యానంలో వ్యత్యాసాలు వచ్చాయి అని అపీత న్యాయంలో వానిని అనాదరించి సత్పదార్థైకత్వంతో గ్రంథ నిరూపణ చేసింది.

4. మాయ :

శక్తి, మాయ అనేవి పర్యాయ పదాలని భావించారు నాయన. అందుచేతనే ఉమా సహస్రంలో 'అద్వైతిభిరన్యా మాయా శ్రీయణీయా / శక్తే రతిరిక్తా సాకిం కిముమాయా' అని రాశారు. మాయా దాని నామ సంగ్రహణం నాయనగారి ఉపజ్ఞ. దాని వలన కాలము, దిక్కు ప్రకృతి మొదలైనవి సృష్టి మూలము

లనే వాదాలు నిరాస్తములైనాయి. శక్తుడు శక్తి, ధర్మి ధర్మమను తీరులో ఆత్మకు మాయకు గల సంబంధము వివరింపబడింది. ఈ వివరణము అస్పష్టంగా ఉపనిషత్తులందున్న దానికి విపులీకరణము. ఆ రెండింటికి విషయ గ్రహణమందే భేద వ్యవహారము. లేనప్పుడు అద్వైతమే అని మరువరానిది. అందు చేత ప్రకృతి, పురుషుల కనాదిత్వము గీత చెప్పుచున్నది. 'ప్రజ్ఞానం బ్రహ్మ తస్యజ్ఞానం మహేశ్వరీ' అని భావము. ఇది శాక్తాద్వైత సమన్వయము.

5 విశ్వోత్పత్తి క్రమము

అజ్ఞాతంగాను, అస్పష్టంగాను ఉన్న సృష్టి క్రమాన్ని ఒక క్రమంలో ఈ గ్రంథం వివరించింది. శుద్ధాకాశ వాయువులకు భూత సంజ్ఞ లేదని సహేతుకంగా వివరించి త్రివృత్కరణము ఉపనిషత్తులు బ్రహ్మసూత్రములు వివరిస్తున్నాయని తెలుపుతోంది. దాని ప్రయోజనము ఉపాసనలో ఉంది. పంచీకరణము నవీన మేధావుల ఊహ. దాని వలన ఉపాసన ప్రయోజనం లేదు.

6. వైదిక దేవతల స్వరూప కథనము :

సూర్య మండలాంతర్వర్తియైన హిరణ్మయుని వేదమతానుసారం నాయన నిరూపించారు. విభూతి భేదములచేనైన మధ్యమ (సూత్రాత్మ), రుద్ర, ఇంద్ర, వాయుదేవతలను వారి తత్త్వములను ఉపాసకుల కొరకు వివరించారు. అతి గంభీరములు అతి గుప్తములు అయిన దేవతల స్వరూపము అధిభౌతికములుగా వివరించారు. వైదిక తాంత్రిక పౌరాణిక మతముల ననుసరించి దేవతల నామ భేదముల సమన్వయము చూపబడినది కర్మలకు, గుణములకు అగు దేవతా కల్పన మానవబుద్ధి కృతము దేవతల నానాత్వమున్నను 'ఏకంసత్ విప్రా బహుధా వదన్తి' అని ఏకత్వం సుగమంగా బోధించింది. దేవతల ఏకత్వం చేత, ఒక దేవతను గొప్పవానిగను అన్యుని తక్కువ వానినిగను భావించుట అజ్ఞానమని బోధించుట జరిగినది.

ప్రకృతినే వేదములు దేవతగ భావించిన వను వాదము తిరస్కరించ బడినది.

7. ప్రకృతి :

ఈ గ్రంథము ప్రకృతి స్వరూపము గురించి బ్రహ్మసూత్రములలోను భగవద్గీతలోను బహు విధాలుగా ఉన్న విషయాలకు ఒక సమన్వయ మేర్పరిచింది. ప్రకృతి తేజోఽ బన్నాత్మకంగా వివరించింది. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సత్త్వ, రజ స్తమో గుణములకు కొందరు చేసిన దేవతా కల్పన అని వివరించింది. ఈ కల్పన పౌరాణికము. వికృతి కన్న ప్రకృతి స్థిర రూపము. లయకాలమందు వికృతులు ప్రకృతిలోను, ప్రకృతి అవ్యక్తమందు లయమౌతాయి. అవ్యక్త మందు జీవులు సక్తి రూపంతో నిరాకారంగానే ఉంటారు, అవిభక్తంగానే ఉంటారు.

8. సృష్టి, కాలము, లోకములు :

త్రివృత్కరణముచే నైన మొదటి సృష్టి సూర్యమండలము, తరువాత భూమి, తరువాత చంద్రుడు సత్య తపో లోకములకు లోక వ్యవహారం భాక్తము. మిగిలిన ఐదు లోకములందు అయిదు విధము లైన జీవులుందురు. వీరే పంచ జనులని కొందరి భావము.

విజ్ఞానమే కాలమను సూక్తి 'కాలః పరిణామః' అనే భావంతో వచ్చింది. "కాలోఽయమనాదిః సూర్యాదపి పూర్వః భాక్తో జని వాదః తస్యాజని సర్వః" అని నాయనగారి మతం. భూతభవిష్యదాది కాలము సృష్టి తరువాత వచ్చినది క్రియ లేనిది భూతమనునది లేదు. కాన నిది సర్గానంతర కాలము. 'దివ్యైర్వర్ష సహస్రైః ద్వాదశభిః దైవతంయుగం' అని అమరము. మనుస్మృతి కూడా ఇలాగే చెప్పింది. పురాణాలు దీనినే మానవ సంవత్సరాలుగా మార్చి మానవయుగంగా చెప్తున్నాయి. దీనికి తగిన ప్రమాణం లేదు. కాబట్టి

పురాణకాల సమన్వయం క్లిష్ట మవుతోంది నాయనగారు మానవ యుగము వారి ప్రమాణములో 12000 సంవత్సరాలని తెలిపారు. దీని మరింత విపులంగా తమ 'భారత చరిత్ర పరీక్షా' అనే గ్రంథంలో చేశారు (ఈ సిద్ధాంతాన్ని పండితులు ఇంకా పరిశోధించ వలసి ఉంది.) కాలము, పాకము సమానార్థకాలు. ఈ పాకము చేయు దేవతకు 'త్వష్టా' అని వేదమిచ్చిన పేరు (ఈ ఛందో దేవతలను గురించి విపులంగా నాయనగారి 'ఐంద్రియ బ్రహ్మ సంహిత'లో ఉంది. అది ఇప్పుడు పూర్తిగా లభ్యం కావడం లేదు— సంపాదకుడు)

క్షేత్రమందగు పురుషుడు ప్రత్యేకాభిమాని కాడు అని నాయనగారి భావము. ఒక దేహమున ఇద్దరు ద్రష్టలుండరను ఉపపత్తి శాస్త్రీయము కనుక వారట్లు తలచిరి.

భౌతికములైనా దేవతాంతరములైన సూర్యమండలాదులకు ప్రతిమా కల్పనతో ఉపాసన సమ్మతమగును. దీని వలన ప్రతీకోపాసన విభూతి ద్వారా ఉపాసన వేద సమ్మత మగునని ఋజువగుచున్నది. ఇందును విభూతి భేదము నంగీకరించినను, నానాత్వము, వైరుధ్యము శాస్త్ర విరుద్ధమని భావము.

8 ప్రాణము, మనస్సు, వాక్కు

ప్రాణము దాని విభూతులు పూర్తిగ గ్రంథంలో చర్చించబడ్డాయి. శ్రేష్ఠ ప్రాణ స్వరూపము స్పష్ట పరచబడింది. ఇది చాలా అవసరము దేహమునుండి వేరగునది ఇదియేకదా కాబట్టి దీని వివరణము ఏక వాక్యతతో ఇందు తెలుపబడినది. విభూతి భేదముచేనైన సంఖ్యా వ్యత్యాసాలు మూల స్వరూప భేదాన్ని కలిగించలేవు. అంతఃకరణము మనసు ఇదీ కరణమే దీని విభాగాలు మనస్సు, బుద్ధి, చిత్తము అహంకారము. వీని స్వరూపమే నిగూఢము. అందుచే స్పష్టముగ వివరింప బడ్డాయి. అంతఃకరణ తత్త్వం తెలియని వారికి మనో నిగ్రహ మసాధ్యము. వాక్కు ప్రమాణాన్ని జపానికి కూడ

ఉపయోగిస్తుంది. ప్రాణము, మనస్సు, వాక్కు ఈ మూడే జగత్తులో సారభూతములు. వీనికే సంస్కారము. అవే మానవుని సద్గతికి మూలం. మిగిలిన దేహానికి శుద్ధి అలంకారము జరుగుతుంది కాని సంస్కారము లేదు. ప్రాణము జలసారము. మనస్సు అన్న సారము. వాక్కు తేజస్సారము. ఈ విషయము ఛాందోగ్యం వివరించింది. అందుచేతనే వాక్కు తైజసము. ఆకాశానికి గుణంలేదు. అందుచేతనే భగవత్పాదులవారు 'శబ్దః ఖే పౌరుషేనృషు' అనే గీతా వాక్య వివరణలో "తస్మిన్ శబ్దరూపే మయి ఆకాశః ప్రతిష్ఠితః" అని వ్రాశారు. తార్కికుల వైరుధ్యాన్ని పరిహరించడానికి ఉపాసనలేని చోటులందు శబ్దము ఆకాశ గుణంగా అంగీకరించినా ఈ వేదాంత శాస్త్ర మర్యాద మాత్రం శబ్దం తైజస ద్రవ్యమని వారు కూడా నిరూపిస్తూ వచ్చారు. ఇది జైమిన్యాదులు అంగీకరించిన విషయం. కాబట్టే వేదము శబ్దమయః మహః అని వీరంటారు. ప్రమాణము ప్రమేయ సాధనము. మేయసిద్ధి మానాధీనము. బుద్ధి, వాక్కు ప్రమాణ కోటికి చెంది ప్రమేయాన్ని నిర్ధారణ చేస్తాయి. కాబట్టి ఇక్కడ ప్రమాణ చర్చ అవసరమైంది.

10 వేదోత్పత్తి:

అతీంద్రియ విషయాలకు ముక్తుల అనుభవం, వేదవాక్కు, ప్రమాణాలు ముక్తుల బుద్ధి కేవలం జ్ఞాన స్వరూపం, అది పరమ సత్యము. అది వాక్కునకందనిది. వేదము పరావాక్కు. అది ప్రత్యక్ష ప్రమాణము. ఋషులు అతీంద్రియ దర్శనంచేసిన విషయాలను లోక కళ్యాణానికై తమ భాషలో వ్యక్తం చేశారు. అదే వేదోత్పత్తి. అందుచేత వేదాలు బ్రహ్మ నిర్మితాలు, ఋషి దర్శనాలు అని వ్యవహారం. మంత్రములందలి విషయం బ్రహ్మజ్ఞానముచే ఆవిర్భూతము. భాష వ్యక్తిది. కాన ఆ ఋషి ఆ మంత్రమునకు కర్త. మంత్రములందు భాషా భేదం కలుగుటకు ఇదే హేతువు. జ్ఞాన భాగముచే నవినాశిత్వము, వ్యక్త శబ్ద భాగముచే వినాశిత్వము

వేదములకు సిద్ధము అని నాయనగారి భావమింపు వివరించ బడ్డది. ఇది ప్రాచీన పండితాశయములకు విరుద్ధము. (ఈ విషయాన్ని గురించి నాయనగారు 'ఛందో దర్శనం'కు రాసిన సంస్కృత పీఠికలో మరింత వివరంగా రాశారు– సంపా.)

11 పంచాగ్ని విద్య :

అన్నమయములు, అన్న ప్రాణమయములు, అన్న ప్రాణ మనోమయములు అయిన జీవులలో మానవుడు ఉత్తమ పరిమాణము. కాబట్టే వాడు తృతీయ మార్గాన్ని పొందకుండా జాగ్రత వహించాలి. నూతన జలబిందువైనా మనుజుడు తిరిగి జన్మించేటప్పుడు ఈ పరిణామం ఉంది ఆ అయిదిటి యందు అగ్నిబుద్ధి, హోత, హోమ బుద్ధులు కలిగి ఉండుట ఉపాసన. అయిదవ ఆహుతి యందు మానవ సంజ్ఞ నందుతాడు ప్రభావ విశేషంచేత మధ్యలో పర్జన్య కాదిక మానవత్వాన్ని ప్రభావాతిశయంచేత పొందవచ్చు. అక్కడ జన్మించే వృక్షాదులు హీనజన్మ కల వవుతాయి. ఇష్టా పూర్తాదికం చేసినవాడు పితృయాన మార్గంలో చంద్రలోకానికి వెళతాడు. అక్కడ భోగముల ననుభవించి అక్కడ మరణించి జన్మ ఎత్తే వానికి రసాత్మకుడే కావ మొదటి ఆహుతి ఉండదు. వానికి భూపతనమయి తిరిగి జన్మ నందేవరకు స్మృతి ఉండదు. మూర్ఛ పొందిన వానివలె నుంటాడు వేదన లుండవు త్వరగానే పర్జన్య లోకానికి వచ్చినా తరువాత మానవ జన్మకి ఎన్నో అంతరాలు దాటాలి. కాబట్టి కాల నిర్ణయం చేయలేము. తృతీయ మార్గ గామికి మానవజన్మ వచ్చేవరకు పంచాహుతి క్రమంలేదు. తృణ జలూకమువలె వాని జన్మలు పరం పరగా అవుతాయి. వానికి వేదన అనుభూత మవుతుంది అదే నరక యాతన అని వేదాంతుల మతము. మానవ దేహమందు బీజరూపు డైనప్పటి నుండి వానికి మానవ దేహారంభమై స్త్రీనుండి జనించు నపుడు పూర్తి మానవ సంజ్ఞ నొందును. ఇందలి విశేషాలు మూలం వివరించింది. ఇది రాజ విద్య.

12 ధర్మ వృత్తాలు :

'అథాతో ధర్మ విచికిత్సా, వృత్త విచికిత్సావా స్యాత్' అని భిన్నంగా నిరూపించారు ధర్మానికి స్వర్గాదిగతి ఫలము. వృత్తానికి శాంతి ఫలము. వృత్తము లేని వానిని ధర్మము, విద్యకూడ రక్షింపలేవు. ధర్మ కర్మఫలము ఈశ్వరుడిచ్చును.

13. అవతారము :

ఈశ్వరుని కర్మ విభూతి యజ్ఞేశ్వరుడు. ఈశ్వరార్పితకర్మ నాతడనుభవించుటకు అవతారమెత్తును. 'యజ్ఞేన ప్రారబ్ధవా నీశ్వరః కర్మణా ప్రారబ్ధవాన్ జీవః' అని భావము. 'అధి యజ్ఞోహమే వాత్ర దేహే దేహభృతాం వర' అన్న గీతా వాక్య మీ విషయమునే తెల్పును. ఈ సమన్వయము నాయనగారి పరిశీలన ఫలితమే అనవచ్చును. (అవతార తత్వాన్ని గురించి నాయన 'కృష్ణవ్యాఖ్యానం'లో కూడ వివరించారు సం. పా).

14. భక్తియోగము ;

భక్తిని వేదాంతము ప్రత్యేకముగ చెప్పదు. కర్మయందుగాని ఉపాసనయందుగాని భక్తి అంగము అంటారు కాని భక్తి స్వతంత్రంగా గతి నిస్తుంది అనే భాగవత మతాన్ని రామానుజులు, రూప గోస్వామి మొదలగు వారి మతాన్ని ఆధారంగా నాయన వివరించారు. భక్త్యాదుల వల్ల ఉత్తరాయణ మార్గము సంభవమని యోగం వివరిస్తోంది. కావ్యకంఠుల వారు దీనిని ప్రత్యేకంగా ఉత్తరాయణ మార్గమునకు సమర్థవంతమని తెలిపారు.

15 కర్మ :

వైదిక కర్మను అఫలాపేక్ష లేకుండ చేయుటయే గాక గీతయందు "పశ్యన్, శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ శ్వసన్"

అను శ్లోకమునందు వైదికేతర కర్మలు కూడ తెలుపబడినవి. దీనిని ఆత్మయందు ధారణ కలిగి ఇంద్రియాలు ఇంద్రియార్థాల యందు వర్తిస్తున్నా యని భావించాలి. అదే వ్యానోద్గీథ విద్య. అస్పష్ట విషయాని కిది వివరణ.

16 ద్విజన్మాది కరణము:

ఈ గ్రంథమందు చాతుర్వర్ణ్యము వివరింపబడలేదు. బ్రహ్మవిద్యకు దీని అవసరము లేదు. కాని ద్విజన్ముడు అను పద మేవిధముగ అన్వర్థమో వివరించినది. జాతి బ్రాహ్మణుడు, ద్విజన్ముడు అను సార్థకనామము లేనివాడు కూడ కావచ్చును. స్త్రీ యైనను కావచ్చును.

17. దేవయానము:

'నైతే శృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన' అని గీతోపదేశము. గీతయందు తెలిపిన అహః మొదలైన పదాలు దేవతావాచకములు. 'ఋతంచ సత్యం చాభీద్ధా జాయత' అను మంత్రమునకు దేవతయైన అహః అను దేవతయే ఇక్కడ అహః అని తెలుపబడింది ఇట్లే మిగిలినవి ఊహించవలెను. వారు అతి వాహకుని వలెనుందురు. యోగికి మరణానంతరము స్మృతి యున్నను గమన శక్తి యుండదు గాన ముక్తుని ఆయా తావులకు వీరు చేర్చుదురు. ఇది జీవాంత ముక్తులకు గతి. జీవన్ముక్తుని ప్రాణములు ఇక్కడే లీనమగును. ఈ ఇద్దరకు తరువాత ముక్తిలో భేదము లేదు 'హిరణ్మయేన పాత్రేణ' అను ఈశావాస్య మంత్రము దేవయాన మార్గమున పోవు వానికి స్మృతి శిథిలము కాదని జ్ఞాపకము చేయుచున్నది.

'ఉత్తముడే మార్గంలో మనలో ప్రవేశించుచున్నాడో మనం అదే మార్గంలో ఉత్తముని చేరగలము' అని నాయనగారి వాక్కు. ఇది 'తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్' 'అనేన జీవేనాత్మనా అను

ప్రవిశ్య నామరూపే వ్యాకర వాణి' అను శృతి వాక్యాల నాధారంగా రచింపబడింది అయితే శంకర భగవత్పాదులు ఈ శృతి వాక్యాలను వ్యాఖ్యానిస్తూ 'ఆత్మలేని ప్రదేశమే లేదు గాన అను ప్రవేశ మనుపపన్నము. పైన ఉన్నవాడు లోన ప్రవేశిస్తాడు. అంతటా ఉన్నవానికి ప్రవేశమేమిటి?' అని పృచ్ఛించి ఈ విధంగా సమాధానం చెప్తున్నారు. "రాహువును గ్రహించుటకు చంద్రసూర్యోపరోధము ఏవిధంగా ఉపలబ్ధి హేతువో అలాగే ఆత్మోప లబ్ధికి అంతఃకరణ గుహాత్మ సంబంధము ఉపలబ్ధి హేతువు. ఆకాశాది కార్యములను సృజించి వానియందున్నట్లే బుద్ధియందుండి శ్రోత్రగ, మంత్రగ విశేష రూపముచే భాసించుటచే ఉపలబ్ధి హేతువగును. ఇదే వాని యను ప్రవేశము".

పూర్ణే శరీరశల్పే ద్వారేణ బ్రహ్మసంజ్ఞేన
నాడీ పథేన గత్వా తైజస మణ మావిశన్యమేయ బలే.

అని "ఉమాసహస్రం"లో నాయన వర్ణించారు శక్తి మాయా సమానార్థకాలు. ఈశ్వరుని ధర్మజ్ఞానమే శక్తి, అది విషయ గ్రహణమందు ధర్మ వ్యవహారాన్నందుతుంది. నిర్విషయస్థితిలో స్వరూపదశలో ఉంటుంది కాబట్టి ఉపలబ్ధి హేతువునే ఈ విధంగా వివరించేరని భావము. ఏ విషయాశక్తి జీవుని భిన్ననిగ చేస్తుందో దానిని విసర్జించి మూల స్వరూపము నందగలమని భావము. ఆ ఉపాయమే వివరింపబడింది. అంచేతనే 'అద్వైతిభిరన్యా మాయా గ్రహణీయా శక్తేరతిరిక్తాసా కిం కిము మాయా' అన్నారు నాయన 'ఉమా సహస్రంలో'. జగత్తు తనకంటే భిన్నంగా లేదు. అంటే ఏకత్వము, అంశత్వము మిథ్యకాదని భావము. జగన్మిథ్యా వాదము లాక్షణికము. వైరాగ్యాతిశయ ప్రాప్తికి చెప్పబడినది కాని జగత్తు సదంశ అగుటచే మిథ్యకాదు. అలాగే సత్తుకంటే భిన్నము కాదు. అయితే వికారాంశ వినాశ స్వభావము కలది. పరిణామముచే మారునది. అది వ్యావహారిక సత్యము. స్థిర సత్యము కాదని భావము ఇది అజాత వాదానికి

ఇంకోక వివరణము. దీని వివరణము. దీని వివరణము శ్రీ కపాలి శాస్త్రి రాసిన సద్దర్శన భూమిక యందు చూడనగును అలాగే 'రమణగీత' లో మొదటి అధ్యాయములోని 11వ శ్లోకము 'నాసత్యం చితయే ద్విశ్వం...' కూడా ఇక్కడ అనుసంధించుకోవచ్చు. ఉపాసన లేని కేవల శాస్త్ర విచారము ముక్తి హేతువుకాదు తృతీయ మార్గ నివృత్తి జీవితానికి లక్ష్యం, జీవన్ముక్తి పరమ గమ్యం. జీవన్ముక్తుని విద్యయే ఉత్తమ మార్గము.

18. సంపదధి కరణము

సంపద యందు ఉత్తమ పురుష దర్శనం హేతువు కేవల స్వరూప నిష్ఠ దేవయాన మార్గాన్ని అనుగ్రహిస్తుంది. ఉత్తముని దర్శనం లేకుండా కూడా స్వరూపనిష్ఠ ఉండవచ్చునని ఈ గ్రంథము వివరిస్తోంది. ఇది విశేషము అహంకార నాశము స్వరూపస్థితి అదే ముక్తి.

నేనీ వ్యాఖ్యను 10-12-1968 తేదీని ప్రారంభించి 23-12-68 తేదీని ముగించాను. నాతోటి అధ్యాపకులైన శ్రీ బండ్ల రామయ్య, ఎం. ఏ తెలుగులో అచ్చున కనువైన ప్రతి రాసి ఇచ్చేరు. కాని అది సాహిత్యాభిమానులవద్దకేగి తిరిగి రాలేదు. అంచేత డా గంటి శ్రీరామమూర్తి, ఎం ఏ., పి హెచ్. డి వారికి మళ్ళీ శ్రమ కలిగించాను. వారు మళ్ళీ ప్రతి రాయించి, ప్రచురణ బాధ్యత స్వీకరించారు వారికి 'కావ్యకంఠభారతి' కార్యవర్గానికి నా కృతజ్ఞతలు. నాతో సహకరించిన శ్రీ ఎ. పురందర్ (గణపతి మునిగారి పౌత్రుడు)కు నా ఆశీస్సులు.

సర్వతంత్ర స్వతంత్ర
అ. నరసింహశర్మ

# విషయసూచిక

ప్రథమ పరిచ్ఛేదము



రెండవ పరిచ్ఛేదము



మూడవ పరిచ్ఛేదము



నాల్గవ పరిచ్ఛేదము



ఐదవ పరిచ్ఛేదము



KAVYAKANTA
GANAPATI MUNI

1878 - 1936

# ప్రథమః పరిచ్ఛేదః

## 1. సదధికరణమ్

శ్లో॥ రమణస్య గురోః ప్రాప్య కటాక్షం జ్యోతి రద్భుతమ్
కుర్మో విశ్వస్య మీమాంసాం యథాబుద్ధం యథాశ్రుతమ్ 1.

గురోః=గురువైన; రమణస్య = రమణమహర్షి యొక్క; అద్భుతమ్=అద్భుతమైన; కటాక్షం=కటాక్షము అనే, జ్యోతిః= జ్యోతిని; ప్రాప్య = పొంది; విశ్వస్య = ఈ జగము యొక్క, మీమాంసాం=మీమాంసను, యథా = ఏ విధముగ; బుద్ధం= తెలిసెనో, యథా=ఏవిధముగ; శ్రుతమ్=వినబడెనో (తథా= ఆ విధముగ) కుర్మః=చేయుచున్నాము.

శ్లో॥ పదార్థాన్కపిలః ప్రాహ వింశతి శ్చతురుత్తరాన్
షడేవ కణభుఙ్మౌనీ చతురో భగవాన్ ఫణీ 2.

కపిల=కపిలమహర్షి; చతురుత్తరాన్ = నాలుగు అధిక ముగ; వింశతిః = ఇరువది (అనగా ఇరువది నాలుగని); పదార్థాన్ =పదార్థములను; ప్రాహ=పలికెను; కణభుక్ = కణాదుడను; మౌని=మునీశ్వరుడు; షట్ =ఆరు, ఏవ=(నిశ్చయార్థకము) అనియు; భగవాన్ =భగవంతుడగు, ఫణీ=పతంజలి, చతురః= నాలుగు (అని తెలిపిరి.)

శ్లో॥ విశ్వ మేతత్సదేవైక మితి శ్రుత్యన్త భాషితమ్
విశ్వస్మి న్నితరే భావాః సతయేవ విభూతయః 3

ఏతత్ =ఈ, విశ్వమ్=జగత్తు, ఏకం = ఒకటియగు, సదైవ=సత్పదార్థమే; విశ్వస్మిన్ =విశ్వమునందు; ఇతరే=సత్తు నకు విలక్షణములగు, భావాః=భావములు (గుణాదులు);

# ప్రథమ పరిచ్ఛేదము

## 1. సదధికరణము

వ్యాఖ్య గురువైన భగవాన్ రమణమహర్షి అద్భుత కటాక్ష జ్యోతి లభించుటచేత మా బుద్ధికి ఎంతవరకు అవగత మయ్యెనో, మేము ఇతరత్రా ఎంతవరకు విని తెలిసి కొంటిమో అంతవరకు ఈ విశ్వమును గూర్చి విమర్శను చేయుచున్నాము. 1.

వ్యాఖ్య : సాంఖ్యమున కపిల మహర్షి పదార్థము లిరువది నాలు గని తెలిపెను కణాదముని తన తర్క శాస్త్రమున నాఱే పదార్థములనెను. పతంజలి భగవానుడు యోగ శాస్త్రమున నాలుగు పదార్థములని వివరించెను 2.

వ్యాఖ్య : ఈ జగమున 'సత్తు' అనునది ఒక్కటియే పదార్థము. తక్కిన భావము లన్నియు సద్విభూతులు అని ఉపనిష త్తులు తెలుపుచున్నవి. కపిలాదులు ఏవి పదార్థములని తెలిపిరో అవి యన్నియు సత్పదార్థము యొక్క విభూ తులేగాని పదార్థములు కావని భావము. ఇందులకు

సతఏవ=సత్పదార్థముయొక్క; విభూతయః=వైభవ భేదములు, ఇతి=ఇట్లు, శ్రుత్యన్త భాషితమ్=ఉపనిషద్వచనము

శ్లో॥ కారణం సదుపాదానం కార్యం విశ్వం ప్రకీర్తితమ్
సతో విశ్వస్య చాద్వైతం మృత్తికా ఘటయో రివ॥ 4.

సత్=సత్పదార్థము; ఉపాదానం కారణం = ఉపాదాన కారణము; విశ్వం=జగత్తు; కార్యం = కార్యము (అని); ప్రకీర్తితమ్= తెలుపబడినది. విశ్వస్య=జగత్తునకు; సతః=సత్పదార్థమునకు, మృత్తికా ఘటయోరివ=మన్నునకు, కుండకువలె; అద్వైతం =అభేదము (కలదు.)

శ్లో॥ ద్రవ్యం కేవల మీక్షస్వ పరిత్యజ్య గుణా న్ధియా
సమస్తేపి తదాద్రవ్యే కిం విభాతి వినా దివమ్ 5.
(వినా సత్తాం విభాతి కిం?)

ధియా=సత్యగ్రాహియగు బుద్ధిచే; గుణాన్=గుణములను (విభూతులను); పరిత్యజ్య = విడిచి; కేవలం = గుణరహితముగ; ద్రవ్యం=ద్రవ్యమును (సత్పదార్థమును); ఈక్షస్వ = చూడుము, తదా=అప్పుడు, సమస్తేపి=సమస్తమైన, ద్రవ్యే=గుణములకు (ఉపాదాన కారణమైన పదార్థమందు), దివం వినా=ఆకాశము కన్న నితర మగునది; కిం విభాతి=ప్రకాశించునా? ప్రకాశింపదని భావము. ఆకాశమే కానగును.

శ్లో॥ శ్రుతిశ్చాహ సమస్తం చాప్యోతప్రోతం జగద్దివి।
దివ స్తస్యాః సతో ద్వైత ముత్తరత్ర నిరూప్యతే 6.

జగత్=జగత్తు; దివి=దివమందు; ఓతప్రోతం=పడుగు పేకలవలె నున్నది (అని), శ్రుతిశ్చ=వేదమును; ఆహ = తెలిపినది;తస్యాః=ఆ, సతః=సత్తునకు; దివః=దివమునకు; అద్వైతం= అభేదము; ఉత్తరత్ర=ముందు; నిరూప్యతే=చూపబడును.

ఉపనిషత్తే ప్రమాణము పదార్థమన నామ భావ
వికారములు లేక యుండునది. 3.

వ్యాఖ్య : స్వస్వరూపమును విడువక యే రూపాన్తరమునందు కారణమునకు ఉపాదాన కారణము అని పేరు. మన్ను తన రూపమును విడువక యే ఘట రూపము నందినది. కాన మన్ను ఉపాదాన కారణము ఘటము కార్యము. ఈ రెండను మన్నే అగుటచే వాని కభేదము సిద్ధించినది ఇట్లే సత్పదార్థము ఉపాదాన కారణము. జగత్తు కార్యము. ఈ రెండింటికి నభేదము పై చెప్పిన తీరున సిద్ధించుచున్నది. 4.

వ్యాఖ్య ఈ జగమందలి ఏ కార్యము నైనను దాని గుణములను వేరుచేసి మూల ద్రవ్యము ఏదియని సత్య దృష్టితో చూడుము. రూపము, రంగు, స్పర్శాదులను విడిచి చూచినచో ఆ కార్యమైన దానికి మూల పదార్థము ఆకాశమే అని తెలియగలదు.

వినా సత్తాం విభాతి కిం? అను పాఠాంతరమున సత్పదార్థముకన్న ఇతర పదార్థము కానరాదని భావము సత్పదార్థమునకు దివముతో అద్వైతము క్రమముగ నిరూపింపబడును. 5.

వ్యాఖ్య · దివమందు ఈ జగత్తు ఓతమందు ప్రోతమువలె నున్నదని వేదమందును కలదు. 'ఓతప్రోతం జగద్దివి' అని వేదవాక్యము. దివమునకు, సత్తునకు అభేదము కలదని వక్ష్యమాణ విషయమున నిరూపింపబడును. 6.

శ్లో॥ విజ్ఞానే భాతి యే భాన్తి భావా శ్శబ్దాదయో గుణాః ।
నకించి దనుభూయన్తే విజ్ఞానోపరమే తు తే   7.

విజ్ఞానే=విజ్ఞానము; భాతిసతి=ప్రకాశింపగా; భావాః = భావములు; శబ్దాదయః=శబ్దాదులగు; గుణాః=గుణములు, యే= ఏవి; భాన్తి=ప్రకాశించుచున్నవో, తే=అవి. విజ్ఞానోపరమే తు= విజ్ఞాన విరమణ మందైతే, కించిత్ =కొంచమైనను; న అనుభూయంతే=అనుభవింప బడుటలేదు.

శ్లో॥ ఏవం స్వతః ప్రకాశత్వం గుణానాం నైవ దృశ్యతే
సిద్ధిశ్చ పరతో నస్యా త్సంబన్ధం కంచిద న్తరా   8.

ఏవం=ఈ విధముగ, గుణానాం=గుణములకు, స్వతః= తమంతట తాముగా; ప్రకాశత్వం=ప్రకాశించుట; నైవ దృశ్యతే =కానవచ్చుటలేదు, పరతః=పరమైన దానివలన, సిద్ధిశ్చ= సిద్ధియు, సంబంధం కంచిద న్తరా=ఏదైనను సత్పదార్థ సంబంధము లేక: నస్యాత్ =కాలేదు.

శ్లో॥ దృశ్యతే విషయాకారా ప్రత్యక్షే స్మరణే చ ధీః ।
ప్రజ్ఞా విషయ తాదాత్మ్య మేవం సాక్షా త్ప్రదృశ్యతే   9.

ప్రత్యక్షే=ఎదురుగా తెలియబడుచున్న విషయానుభవ మందును, స్మరణే=అనుభూత విషయములను స్మరించునపుడును; విషయాకారా=విషయ రూపముగ, ధీః=ప్రజ్ఞ, దృశ్యతే= చూడబడుచున్నది; ఏవం=ఈ విధముగ; ప్రజ్ఞా విషయతాదాత్మ్యం=ప్రజ్ఞకు విషయములతో నగు తాదాత్మ్య సంబంధము; సాక్షాత్ =అనుభవముచే, ప్రదృశ్యతే=చూడబడుచున్నది.

శ్లో॥ నచే త్సమష్టి విజ్ఞాన విభూతి ర్గుణ సంపదః
విషయవ్యష్టి విజ్ఞాన తాదాత్మ్యం నోపపద్యతే ।   10

గుణసంపదః=గుణసంపదలు; సమష్టి విజ్ఞాన విభూతిః = సమష్టి విజ్ఞానముయొక్క విభూతులు; నచేత్ = కాకున్నచో,

వ్యాఖ్య విజ్ఞానము ప్రకాశింపగా ఏ భావములు శబ్దాదులు అనుభవింపబడుచున్నచో అవి విజ్ఞానము విరమింపగా కొంచెమైనను ప్రకాశించుట లేదు. 7.

వ్యాఖ్య. గుణములు విజ్ఞాన సంబంధము లేక ప్రకాశింపలేవు. దీనితో ఏదియేని ఒక సంబంధము లేకున్నచో గుణాదులకు సిద్ధియు లేదు. 8

వ్యాఖ్య. ఒక వస్తువును చూచునపుడును, దానిని స్మరించునపుడును, బుద్ధి ఆ వస్తువును గ్రహించుచున్నది అప్పుడు బుద్ధి వస్తురూపమునంది దానిని తెలియుచున్నది. కాన ఇట్లు ప్రజ్ఞకు విషయములతోడి తాదాత్మ్య సంబంధము ప్రత్యక్షముగ తెలియబడుచున్నది. కాన సత్పదార్థమునకు జగత్తుకు అభేదమనుట ప్రత్యక్ష ప్రమాణము చేతను కూడ ప్రమేయమగుచున్నదని భావము. 9.

వ్యాఖ్య: గుణసంపద అంతయు సత్తుయొక్క విభూతియే సత్తే వ్యష్టి ప్రజ్ఞయయి బుద్ధి అనబడుచున్నది. దానియందు విషయములు తాదాత్మ్యముచే అనుభవింపబడుట ప్రత్యక్ష ప్రమాణసిద్ధము. సద్విభూతియే గుణ

విషయవ్యష్టి విజ్ఞాన తాదాత్మ్యం=వ్యష్టి విజ్ఞానమునందు విషయముతో తాదాత్మ్యమున; ఉపపద్యతే=పొసగదు.

శ్లో॥ యథాఽస్మదాది విజ్ఞానే ధ్యేయం బుద్ధిరితి ద్వయమ్ ।
పూర్ణే సమష్టి విజ్ఞానే వికృతిః ప్రకృతి స్తథా 11

యథా=ఏవిధముగ, అస్మదాది విజ్ఞానే=మన విజ్ఞానమందు; ధ్యేయం=ధ్యేయమగు విషయము, బుద్ధిః=గ్రహించు ప్రజ్ఞ; ఇతి ద్వయం=అని రెండు కలవో, తథా=ఆ విధముగనే; పూర్ణే=సంపూర్ణమైన; సమష్టి విజ్ఞానే=సత్తునందు; ప్రకృతిః=మూల ప్రకృతియు; వికృతిః=భూతిములును (ఉన్నవి).

శ్లో॥ పరిణామో యథాస్వప్నః సూక్ష్మస్యస్థూలరూపతః
జాగ్రత్ప్రపంచ స్త్వస్మాకం తథేశ్వర మహాచితః 12

సూక్ష్మస్య=సూక్ష్మమైన దానియొక్క, స్థూలరూపతః=స్థూలరూపముగ; పరిణామః=పరిణమించుట, యథా=ఏ విధముగ; స్వప్నః=స్వప్నము; తథా=ఆవిధముగ; ఈశ్వరమహాచితః=ఈశ్వరుని మహాచిత్తుయొక్క పరిణామము; అస్మాకం=మనకు: జాగ్రత్ప్రపంచః=ఈ దృశ్యమాన ప్రపంచము (అగుచున్నది).

శ్లో॥ వికృతిః సర్వభూతాని ప్రకృతి ర్దేవతా పరా
సతః పాద స్తయో రాద్యా త్రిపాదీ ప్రకృతి ర్భవేత్ 13

పరా=సమస్తమునకు ఆశ్రయము, శ్రేష్ఠమునగు; దేవతా=దేవత; ప్రకృతిః=ప్రకృతియనబడును; సర్వభూతాని=సమస్తభూతములు; వికృతిః=దాని వికారములు (దానిచే నగుచున్నవి); సతః=సత్తుయొక్క; త్రిపాదీ=మూడు పాళ్లు గలది, ప్రకృతిః=ప్రకృతి అని చెప్పబడుచున్నది; పాదః=ఒకపాలు, ఆద్యా=వికృతి సమస్త జగత్తు అగుచున్నది.

సంపద కాకున్న వ్యష్టిబుద్ధియందు విషయముల తాదాత్మ్యము పొసగదు కదా? సమష్టి, వ్యష్టి విజ్ఞానములకు అభేదము ప్రత్యక్ష సిద్ధము. 10

వ్యాఖ్య మన విజ్ఞానమున తెలియు విషయము, గ్రహించు బుద్ధి అని రెండు యెట్లున్నవో అట్లే ప్రకృతియు, వికృతియు సమష్టి విజ్ఞానమున ఉన్నవి. 11

వ్యాఖ్య· మన సూక్ష్మమైన జ్ఞానము స్థూలమై స్వప్నమున ఎట్లు పరిణమించి కనబడుచున్నదో అట్లే ఈశ్వర మహాచిత్తు మన కగపడు ప్రపంచముగ పరిణమించుచున్నది. ఇట్లనుట పరిణామమున సూక్ష్మమునకు స్థూలమగుటే ఉపమానము గాని ఈ జాగ్రత్ప్రపంచము ఈశ్వర స్వప్నము కాదనుటకు జాగ్రత్ అను విశేషణము వాడబడినది. విజ్ఞానమునకు స్థూలాకారముగ పరిణమించు శక్తి కలదనుటకే ఉపమానము పరిమితమైనది 12

వ్యాఖ్య: పరిణామము నందిన,సమస్త భూతములు వికృతులు. పరదేవత ప్రకృతి. వికృతి సత్తునందు ఒక పాలు, ప్రకృతి మూడు పాళ్ళు అయి ఉన్నవి. 'పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి' అని శ్రుతి ప్రమాణము. ప్రకృతియే పరాదేవత. 13

శ్లో॥ కబలీకృత్య సంకల్పా నేకాపి స్యాద్యథామతిః
భూతాని కబలీకృత్య దేవతాపి తథా పరా 14

మతిః=మన బుద్ధి; సంకల్పాన్ = సంకల్పము లను, కబలీకృత్య=ముగించి, యథా=ఏ విధముగ; ఏకాపి = ఒక్కటిగ; స్యాత్ =అగునో; తథా=ఆ విధముగ; భూతాని=ప్రాణులను; కబలీకృత్య=తనలో నిమిడ్చుకొ ని; పరా దేవతాపి=పరాప్రకృతియు నుండును.

శ్లో॥ భూతానాత్మనః సర్గే సంహృతౌ చ తథాత్మని
ప్రభవే ద్దేవతా శ్రేష్ఠా సంకల్పానాం యథామతిః 15

ఆత్మనః=తనవలన; భూతానాం=ప్రాణులయొక్క; సర్గే=సృజనమందును; తథా=ఆ విధముగ; ఆత్మని=తనయందు, సంహృతౌ చ=ఉపసంహరించుటయందును, శ్రేష్ఠా=శ్రేష్ఠమైన; దేవతా =పరాప్రకృతి, యథా=ఏవిధముగ, మతిః=బుద్ధి, సంకల్పానాం =సంకల్పములను (చేయుటకు మానుటకు సమర్థమో అట్లే); ప్రభవేత్ =సమర్థమగును.

శ్లో॥ సదాశ్రయం గుణఘనం భూతం నానావిధం విదుః
సత ఏవ వికారాంశం సలిలస్యేవ బుద్బుదమ్ 16

సదాశ్రయం=సత్తు నాశ్రయించునట్టియు; గుణఘనం = గుణములచే ఘనీభవించినట్టియు; నానావిధం=అనేక విధములగు; భూతం=ప్రాణులను, విదుః= తెలియుచున్నారు, బుద్బుదమ్ = నీటి బుడగ, సలిలస్య=నీటియొక్క; వికారాంశం=వికారాంశ మగునట్లే, భూతం=భూతము, సత ఏవ=సత్తుయొక్క వికారము అని తెలియుచున్నారు.

వ్యాఖ్య : మన మనస్సు సంకల్పముల నరికట్టి ఏకాకిగ ఎట్లుండునో అట్లే పరాప్రకృతి భూతములను సృజింపక తనలో నిమిడ్చి ఏకాకిగా నుండవచ్చును. మన సంకల్పము ఊహా మాత్రమై సృజనయందసమర్థ మగును నిస్సంకల్ప స్థితియందు సంకల్పములు, మనోవృత్తులు నశించి మనమునందేకమగును. అప్పుడు వానికి వేరుగ ఉనికి లేదు. అట్లే పరాదేవత సంకల్పము వలన భూతములు కలుగుచున్నవి అది సంకల్పముల నుపసంహరించిన భూతము లన్నియు తనయందేక రూపముగ నిలిచి యుండునని భావము. 14

వ్యాఖ్య మన మనస్సు సంకల్పించుట మాని ఏకాకిగ ఉండుటకు ఎట్లు సమర్థమో, శ్రేష్ఠమైన పరదేవత అను ప్రకృతి భూతములను సృష్టించుటకు తనలో నుపసంహరించుటకును సమర్థమగుచున్నది. 15

వ్యాఖ్య : నీటి బుడగ నీటియొక్క వికారమగునట్లే సత్తుయొక్క వికారాంశము సత్తు నాశ్రయించి గుణములచే ఘనీభవించి నానావిధములగు భూతములుగ నగుచున్నది. వికారాంశలు విడిచి చూచిన సత్తే కానగును. నీటి బుడగ వికారమును విడిచి చూచిన నీరు కానగును కదా? 16

శ్లో॥ వ్యాపారో న పృథగ్వస్తు వస్తు న శ్చలనం హి తత్
సత్తాతిః కాపరాజాతిః విశేషో గుణవైభవమ్ 17

వ్యాపారః=సద్వ్యాపారము; పృథక్ = వేరుగ; వస్తు= వస్తువు (పదార్థము); న=కాదు; తత్ =ఆ వ్యాపారము; వస్తునః =సత్తయొక్క; చలనం=సంచలనము; హి=కదా; సత్తాతిః= సత్తుకన్న; పరా=ఇతరమైన; జాతిః=జాతి; కా=ఏమి, విశేషః= భిన్నరూపముగ కానగు విశేషము; గుణవైభవమ్=గుణముల వైభవము.

శ్లో॥ వస్తుత్వం సమవాయస్య న సంబాధత్వ మాత్రితః
అభావస్యతు భావత్వం కో నిరూపయితుం క్షమః? 18

సంబంధత్వ మాత్రితః=సంబంధము కలదను సంబంధ మాత్రముచే; సమవాయస్య=సమవాయమునకు, వస్తుత్వం= వస్తుత్వము; న=లేదు, అభావస్య=అభావమునకు; భావత్వం= భావమును; కః=ఎవడు; నిరూపయితుం=చూపుటకు; క్షమః= సమర్థుడు?

శ్లో॥ గుణాదేర్ధర్మ భూతత్వా దస్తునామ పదార్థతా
సత్ప్రతిద్వంద్వి వస్తుత్వా పార్థక్యేన న సిధ్యతి॥ 19

ధర్మభూతత్వాత్ = ధర్మములగుటచే; గుణాదేః=గుణ ములు మొదలగువానికి; పదార్థతా=పదార్థత్వము; అస్తునామ= అగుగాత (కాని); సత్ప్రతిద్వంద్వి వస్తుత్వం=సత్తునకు ఈడగు వసుత్వము; పార్థక్యేన=సత్తునకు వేరుగా నుండుటచే, న సిధ్యతి =సిద్ధింపదు.

శ్లో॥ వస్తుశక్తిశ్చ విశ్వస్య నిమిత్తం ప్రకృతిశ్చ తత్
జ్ఞానం ధర్మిచ ధర్మశ్చ భావత్వాత్స దుదీర్యతే 20

వ్యాఖ్య : వస్తువుయొక్క చలనమే వ్యాపారము. కాని అది విభిన్నమైన వస్తువు కాదు. సత్తుకన్న ఇతరమగు జాతి లేదు. గుణవైభవమే విశేషము. కాన విశేషము గుణములకన్న భిన్నము కాదు. 17

వ్యాఖ్య : సమవాయ మనునది సంబంధము. అంతమాత్రముచే దానికి వస్తుత్వము సిద్ధింపదు. అభావమునకు భావత్వము ఎవరును నిరూపింపజాలరు. కావున అది వస్తువు కాదు. 'నాసతో విద్యతే భావః నాభావో విద్యతే సతః' అని స్మృతి ప్రమాణము. కార్యకారణములకు కేవల వస్తు పరీక్షయందు అభేదమే కాని అది సంబంధము కాదు. గుణాదులకు సమవాయము సంయోగమువలె ఒక వ్యాపారము కాదు. అభావము కాదు. అయుత సిద్ధి అగును. దానినే అపృథక్ సిద్ధి అందురు సమవాయమే అపృథక్ సిద్ధి. కాన అది వేరు వస్తువు కాదు. 18

వ్యాఖ్య : గుణాగులు ధర్మము లగుటచేత వానికి పదార్థములు అను వ్యవహారము కలుగవచ్చును కాని సత్తుకన్న అని భిన్నములు. వేరుగ నుండగలిగినవి కావు. కాన నవి వేరు వస్తువు లనజాలము. 19

వ్యాఖ్య : ఈ జగమునకు వస్తుశక్తియు, ప్రకృతియు నిమిత్తకారణములు. ధర్మము, ధర్మి అను జ్ఞానములు భావములగు

విశ్వస్య=జగమునకు; వస్తుశక్తిశ్చ=వస్తువు, శక్తియును; తత్ =ఆ; ప్రకృతిశ్చ=ప్రకృతియును, నిమిత్తం=నిమిత్త కారణములు; ధర్మిచ=ధర్మియైనట్టియు; ధర్మశ్చ=ధర్మభూతమైనట్టియు; జ్ఞానం=జ్ఞానము; భావత్వాత్ =భావమగుటచేత; సత్ =సత్తు అని; ఉదీర్యతే=చెప్పబడుచున్నది.

## 2. మాయాధికరణము

శ్లో॥ మాయాంబా ప్రకృతిః శక్తిః కాలో దిఙ్మహిమా మహాః
ప్రాణశ్చ ధర్మభూతాయాః సంవిదో నామ సంగ్రహాః 21

మాయా, అంబా, ప్రకృతిః, శక్తిః, కాలః, దిక్ , మహిమా, మహః, ప్రాణః అను పదములు; ధర్మభూతాయాః=ధర్మమైన; సంవిదః=సంవిత్తుకు; నామ సంగ్రహాః=సంక్షేపముగ తెలుపు నామములు.

శ్లో॥ వైచిత్ర్యా దుచ్యతే మాయా విశ్వగర్భత యాంబికా
విశ్వస్యోపాదాన తయా ప్రకృతిః పరికీర్తితా॥ 22

టచే సత్ అని వ్యవహరింపబడుచున్నవి కాన సత్తుకన్న గుణములు భిన్నపదార్థములు కావు. సత్ అనగా ధర్మ ధర్మిభూత జ్ఞానము అని భావము. అది ఒక్కటియే పదార్థమని ఉపనిషన్మతము ఇక 'ద్రవ్యగుణ సామాన్య విశేష సమవాయాః సప్తపదార్థాః' అను సూత్రము ఉపనిషన్మతము కాదని క్రమముగ నిందు తెలుపబడినది. ద్రవ్యగుణ సామాన్య విశేష సమవాయములకు ద్రవ్యత్వము వేదాంత మతమున అంగీకరింపబడలేదు. ఆమతిమున ద్రవ్యలక్షణము తక్కినవారి మతమునందగు ద్రవ్య సంఖ్యానము దోషయుతమనియు, సత్తు అనునది (జ్ఞానాపర పర్యాయము) ఒక్కటే ద్రవ్యమనియు నిరూపించబడినది. ఇది ఉపనిషత్సమ్మతము. వేద నిరూపితము అని నిర్ధారణ చేయబడినది. కణాదుడు, కపిలుడు, పతంజలి తెలిపిన ద్రవ్యసంఖ్యానము గుణాదులందు విభూతులందు ప్రకృత్యంతర్భావమును చెందుచున్నవని క్రమముగ నిరూపింపబడును. ఇక మాయాపర పర్యాయమగు ప్రకృతి నిరూపింప బడును. 20

## 2. మాయాధికరణము

వ్యాఖ్య : గుణాదులు ధర్మములు. గుణిధర్మి. ధర్మము, ధర్మియు సత్, జ్ఞానము అని వ్యవహరింప బడునని పూర్వమే తెలుపబడినది. ధర్మమగు సంవిత్తుకు మాయ, అంబ, ప్రకృతి, కాలము, దిక్కు, మహిమ, మనస్సు, ప్రాణము అనునవి నామములు. 21

వ్యాఖ్య : సంవిత్తుకు విచిత్రమైనదగుటచే మాయ అనియు, విశ్వము తనలో నుండుటచే నంబిక అనియు, ఉపాదాన కారణమగుటచే ప్రకృతి అనియు నామములు కలిగినవి.

వైచిత్ర్యాత్ = విచిత్రమైన దగుటచే; మాయా = మాయ అని; ఉచ్యతే = వ్యవహరింపబడుచున్నది, విశ్వగర్భతయా = విశ్వము గర్భమునందు ధరించుటచే. అంబికా = అంబిక అనియు, విశ్వస్య = జగమునకు, ఉపాదానతయా = ఉపాదాన కారణమగుటచే; ప్రకృతిః = ప్రకృతి అనియు, పరికీర్తితా = చెప్పబడు చున్నది.

శ్లో॥ శక్తిః సర్వసమర్థత్వాత్ కాలోఽస్య పచనాద్భవేత్
దిక్సమస్తాశ్రయత్వేన మహిమా వ్యాపకత్వతః॥ 23

సర్వ సమర్థత్వాత్ = అన్నిటికి సమర్థమైనదగుటచే, శక్తిః = శక్తి అనియు, అస్య = దీః కి (సంవిత్తునకు); పచనాత్ = పాచకత్వముచే (పరిణామమును కలిగించుటచే); కాలః = కాలమనియు; సమస్తాశ్రయత్వేన = జగమున కాశ్రయమగుటచే; దిక్ = దిక్కు అనియు, వ్యాప- త్వతః = అంతటా వ్యాపించియుండుటచే, మహిమా = మహిమ అనియు పేరులు కలిగినవి.

శ్లో॥ స్వప్రకాశతయా తేజః ప్రాణో విశ్వస్య చాలనాత్
అనన్యా బ్రహ్మణ స్సేయమన్యాతు వ్యవహారతః 24

స్వప్రకాశతయా = తనను ప్రకాశింప చేయునదగుటచే; తేజః = మహస్సు అనియు; విశ్వస్య = జగముయొక్క; చాలనాత్ = చాలకమగుటచేత; ప్రాణః = ప్రాణమనియు (వ్యవహారములు కలిగినవి); సా, ఇయం = ఆ, ఈ (ప్రకృతి,) బ్రహ్మణః = బ్రహ్మపదార్థముకన్న; అనన్య = భిన్నమైనది కాదు; వ్యవహారతః తు = వ్యవహారముచేత మాత్రము; అన్యా = భిన్నమైనది.

శ్లో॥ అన్తరం వస్తునో జ్ఞాతృ తచ్ఛక్తం వ్యవహారతః
శాఖాః స్సమన్తతో జ్ఞానం సా శక్తి ర్వ్యవహారతః॥ 25

వస్తునః = పదార్థముయొక్క, అంతరం = భేదములు; జ్ఞాతృ = తెలుసుకొనువాడు (అగు), తత్ = అది (ఆ వస్తువు); శక్తం ఇతి = శక్తము అని; వ్యవహారతః = వ్యవహరింపబడును;

వ్యాఖ్య : సర్వ సమర్థమైన దగుటచే శక్తి అనియు, పరిణామము కలిగించుటచే కాలమనియు జగత్తునకు ఆశ్రయమగుటచే దిక్కు అనియు, అంతటా వ్యాపించుటచే మహిమ అనియు నామములు కలిగెను. 23

వ్యాఖ్య : తాను ప్రకాశించిన దగుటచే తేజస్సు (మనస్సు) అనియు, విశ్వచాలక మగుటచే ప్రాణమనియు, దీనికే వ్యవహారములు. ఇది వ్యవహార దశయందే బ్రహ్మకన్న భిన్నము కాని వాస్తముగ బ్రహ్మకన్న అభిన్నము. కాన వీనికి పదార్థాంతర గణన లేదు. గుణ విభూత్యాదులచే అన్య వ్యవహారమని భావము. 24

వ్యాఖ్య : ఆ వస్తువు, పదార్థము లేక బ్రహ్మ యొక్క తెలుసుకొను ద్రష్టయగు వస్తువ్యక్తశక్తము అని వ్యవహరింపబడును. తెలియబడు, చూడబడు విస్తృత శాఖాజ్ఞానము శక్తి అని వ్యవహరింపబడును. ఈ శక్త, శక్తులకు

సమస్తతః=అంతటను వ్యాపించియున్న; శాఖాః=శాఖలుగానున్న, జ్ఞానం=జ్ఞానము; సా=ఆమె (ప్రకృతి); శక్తిః=శక్తి (అని); వ్యవహారతః=వ్యవహరింపబడును.

శ్లో॥ ప్రచక్షతే చిదాత్మత్వం జ్ఞాతుర్జ్ఞానస్య చోభయోః
మండలస్య చ రశ్మీనాం జ్యోతిరాకృతితా యథా 26

మండలస్య=సూర్యమండలమునకు; రశ్మీనాంచ=కిరణములకు, జ్యోతిరాకృతితాం=జ్యోతియే ఆకారమగుటను, యథా=ఏ విధముగ చెప్పుదురో అట్లే, ఉభయోః=రెండైన, జ్ఞాతుః=జ్ఞాతకు; జ్ఞానస్యచ=జ్ఞానమునకును; చిదాత్మత్వం= చిత్తే ఆత్మగ నుండుటను; ప్రచక్షతే=చెప్పుచున్నారు.

శ్లో॥ చిత ఏక పదార్థత్వా చ్చిచ్చితా న్న విశిష్యతే
తస్మాద్గుణత్వం జ్ఞానస్య శంకరేణ నిరాకృతమ్ 27

చితః = చిత్తుయొక్క, ఏకపదార్థత్వాత్ =ఒకే పదార్థమగుటవలన; చిత్, చితా=చిత్తు, చిత్తుకన్న, నవిశిష్యతే=వేరగుట లేదు; తస్మాత్ =అందువలన; జ్ఞానస్య=జ్ఞానమునకు; గుణత్వం=గుణత్వము; శంకరేణ=శంకరాచార్యుల వారిచే; నిరాకృతమ్=నిరాకరింపబడినది.

శ్లో॥ జ్ఞాతు ర్జ్ఞానం స్వరూపం స్యా న్నగుణో నాపి చ క్రియా
యది స్వస్య స్వరూపేణ వైశిష్ట్య మనవస్థితిః 28

జ్ఞాతుః = జ్ఞాతకు, జ్ఞానం=జ్ఞానము; స్వరూపంస్యాత్ = స్వరూపం అయితే, నగుణః=గుణముకాదు; నక్రియా=క్రియయు కాదు; స్వస్య=తనకు; స్వరూపేణ = తన రూపమగు దానితో; వైశిష్ట్యమ్ యది = వేరైనచో, అనవస్థితిః = అనవస్థాదోషము కలుగును.

వ్యాపార భేదముచే నామభేదముగాని, నిర్విషయ స్థితి యందు ద్రివ్య భేదము లేదు. 25

వ్యాఖ్య: మండలమునకును, కిరణములకు జ్యోతియే ఆకారమగు నట్లు జ్ఞాతకు, జ్ఞానమునకు చిదాత్మత్వమును చెప్పు చున్నారు. 26

వ్యాఖ్య: చిత్తు ఒకేపదార్థమగుటవలన, చిత్తునుండి చిత్త్వము వేరై పరిగణింపబడదు. అందుచేతనే శంకరులు జ్ఞానము గుణము కాదు అని నిషేధించిరి. 27

వ్యాఖ్య: జ్ఞాతకు జ్ఞానము గుణముగాని, క్రియగాని కాదు. అట్లే తనకు తన రూపములో విశిష్టత్వము ( వేరగుట ) ఉన్నచో అనవస్థా దోషము కలుగును. 28

శ్లో॥ వాచైవ శక్యతే కర్తుం విభాగః స్వస్వరూపయోః
నానుభూత్యా తతోఽద్వైతం సచ్ఛక్త్యోర్వ్యావహారికమ్॥ 29

స్వస్వరూపయోః=జ్ఞానమునకు, జ్ఞానగోచర విషయము నకు; విభాగః=విభాగము, కర్తుం=చేయుట; వాచాఏవ=వాక్కు చేతనే; శక్యతే=సాధ్యమగుచున్నది; అనుభూత్యా=అనుభవము చేత; న=అగుటలేదు; తతః=అందువలన; సత్, శక్త్యోః=సత్తుకు, శక్తికి· అద్వైతం = అద్వైతము చెప్పబడుచున్నది; వ్యావహారికమ్=వ్యవహరింపబడుచున్నది.

శ్లో॥ విజ్ఞానస్య గుణత్వం యద్విజ్ఞాతు ర్ద్రివ్యతా చ యా ।
ధర్మత్వాదపి ధర్మిత్వా ద్వ్యవహారేతు భక్తతః 30

విజ్ఞానస్య=విజ్ఞానమునకు; యత్=ఏ, గుణత్వం=గుణత్వ వ్యవహారమో అది; విజ్ఞాతుః=విజ్ఞాతకు; ద్రివ్యతా, చ, యా=ఏ ద్రివ్యత్వ వ్యవహారమో, అదియు; ధర్మత్వాత్=ధర్మత్వము చేతను; అపిచ=మరియు, ధర్మిత్వాత్=ధర్మిత్వముచేతను; భక్తితః =లాక్షణికముగ, వ్యవహారేతు=వ్యవహార దశయందు మాత్రమే అగుచున్నది.

శ్లో॥ అన్తరావర్త భూయస్త్వా దేకస్మి న్బోధసాగరే ।
బోద్ధారో బహవోఽభూవ న్వస్తు నైవతు భిద్యతే 31

ఏకస్మిన్=ఒక్కటియగు, బోధసాగరే=జ్ఞాన సముద్రమున; అన్తరావర్త భూయస్త్వాత్=లోపలఅనేక సుడులగుటచే, బోద్ధారః = తెలియువారు; బహవః=అనేకులు; అభూవన్ = అయిరి. వస్తుఏవతు=పదార్థమయితే, (పదార్థము మాత్రము)నభిద్యతే= వేరగుటలేదు.

వ్యాఖ్య : జ్ఞానమునకు, జ్ఞానగోచర విషయమునకు విభాగము వాక్కుచేతనే చెప్పుటకు శక్యమగునుగాని, అనుభవము చే లేదు. అందుచే సచ్ఛక్తులకు అద్వైతమే సిద్ధించుచున్నది భేదము వ్యవహారదశయందున్నది. 29

వ్యాఖ్య : విజ్ఞానమునకు గుణవ్యవహారము, విజ్ఞాతకు ద్రవ్యవ్యవహారము ధర్మ ధర్మిత్వములచే వ్యవహారమున లాక్షణికముగ నగుచున్నవి. 30

వ్యాఖ్య : ఒకటియగు జ్ఞానసముద్రమున అనేకములగు ఆవర్తములేర్పడినవి, కాన బోద్ధలు అనేకులైరి. కాని వస్తువు భిన్నము కాలేదు. సముద్రముకన్న సుడులెట్లు భిన్నములు కావో అట్లే జ్ఞానముకన్న జ్ఞాతలు వేరుగనుండరు. ఏకరూపులు. 31

# ద్వితీయః పరిచ్ఛేదః

## 3 ద్వివిధాకాశాధికరణమ్

శ్లో॥ ఆకాశం ద్వివిధం ప్రోక్తం పూర్వం శుద్ధ ముదీరితం ।
అన్యద్రజ స్సమాఖ్యాతం ఆధారాధేయతా తయోః 1

ఆకాశం=ఆకాశము (శక్తి); ద్వివిధం=రెండు విధములు; పూర్వం=మొదటిది; శుద్ధం=శుద్ధాకాశమని; ఉదీరితం=పలుక బడినది, అన్యత్=రెండవది; రజస్సమాఖ్యాతం=రజోమయ ఆకాశమనబడుచున్నది. తయోః=ఆ రెండింటికి, ఆధారాధేయతా=ఆధార ఆధేయభావము సంబంధము.

శ్లో॥ ప్రోక్తం శుద్ధం యదాకాశం తచ్ఛక్తే ర్నాతిరిచ్యతే ।
ఆకాశబ్రహ్మణో స్తస్మా దభేద ఉపపద్యతే ॥ 2

యత్=ఏ; శుద్ధం=శుద్ధమైన, ఆకాశం=ఆకాశమని; ప్రోక్తం=చెప్పబడినదో; తత్=అది, శక్తేః=శక్తికంటె, న అతిరిచ్యతే=భిన్నము కాదు; తస్మాత్=ఆకారణముచేత; ఆకాశబ్రహ్మణోః=ఆకాశమునకు, బ్రహ్మకు; అభేదః=అభేదము; ఉపపద్యతే =సంపన్నమగుచున్నది.

శ్లో॥ అన్యద్రజో యదాకాశం సమాఖ్యాతం తదాశ్రితమ్ ।
స సర్వభూతబీజానాం శక్తే రుద్గార ఇష్యతే ॥ 3

అన్యత్=రెండవదైన; తదాశ్రితమ్=శుద్ధాకాశము నాశ్రయించి ఉన్న, రజః=రజోమయమని; సమాఖ్యాతం=వ్యవహరింపబడుచున్నదో, సః=ఆ రజోమయాకాశము; సర్వభూత బీజానాం= సమస్తభూత బీజములయొక్క, శక్తేః=శక్తి సంబంధమైన; ఉద్గారః =ఉద్గారము అని; ఇష్యతే=అంగీకరింపబడుచున్నది.

# రెండవ పరిచ్ఛేదము

## 3 ద్వివిధాకాశాధికరణము

ధర్మ, ధర్మిజ్ఞానము (శక్తి, శక్తి విభాగము) వాని అభేదము, భేదవ్యవహారము నిరూపింపబడినవి ఇందు శక్తి స్వరూపము వివరింపబడుచున్నది.

వ్యాఖ్య శుద్ధాకాశము, రజోమయాకాశము అని ఆకాశము రెండు విధములు. వానికి ఆధార ఆధేయ భావము సంబంధము. 1

వ్యాఖ్య : శుద్ధాకాశముకన్న శక్తి భిన్నము కాదు. కనుకనే 'ఆకాశం బ్రహ్మ' అను వాక్యము అర్థమై తెలుపబడినది. ఆకాశ బ్రహ్మలకు అభేదము సిద్ధించుచున్నది. 2

వ్యాఖ్య : శుద్ధాకాశము నాశ్రయించి ఉన్న ఆ రజోమయాకాశము సర్వభూత బీజరూపమైన శక్తియొక్క ఉద్గారమని తెలుపుచున్నారు. 3

శ్లో॥ న సర్వభూత బీజాని వస్తూని స్యుః పృథక్ పృథక్
సతి ప్రాగవిభక్తాని బభూవు రితి శుశ్రుమ . 4

సర్వభూత బీజాని = సమస్తములైన భూతబీజములు; పృథక్ పృథక్ = వేరువేరగు, వస్తూని = వస్తువులు, న స్యుః= కావు; ప్రాక్ =బీజావస్థకు పూర్వము; సతి=సత్తునందు, అవిభక్తాని = వేరుకాక, బభూవుః = అయి ఉన్నవి, ఇతి = ఇట్లు; శుశ్రుమ=వింటిమి.

శ్లో॥ యథాస్యాత్ స్మృతి బీజానాం ప్రజ్ఞయా మవిశేషతః।
తథా స్యా ద్భూత బీజానాం అవిభక్తః స్థితిః సతి 5

స్మృతి బీజానాం = మన స్మృతి యందగు వాని బీజములు; ప్రజ్ఞాయాం=జ్ఞానమున; అవిశేషతః=వేరుకాక: యథా = ఏ విధముగ నున్నవో; తథా=ఆ విధముగ; భూత బీజానాం=భూత బీజములకు, సతి=సత్తునందు, అవిభక్తస్థితిః=వేరుగ లేక ఉండుట అగుచున్నది.

శ్లో నాణూని భూతబీజాని ప్రాక్సర్గాత్సతి సంస్థితౌ
చితిశక్త్యాత్మకాన్యేవ నిరాకారాణి సర్వదా ॥ 6

సర్గాత్ = సృష్టికంటె, ప్రాక్ =ముందు, భూతబీజాని= భూత బీజములు; సతి=సత్తునందు, సంస్థితౌ=ఉండుటయందు, న అణూని = వేరువేరగు అణురూపములు కావు; సర్వదా=ఎప్పుడును, నిరాకారాణి=ఆకారము లేనివియు; చితి=చిత్తునందు; శక్త్యాత్మకాని ఏవ=శక్తిస్వరూపము కలిగియే యున్నవి.

శ్లో॥ శుద్ధాకాశ ప్రకృతికం తదాకాశం రజోమయమ్
సఏవ ప్రథమస్సర్గః పరమస్యాత్మనో మతః 7

వ్యాఖ్య : ఆ సర్వభూత బీజములు వేరువేరగు వస్తువులు కావు. బీజావస్థకు పూర్వము అవి సత్తునందు అవిభక్తములుగ ఉన్నవని వింటిమి (వేదప్రమాణము వలన). కనుకనే సత్పదార్థ మొక్కటే అని తెలుపబడినది. 4

వ్యాఖ్య : స్మృతి బీజములు మన ప్రజ్ఞయందు ఎట్లు భిన్నములు కాక ఏకరూపముగ ఉన్నవో, అట్లే సత్తునందు భూత బీజములు అవిభక్తములుగా నున్నవి. 5

వ్యాఖ్య . సృష్టికి పూర్వమందు భూతబీజములు సత్తునందున్నప్పుడు వేరువేరగు అణువులు కావు. అవి ఎల్లప్పుడు చిత్తునందు శక్తి స్వరూపములు, నిరాకారములునై యున్నవి. ఇట్లనుటచే అణువులే సృష్టి బీజములన్నట్టియు, వానికి వేరు పదార్థత్వము అంగీకరించువారి మతము ఉపనిషత్సమ్మతము కాదని తెలివిడి. 6

శుద్ధాకాశ ప్రకృతికం=శుద్ధాకాశము ప్రకృతిగా కలిగి నట్టి; తత్ ఆకాశం=ఆ ఆకాశమే; రజోమయమ్=రజోమయా కాశము, స ఏవ=ఆ రజోమయాకాశమే, పరమస్య ఆత్మనః=పర మాత్మ యొక్క; ప్రథమః=మొదటిదియగు; సర్గః=సృష్టి అని; మతః=అభిప్రాయము.

శ్లో॥ నామధేయ మసామాన్యం ద్యౌః శుద్ధస్య విహాయసః
రజోమయాన్తరిక్షం నామా సామాన్య మిష్యతే 8

శుద్ధస్య విహాయసః = శుద్ధాకాశమునకు; అసామాన్యం= అసాధారణమగు; నామధేయం = పేరు; ద్యౌః=అనునది; రజో మయస్య=రజోమయాకాశమునకు, అన్తరిక్షం = అంతరిక్షమని; అసామాన్యం=అసాధారణమగు; నామ=నామము; ఇష్యతే= ఒప్పుచున్నది.

శ్లో॥ అన్యాని గగన వ్యోమ పుష్కర ప్రభృతీని తు
సాధారణాన్యపి ప్రాయః ప్రయుజ్యన్తే ద్వితీయకే 9

అన్యాని=ఇతరములగు; గగన, వ్యోమ, పుష్కర ప్రభృ తీని=గగనము; వ్యోమము, పుష్కరము మొదలగు నామములు; సాధారణాని అపి = రెండింటికి సాధారణముగ వ్యవహరించు చున్నను; ప్రాయః = తరచుగ; ద్వితీయకే = రజోమయాకాశ మును బోధించుట యందే; ప్రయుజ్యన్తే = ప్రయోగింపబడు చున్నవి.

## 4. మాతరిశ్వాధికరణమ్

శ్లో॥ అన్తరిక్షేతు విషయే విజ్ఞానం దీప్యదాత్మనః
ఏకాగ్రిత్వా త్ర్యవష్ధ్మోమ్మగభీర స్వరతాంగతమ్ ॥ 10

విషయే = విషయమైన; అన్తరిక్షే = అంతరిక్షమందు; ఆత్మనః = ఆత్మయొక్క; దీప్యత్ = ప్రకాశించుచున్న; విజ్ఞానం

వ్యాఖ్య : శుద్ధాకాశము ప్రకృతిగా కలిగిన రజోమయాకాశమే పరమాత్మయొక్క మొదటి సృష్టియని చెప్పుచున్నారు. 7

వ్యాఖ్య : శుద్ధాకాశమునకు ద్యౌః అనియు, రజోమయాకాశమునకు అంతరిక్షమనియు అసాధారణములగు నామములు. 8

వ్యాఖ్య : గగనము, వ్యోమము, పుష్కరము మొదలగు పదములు రెండు ఆకాశములను బోధించును. కాని రజోమయాకాశ వాచకములుగనే తరచుగ వాడబడుచున్నవి. 9

## 4 మాతరిశ్వాధికరణము

వ్యాఖ్య : ఆత్మయొక్క విజ్ఞానము అంతరిక్ష విషయకమై ఏకాగ్రమైన దగుటచేత ప్రవృద్ధోష్మ కలదియై గంభీర స్వర రూపమునందినది. 10

=అనుభవయుతమైన జ్ఞానము; ఏకాగ్రిత్వాత్ = ఒకే రూపము నందుట వలన; పరివృద్ధోష్మ = వృద్ధిపొందిన ఊష్మ కలదై; గభీర స్వరతాం=గంభీరమగు స్వరరూపమును; గతమ్=పొందినది

శ్లో॥ ద్విధైవం ధర్మభూతస్య జ్ఞానస్య వికృతిం వినా
శుద్ధత్వేచ స్వరత్వేచ విభిన్నేవ దశాఽభవత్ 11

ధర్మభూతస్య = ధర్మమైన; జ్ఞానస్య = జ్ఞానమునకు, వికృతిం వినా = వికృతి లేకయే; ఏవం = ఈ విధముగ; ద్విధా = రెండు విధములగుట సంభవించినది; శుద్ధత్వేచ = శుద్ధస్థితి యందును; స్వరత్వేచ = స్వరస్థితియందును; విభిన్నేవ = భిన్న మైన దానివలె; దశ = అవస్థ (రెండువిధములగునది)అభవత్ = ఆయెను

శ్లో॥ "ఏతత్కర్మార ఇవ సమధమ ద్బ్రహ్మణస్పతిః"
ఇతి యద్భాషితమ్మన్త్రే స్వరస్య ధమనంతు తత్ 12

ఏతత్ = ఈ స్వరమును, బ్రహ్మణస్పతిః = బ్రహ్మణస్పతి; కర్మార ఇవ=కర్మకారునివలె, సమధమత్ = మధించెను (శ్రుతినూదినట్లు పూరించెను),ఇతి=అని; మన్త్రే=వేదమంత్రమున; యత్ భాషితం = ఏదిచెప్పబడెనో; తత్ = అది, స్వరస్య ధమనంతు= స్వరధమనము.

శ్లో॥ ఏష స్వరాత్మకః ప్రాణో మాతరిశ్వా భిధీయతే
ధమనాపర పర్యాయా చ్ఛ్వసనా ద్వ్యోమ మాతరి ॥ 13

సర్వాత్మకః = సర్వాత్మకుడగు; ఏషః = వీడు, వ్యోమ మాతరి = ఆకాశమను తల్లియందు; ధమనాపర పర్యాయాత్ = ధమనమను పర్యాయ పదముగల, శ్వసనాత్ = శ్వసించుటవలన; మాతరిశ్వా= మాతరిశ్వఅని, అభిధీయతే = చెప్పబడుచున్నాడు.

వ్యాఖ్య : ఈ విధముగ ధర్మజ్ఞానము యొక్క స్థితి వికృతిలేకయే, శుద్ధత్వ స్వరత్వ భేదముచే రెండువిధములయినది వలె ఆయెను. వాస్తవముగ భిన్నము కాకున్నను అట్లయినది. 11

వ్యాఖ్య : బ్రహ్మణస్పతి కర్మారునివలె పూరించెనని వేదమంత్రమున కలదు. అధమన మనగా స్వరధమన మని భావము. 12

వ్యాఖ్య : సర్వాత్మకుడు ప్రాణరూపుడు అయిన నితడే ఆకాశమను తల్లియందు ధమనము అను పేరుగల శ్వాసనముచేయుటచే మాతరిశ్వ అని వ్యవహరింపబడుచున్నాడు. మాతరి వ్యోమ మాతరి శ్వసనాత్ మాతరిశ్వా (మాతరి శ్రయత ఇతి మాతరిశ్వా) 'తస్మిన్నాపో మాతరిశ్వా దధాతి' అను మంత్రము ఈతని సర్వప్రాణాత్మకత్వమునకు ప్రమాణము. 13

శ్లో॥ స్వరావిర్భావదేశత్వా ద్వ్యోమ్న స్తన్మాతృతోచ్యతే
భాక్తో భాషాచమత్కారో విజ్ఞేయః సతు కేవలమ్ ॥ 14

స్వరావిర్భావదేశత్వాత్ =స్వరముపుట్టు ప్రదేశమగుటచే; వ్యోమ్నః = ఆకాశమునకు; తన్మాతృత = వానికి తల్లి అగుట అని; ఉచ్యతే = చెప్పబడుచున్నది. సతు = ఆ చెప్పుట; భాక్తః =లాక్షణికము; భాషాచమత్కారః = చమత్కారకథన స్వరూపము అని; విజ్ఞేయః = తెలియదగినది.

శ్లో॥ శసనాన్మాతరిశ్వైవ సరుద్రో రోదితీత్యతః
ఇన్ద్రశ్చ గీతో వేదేయం పరమైశ్వర్య యోగతః ॥ 15

శ్వసనాత్ = శ్వాసక్రియావంతుడగుటచే; మాతరిశ్వ= మాతరిశ్వ అనియు, స ఏవ = వాడే; రోదితీతి అతః = ధ్వని చేయుచున్నాడు అను కారణముచే (స్వరమే ధ్వని); రుద్రః=రుద్రుడని; పరమైశ్వర్య యోగతః = మహదైశ్వర్యము కలవాడగుటచే; ఇన్ద్రః = ఇంద్రుడనియు; అయం = ఈ దేవతయే; వేదే = వేదమందు; గీతః = గానముచేయబడినాడు.

శ్లో॥ శుద్ధా చిదేవం స్త్రీనామా స్వరస్తు పురుషాహ్వయః।
భణ్యతే మన్త్రభాషాయాం సైకా శక్తిస్తు వస్తుతః 16

శుద్ధా చిత్ =శుద్ధమైన; చిత్పదార్థము; స్త్రీనామా=స్త్రీవాచకమైన పదము; స్వరఃతు = స్వరము అనునది; పురుషాహ్వయః = పురుష బోధకము;వస్తుతః, = వాస్తవముగ; సః=అది; ఏకా = ఒక్కటియే అగు; శక్తిః = శక్తి, మన్త్రభాషాయాం = మంత్ర వర్ణనములందు; తథా = ఆ విధముగ, స్త్రీ, పుంరూపములుగ శబ్దములను వ్యాపారములను అనుసరించి రెండు విధములుగ; భణ్యతే = చెప్పబడుచున్నది.

శ్లో॥ అవ్యక్తాత్స్వరతో భిన్నో వ్యక్త శ్శబ్దస్తు భౌతికః।
ద్వివో వివర్తః పూర్వస్యా ద్వ్యక్త సంఘర్షజః పరః 17

వ్యాఖ్య : స్వరము ఆకాశమున పుట్టును. కాన ఆకాశము తల్లి అని లాక్షణికముగ చమత్కారమునకే అట్లు చెప్పబడినది, కాని వాస్తవముగ మాతాపుత్రి సంబంధము లేదు. 14

వ్యాఖ్య : వ్యాపకక్రియావంతుడగుటచే మాతరిశ్వ అనియు, నాదవంతుడగుటచే రుద్రుడనియు, మహాదైశ్వర్యవంతుడగుటచే ఇంద్రుడనియు, వ్యాపారభేదము, నామభేదము కలిగి ఒకేవ్యక్తి వేదమున నుతింపబడినాడు. 'భీషాస్మాత్ వాతః పవతే' అని ఆతని మహాదైశ్వర్యత్వము నుతింపబడినది. అతని వైద్యుత తేజము వర్ణింపబడినది. 15

వ్యాఖ్య : ఒకేశక్తి మంత్రిభాషలో శుద్ధా చితః అని స్త్రీవాచకముగను స్వరః అని పురుషవాచకముగను చెప్పబడుచున్నది కాని భేదము లేదు. 16

వ్యాఖ్య · స్వరము అనునది దివమునకు అనగా శుద్ధాకాశమునకు వివర్తము. సువర్ణము కుండలాదిరూపముగ అగును.

భౌతిక = భూతములవలన కలుగు; వ్యక్తశబ్దః = వ్యక్తమగు శబ్దము; అవ్యక్తాత్ = అవ్యక్తమగు; స్వరతః = స్వరముకంటె; భిన్నః = వేరైనది; పూర్వః = మొదటిదియగు అవ్యక్తశబ్దము; దివః = దివమునకు; వివర్తః = వివర్తము, పరః = రెండవదియగు భౌతిక శబ్దము; వ్యక్తసంఘర్షజః = వ్యక్తమైన రెండింటి సంఘర్షణచే అగునది కావున అది వ్యక్త శబ్దము.

శ్లో॥ ఏవం భేదే ప్యభేదోఽస్తి శబ్దయో రుభయోరపి
పూర్వస్సముద్రవద్బోధ్యః పరో బోధ్య స్తరంగవత్ 18

ఉభయోః శబ్దయోః అపి=ఆ రెండు శబ్దములకును; ఏవం భేదేపి=ఇట్లు భేదమున్నను అభేదో అస్తి=అభేదమును కలదు. పూర్వః= మొదటిదగు స్వరము; సముద్రవత్ = సముద్రమువలె; బోధ్యః = తెలియదగినది, పరః=వ్యక్తశబ్దము, తరంగవత్ = తరంగము వంటిది అని, బోధ్యః= తెలియవలయును

శ్లో॥ యాచ విద్యుదియం దృశ్యాస్పృశ్యో యంచ సమీరణః।
తావుభావస్య సంయోగాచ్ఛక్తే రన్యా తరంగకా॥ 19

దృశ్యా=చూడబడు; యా ఇయం విద్యుత్ చ=ఈ మెరుపును; స్పృశ్యః=స్పృశింపబడు; అయం సమీరణః=ఈ వాయువును, తౌ ఉభౌ=ఆ రెండును, అస్య సంయోగాత్ =ఇతర సంఘర్షణచేనైన, శక్తేః=శక్తియొక్క; అన్యాతరంగకా=ఇతరములగు తరంగములు;

శ్లో వ్యక్తవర్ణమయ శ్శబ్దో యద్యపి బ్రహ్మణ స్పతిః
తథాపి తత్పదం భక్త్యా ప్రకృతౌ మాన్త్ర వర్ణికమ్॥ 20

వ్యక్త వర్ణమయః=వ్యక్తాక్షర రూపమగు, శబ్దః=శబ్దము, బ్రహ్మణస్పతిః యద్యపి=బ్రహ్మణస్పతి అయినను; మాన్త్రవర్ణికమ్= వేద మంత్రములందగు, తత్పదమ్=అపదము; ప్రకృతేః= ప్రకృతి యందు; భక్త్యా=లక్షణచే అగుచున్నది.

అప్పుడు సువర్ణము తన రూపమును వీడలేదు. స్వరూపమును వీడకయే కుండలరూపము నందినది. ఇట్టి మార్పునకు వివర్తమని పేరు. దివము స్వస్వరూపమును వీడకయే స్వరూపము నందిన దని భావము. వ్యక్తశబ్దము భౌతికములగు ఘర్షణలచే ఏర్పడును. కనుక అది మొదటి దానికన్న భిన్నము. 17

వ్యాఖ్య : ఇట్లే రెండు శబ్దములకు భేదమున్నను అభేదముకలదు. సముద్రముకన్న తరంగములు వేరుగ వ్యవహరింపబడి, భిన్నములుగ గోచరించుచున్నను, సముద్రముకన్న ఎటు అభిన్నములో అట్లే స్వరము సముద్రము వంటిది. వ్యక్త శబ్దములు తరంగములవంటివి అని తెలియవలయును. ఇట్లు భేదము, అభేదముకూడ వాని కగుచున్నది. 18

వ్యాఖ్య : ఈ కనబడుచున్న విద్యుత్తును, తాకిడిని కలిగి ఉన్న వాయువును శక్తి యొక్క రెండు తరంగములు. అన్యసంయోగ జన్యములు. 19

వ్యాఖ్య. బ్రహ్మణస్పతి అనగా వ్యక్త వర్ణమయ శబ్దము. వేద మంత్రమునందుగల ఆ పదము లక్షణచే ప్రకృతియగు దాని యందు వ్యవహరింపబడుచున్నది. వ్యక్తశబ్దముల కేది ప్రకృతియో (మూలమో) దానిని లక్షణచే బోధించు చున్నది. 20

## 5. తేజోఽబన్నాధి కరణమ్

శ్లో॥ అఖండ స్వరరూపస్య ప్రాణస్య ధమనాత్పునః
అంబరాదఖిలం వ్యక్త మసతః సదజాయత 21

అఖండ స్వరరూపస్య=అఖండ స్వరరూపమైన; ప్రాణస్య=ప్రాణముయొక్క, పునః = తిరిగి; ధమనాత్ =ధమనమువలన; అంబరాత్ =ఆకాశమునుండి; అఖిలం=సమస్త విశ్వము; వ్యక్తం=వ్యక్తమైనది; అసతః = అసత్తైన ఆకాశమునుండి; సత్ = ఈ గోచరమగు విశ్వము; అజాయత=పుట్టెను.

శ్లో॥ సర్వకారణ భావత్వాద్యథా బ్రహ్మేవ దీరితం
వికారభూత భావత్వా త్తిధా విశ్వం సదీరితం॥ 22

యథా=ఏ విధముగా; సర్వకారణ భావత్వాత్ =సర్వ ప్రపంచమునకు కారణమగుటచే; బ్రహ్మ=బ్రహ్మ; సత్ =సత్తు అని; ఈరితం=చెప్పబడినదో; తథా=ఆ విధముగ, వికారభూత భావత్వాత్ = కార్యమైన దగుటచే, విశ్వం=జగత్తు; సత్ =సత్తు అని, ఈరితం=చెప్పబడినది.

శ్లో॥ అవ్యక్తత్వేన విశ్వస్మా దాత్మనశ్చ జడత్వతః
విభక్తమివ మధ్యస్థం దృష్ట్యా మసదివాంబరమ్ 23

విశ్వస్మాత్ =ప్రపంచముకంటె, అవ్యక్తత్వేన=వ్యక్తము కాకుండుట చేతను; ఆత్మనశ్చ=ఆత్మకంటే, జడత్వతః=చైతన్య శూన్యమైన దగుటచేతను; విభక్తమివ = వేరైనదివలె; మధ్యస్థం=విశ్వమునకు, ఆత్మకు మధ్య ఉన్నదియు, దృష్ట్యామ్=చూపునందు; అంబరమ్=ఆకాశము; అసదివ=లేనిదానివలె ఉన్నది.

శ్లో॥ భూతత్రియస్యా వ్యవ్యక్త బీజరాశేః విహాయసః
తస్యాసత్వం లక్షణయా వ్యాఖ్యేయం మాంత్రివర్ణికం॥ 24

## 5. తేజోఽబన్నాధి కరణము

వ్యక్త శబ్దము, వ్యక్త విద్యుత్తు, వ్యక్త మారుతము, ఈ మూడు శక్తి తరంగములు క్రిందటి ప్రకరణాంతమున నిరూపింప బడినవి. ఇందు తేజము, అప్, అన్నము అనునవి వివరింపబడును.

వ్యాఖ్య : తిరిగి అఖండస్వరూపమైన ప్రాణఘమనముచే ఈ ఆకాశమునుండి విశ్వ ముత్పన్నమయ్యెను. దీనినే 'అసతః సదజాయత' అని వేదము అభివర్ణించినది. 21

వ్యాఖ్య : సర్వ జగత్కారణ మగుటచే బ్రహ్మ సచ్ఛబ్ద వాచ్యుడై నట్లు కార్యమైనదగుటచే జగత్తును సచ్ఛబ్ద వాచ్య మగు చున్నది. 22

వ్యాఖ్య : ఆకాశము వ్యక్త జడముకన్న అవ్యక్తమును, ఆత్మకన్న చైతన్య రహితమును అగుటచే మధ్యనున్నదాని వలెను, మన చూపునందు లేనిదానివలెను ఉన్నది 23

వ్యాఖ్య : 'అసతః సదజాయత' అను వేదమంత్రమున నున్న అసత్ అను పదమునకు కేవలము లేనిది అని ముఖ్యా

భూతత్రయస్యాపి=మూడు భూతములయొక్క, తస్య విహాయసః=ఆ ఆకాశముయొక్క, అవ్యక్త బీజరాశేః=అవ్యక్తమైన భూతబీజముల రాశి అయిన; మాంత్రి వర్ణికమ్=వేదమందగు; అసత్త్వం=అసత్వమును; లక్షణయా = లక్షణావృత్తి ననుసరించి; వ్యాఖ్యేయం=వ్యాఖ్యానింపదగినది.

శ్లో॥ అంబరే భవతా నిత్యం శక్తి పాకేన భూయసా
తేజోఽబన్నాని జాయన్తే త్రీణి వ్యక్తాని తు క్రమాత్ 25

నిత్యం=ఎల్లప్పుడు; అంబరే=ఆకాశమందు; భవతా= అగుచున్న; భూయసా=శ్రేష్ఠము, అధికములగు, శక్తి పాకేన= శక్తియొక్క పరిణామముచే, క్రమాత్ =క్రమముగ; త్రీణి= మూడగు; తేజోఽబన్నాని = తేజస్సు, అప్పు, అన్నము అను మూడును; వ్యక్తాని తు=వ్యక్తమైనవై; జాయన్తే=పుట్టుచున్నవి.

శ్లో॥ తేజస్సలిల భూమీనాం వ్యక్తత్వాద్భూత తేష్యతే
శుద్ధాకాశస్య వాయోశ్చభూత సంజ్ఞౌపచారికే 26

వ్యక్తత్వాత్ =వ్యక్తమైన దగుటవలన; తేజస్సలిల భూమీనాం= తేజస్సు, సలిలము భూమి అను మూడింటికి; భూతతా= భూతత్వము; ఇష్యతే=అంగీకరింపబడుచున్నది, శుద్ధాకాశస్య= శుద్ధాకాశమునకు; వాయోశ్చ=వాయువునకు; భూత సంజ్ఞా= భూతములు అను వ్యవహారము; ఔపచారికీ=లాక్షణికముగ అగుచున్నది.

శ్లో॥ వ్యక్తాః పృథక్ ప్రభాష్యన్తే తేజస్సలిల భూమయః।
అవ్యక్తా అంబరాభిఖ్యాః తస్మాన్న పృథగంబరం 27

ర్థము. కాని దాని కన్వయము లేనందున ఆ లేని అను ముఖ్యార్థమును విడిచి అన్యార్థమును గ్రహించి తెలుపవలెను. ఆ అన్యార్థమునే ఇందు వివరించుచున్నాను. అసతః అనగా మనకు శూన్యముగ దృష్టికి అగపడునదియు, వాస్తవమునకు భూతత్రయ బీజములున్నట్టియు ఆకాశము అని అర్థమును గ్రహింపవలెను. కాగా భూతత్రియ బీజరాశియై మనకు అసత్తువలె కానవచ్చునది ఆకాశము అని వేదమంత్రమున గల అసతః అను పదమునకు అర్థము గ్రహించి దాని నుండి వ్యక్త ప్రపంచము పుట్టెనని చెప్పవలయును. 24

వ్యాఖ్య · ఆకాశమున ఎప్పుడు జరుగుచున్న అ శీఘ్రమైన శక్తిపాకముచే క్రమముగ మూడగు తేజస్సు, అప్పు, అన్నము అను వ్యక్త భూతములు పుట్టుచున్నవి. 25

వ్యాఖ్య · వ్యక్తమైన దానికే భూతవ్యవహారము. శుద్ధాకాశము, వాయువు వ్యక్త భూతములు కావు. కావున వానికి ముఖ్యార్థముచే సంజ్ఞ లేదు అట్లైనను భూతములకు కారణములగు సంబంధముచే లాక్షణికముగ భూతవ్యవహారము సిద్ధించుచున్నది. 26

వ్యాఖ్య తేజస్సలిల భూములు అవ్యక్తావస్థలో అంబర రూపమున ఉన్నవి. అవి వ్యక్తమై తేజస్సలిల భూములని

వ్యక్తాః=వ్యక్తములైన; తేజస్సలిల భూమయః= తేజస్సు, నీరు, భూమి అనునవి, పృథక్ = వేరుగ; పరిభావ్యన్తే= చెప్పబడుచున్నవి; అవ్యక్తాః=వ్యక్తము కాని ఆ మూడు భూతములు; అంబరాభిఖ్యాః=అంబరము అని చెప్పబడుచున్నవి; తస్మాత్ = ఆ కారణముచే; అంబరం=ఆకాశము నపృథక్ = వేరు భూతము కాదు.

శ్లో॥ త్రివృత్కరణ సిద్ధాన్త స్సమతః శ్రుతి సూత్రయోః ।
పంచీకరణ సిద్ధాన్తో నవ్యానామేవ ధీమతాం ॥ 28

త్రివృత్కరణ సిద్ధాన్తః=మూడు భూతములకే సృష్టి జరుగుచున్నది అను భూతత్రయ సిద్ధాంతము, శ్రుతి సూత్రయోః= వేదములకు, బ్రహ్మ సూత్రములకు, సమ్మతః=అంగీకృతమైనది; నవ్యానాం = నవీనులగు, ధీమతాం = బుద్ధిమంతుల మతమున; పంచీకరణ సిద్ధాన్తః=పంచభూతములను సిద్ధాంతము సమ్మతమగుచున్నది.

శ్లో॥ తేజసో రోహితం రూపం అపాం శుక్ల ముదీరితం
కృష్ణమన్నస్య రూపస్తు త్రివృత్సు త్రికసంకరః॥ 29

తేజసః = తేజస్సునకు; రోహితం=రోహితవర్ణము, రూపం= రూపము, అపాం=జలమునకు, శుక్లం= తెలుపు, రూపం= రూపము, అన్నస్య=అన్నముయొక్క, రూపస్తు= రూపమైతే, కృష్ణం=నలుపులని; ఉదీరితం = చెప్పబడినది; త్రివృత్సు=మూడును కలియు నపుడు; త్రికసంకరః=మూడింటియొక్క సంకర రూపముండును.

శ్లో॥ రక్తశుక్లాఽసితా యోక్తా ప్రకృతిః శిరసి శ్రుతేః
సామిీషాం త్రివృతాం యోనిః తేజోఽబన్నాత్మికామతా॥ 30

శ్రుతేః= వేదముయొక్క; శిరసి=శిరస్సునందు, (ఉపనిషత్తునందు) యాప్రకృతిః=ఏ ప్రకృతి, రక్తశుక్లాఽసితా=రక్తవర్ణము;

వ్యవహరింపబడుచున్నవి కాన ఆకాశము అవ్యక్త భూతములకన్న భిన్నము కాదు. కానసే దానికి భూత సంజ్ఞ లాక్షణిక మగుచున్నది. 27

వ్యాఖ్య: మూడు భూతములను సిద్ధాంతము, సృష్టికి భూత సంకర మున శ్రుతి స్మృతి సమ్మతము. నవీనుల మతమున పంచభూత సిద్ధాంతము వ్యాప్తమైనది. 28

వ్యాఖ్య: తేజమునకు ఎఱుపు రంగు ఉండును. జలము తెల్లని వర్ణమున నుండును. అన్న రూపము నలుపు. మూడింటీ సంకరమందు వర్ణమును సంకరమై యుండును. 29

వ్యాఖ్య ఉపనిషత్తునందు ఏది రక్త శుక్లాసితమైన ప్రకృతి అని వర్ణింపబడినదో అది తేజో అబన్నాత్మకము, త్రివృత్కరణము నందిన భూతములకు కారణమయినది అని అంగీకరింపబడుచున్నది. 30

శుక్లవర్ణముఅసితము అని; ఉక్తా=చెప్పబడినదో; సా=ఆ చెప్ప బడిన ప్రకృతి; అమీషాం త్రివృతాం=ఈ భూతములు త్రివృత్కరణము నందిన వానికి; యోనిః=కారణమైన, తేజోఽబన్నాత్మికా=తేజో అబన్నాత్మికమైనదని, మతా=అంగీకరింపబడినది.

## 6. బ్రహ్మాండాధికరణమ్

శ్లో॥ భూతరూపతయా ఖాంశః పాకాత్పరిణతో యథా ।
త్రివృన్తి సమపద్యన్త తథాభూతాని పాకతః ॥ 31

యథా=ఏ విధముగ; ఖాంశః=ఆకాశాంశము; పాకాత్=పాకమువలన; భూతరూపతయా=మూడు భూతముల రూపముగ; పరిణతః=పరిణమించినదో; తథా=ఆ విధముగనే; పాకతః=పాకమువలన, భూతాని=భూతములు; త్రివృన్తి=త్రివృత్కరణము నందినవి; సమపద్యన్త=అయినవి.

శ్లో॥ ఏతన్యాద్యాని రూపాణి భూతానాంత్రివృతాం విదుః
ప్రత్యండం భాసమానాని మండలాని వివస్వతాం 32

త్రివృతాం=త్రివృత్కరణము నందిన, భూతానాం=భూతములయొక్క; ఆద్యాని= మొదటివి అగు; రూపాణి=రూపములు, ప్రత్యండం=ప్రతి అండమునందు; భాసమానాని=ప్రకాశించు; వివస్వతాం= సూర్యులయొక్క; మండలాని=మండలములు అని; విదుః=తెలియుచున్నారు.

శ్లో॥ అనంతరాణి రూపాణి మండలాని భువా విదుః
అన్తే సిద్ధాని రూపాణి మాండలా న్యమృతత్విషాం ? 33

భువాం మండలాని = భూమండలములు; అనంతరాణి= తరువాత వగు; రూపాణి = రూపములు; అమృతత్విషాం మండలాని=చంద్ర మండలములు; అంతే =తుదను, సిద్ధాని=సిద్ధములైన; రూపాణి=రూపములు అని; విదుః=తెలిసికొనిరి.

# 6. బ్రహ్మాండాధికరణము

వ్యాఖ్య	ఆకాశాంశము పాకవశముచే భూతరూపముల నందినట్లే అవి పాకవశముచే త్రివృత్కరణము నందినవి.	31

వ్యాఖ్య : బ్రహ్మాండమునందు భాసించు సూర్యమండలములు త్రివృత్కరణమునందిన భూతముల మొదటి రూపము అని తెలిసికొనుచున్నారు.	32

వ్యాఖ్య : మొదట సూర్య మండలమెట్లు త్రివృత్కరణము వలనే అయినదో అట్లే దాని తరువాత భూమండలము, తరువాత చంద్రమండలము రూపొందినవి అని తెలిసికొనిరి.	33

శ్లో॥ కుటుంబభూతాన్ సూర్యస్య గ్రహానేవ భువో విదుః
ఇయంచ పృథ్వీ యోని రస్మాకం కశ్చన గ్రహః 34

సూర్యస్య=సూర్యునకు; కుటుంబ భూతాన్ =కుటుంబము వంటి, గ్రహానేవ=గ్రహములనే; భువః=భూములు అని, విదుః= తెలిసికొనిరి, అస్మాకం=మనకు; యోనిః=కారణమైన, ఇయంచ పృథ్వీ=ఈ భూమియు, కశ్చన=ఒక; గ్రహః=గ్రహము,

శ్లో॥ ప్రత్యండ మపి భాసన్తే యథా భువనబాంధవాః
తన్నిఘ్నాస్తాన్ పరివృత్య భాసన్తే భూమయ స్తథా 35

యథా = ఏవిధముగ, భువన బాంధవాః = సూర్యులు; ప్రత్యండం అపి=ప్రతి బ్రహ్మాండమునందు; భాసన్తే=ప్రకాశించు చున్నారో, తన్నిఘ్నాః=దానిచే నావిర్భవించిన, భూమయః= భూములు, తాన్=ఆ సూర్యులను; పరివృత్య=చుట్టువారుచు; తథా=ఆ విధముగనే; భాసన్తే=ప్రకాశించుచున్నవి

శ్లో॥ ఏతం చంద్రమసం ప్రాహుః భూమ్యాయత్త ముపగ్రహం।
చంద్రాపి పరోక్షా అన్యేపి గ్రహానిఘ్నా ఉపగ్రహాః 36

ఏతం చంద్రమసం = ఈ చంద్రుని; భూమ్యాయత్తం= భూమిని చుట్టు వారుచు దాని కాయత్తమైన, ఉపగ్రహం=ఉప గ్రహముగ; ప్రాహుః=చెప్పుచున్నారు; చంద్రాః పరోక్షాః= మనకు కానరాని చంద్ర గ్రహములు కూడ, గ్రహానిఘ్నాః= గ్రహములచేతనైన; ఉపగ్రహాః=ఉపగ్రహములే

శ్లో॥ గ్రహరాజైర్గ్రహైరేవం తథా పూర్ణ ముపగ్రహైః
ఏకాంశేనాపి గగనం నైవాంత మపూర్యత 37

ఏవం = ఈ విధముగ; గ్రహరాజైః = సూర్యులచేతను; గ్రహైః =భూముల చేతను, ఉపగ్రహైః = చంద్రుల చేతను; తథా=ఆ విధముగ; పూర్ణం=నిండినది; అనంతం=అంతములేని

వ్యాఖ్య : సూర్యునకు కుటుంబము వంటి గ్రహములనే భూములు అందురు అట్టి వానిలో మనకు కారణమైన ఈ భూమి ఒకానొక గ్రహము. 34

వ్యాఖ్య : ప్రతి బ్రహ్మాండమునను సూర్యులు భాసించు తీరున ఆ సూర్యమండలము నుండి వేరుపడిన భూములు దానినే చుట్టువారుచు ప్రకాశించుచున్నవి. 35

వ్యాఖ్య : ఈ చంద్రుడు భూమ్యాయత్తముగ దాని చుట్టు తిరుగు ఉపగ్రహము. ఇట్టివి గ్రహానిఘ్నములగు గ్రహములు అనేకములు మన కగపడనివియు కలవు. 36

వ్యాఖ్య : ఈ విధముగ సూర్యులు, భూములు, చంద్రులు వీనిచే నిండినను అనంతమగు ఆకాశము ఒక భాగముచేనైన పూరింపబడలేదు. 37

గగనం = ఆకాశము; ఏకాంశేనాపి=ఒక భాగముచే నైనను; నైవాపూర్యత=నిండింప బడలేదు.

శ్లో॥ వినాశశ్చ పురాణానాం నవానా మపి సంభవః
అండానా మత్ర గగనే స్యాతాం పర్యాయతః కిల ॥ 38

పురాణానా అండానాం=ప్రాచీన గోళములకు; వినాశః=నాశమును; నవానాం=క్రొత్తవానియొక్క; సంభవః=పుట్టుకయు; అత్ర గగనే=ఆ ఆకాశమున; పర్యాయతః=క్రమముగ; స్యాతాం కిల=అగునట;

## 7. సప్తలోకాధికరణమ్ ।

శ్లో॥ పరమాత్మా సత్యలోకః శుద్ధాకాశ స్తపోజగత్
అంతరిక్షం జనోలోకః మహాలోకో దివాకరః ॥ 39

పరమాత్మా=పరమాత్మయే; సత్యలోకః=సత్యలోకమున బడును; శుద్ధాకాశః=శుద్ధాకాశము; తపోజగత్=తపోలోకము; అంతరిక్షం=అంతరిక్షమే: జనోలోకః=జనోలోకము, దివాకరః=సూర్యుడు; మహాలోకః=మహాలోకము.

శ్లో॥ భోగస్థానం పుణ్యవతాం స్వర్లోక స్తుహినద్యుతిః ।
వ్యక్త వాయు తరంగాణాం భువర్లోకో గతిస్థలీ ॥ 40

పుణ్యవతాం=పుణ్యాత్ములకు; భోగస్థానం=భోగము లనుభవించు స్థలమగు; తుహినద్యుతిః=చంద్రుడే; స్వర్లోకః=స్వర్గము; వ్యక్తవాయు తరంగాణాం=వ్యక్తమయిన వాయు తరంగముల యొక్క; గతిస్థలీ=గమనమగుచోటు; భువర్లోకః=భువర్లోకము.

శ్లో॥ భూలోకా గీయతే భూమిః ఏషు లోకేషు సప్తసు
భూరాదయో వ్యాహృతయః సప్తస్యురితి శుశ్రుమ ॥ 41

వ్యాఖ్య : ప్రాచీనములగు అండములకు నాశము, నవీనములకు ఉత్పత్తియు, ఆకాశమున క్రమముగ జరుగుచునే యుండు నట. 38

## 7. సప్తలోకాధికరణము

వ్యాఖ్య : పరమాత్మయే సత్యలోకము. శుద్ధాకాశమే తపోలోకము. అంతరిక్షమే జనోలోకము. సూర్యుడే మహాలోకము. సృష్టిక్రమము ఎట్లు పూర్వము తెలుపబడినదో గమనించినచో ఆ క్రమము ననుసరించి ఈ నామములు స్థలములు విపులముగ తెలియగలవు. ఈ లోకములందగు వారెల్ల ముక్తులు, క్రమముక్తులు అగుదురు. వీరి కావృత్తి లేదు. 39

వ్యాఖ్య : పుణ్యాత్ములకు భోగస్థానమగు స్వర్లోకమే చంద్రుడు. వ్యక్త వాయు తరంగములు తిరుగుచోటు భువర్లోకము 40

వ్యాఖ్య : ఈ భూమియే భూలోకము. ఈ ఏడులోకములందును, ఓంభూః భువః సువః మహః జనః తపః సత్యం అను

భూమిః = ఈ భూమియే; భూలోకః = భూలోకము; ఏషు = ఈ, సప్తలోకేషు = ఏడులోకములందు; సప్తవ్యాహృతయః = ఏడు వ్యాహృతులు, స్యుః = అగును; ఇతి = అని; శుశ్రుమ = వింటిమి.

శ్లో॥ ఉభయో రాత్మశక్త్యోః స్యా ల్లోకాఖ్యా త్వౌపచారికీ
పంచస్వన్యేషు లోకేషు సన్తి పంచవిధాః ప్రజాః 42

ఉభయోః = రెండైన; ఆత్మశక్త్యోః = ఆత్మ, శక్తి లోకములకు, లోకాఖ్యా = లోక వ్యవహారము; ఔపచారికీ = లాక్షణికము, అన్యేషు పంచసు లోకేషు = మిగిలిన అయిదింటి యందు; పంచవిధాః = ఐదు విధములగు, ప్రజాః = ప్రజలు, సన్తి = కలరు.

శ్లో॥ కీర్త్యన్తే మరుతః ప్రాజ్ఞైః జనోలోక నివాసినః
నామాన్తరై స్తే ప్రమథా రుద్రా సిద్ధా గణా అపి ॥ 43

జనోలోక నివాసినః = జనలోకమందగువారు, ప్రాజ్ఞైః = ప్రాజ్ఞులచే; మరుతః = మరుత్తులని; కీర్త్యన్తే = గానము చేయబడుచున్నారు, తే = వారు; నామాన్తరైః = వేరు నామములచే; ప్రమథాః, రుద్రాః, సిద్ధాః, గణాః అపి = ప్రమథులు, రుద్రులు, సిద్ధులు, గణములు అని కూడా వ్యవహరింపబడుదురు.

శ్లో॥ ఆదిత్య సాధ్యనామానో మహాలోక ప్రజాస్స్మృతాః
గంధర్వాః పితరశ్చేతి స్వర్లోకే ద్వివిధాః ప్రజాః ॥ 44

మహాలోక ప్రజాః = మహాలోకమం దగు జనులు; ఆదిత్యాః = ఆదిత్యులు; సాధ్య నామానః = సాధ్యులు అను పేరులు కలవారని, స్మృతాః = చెప్పబడిరి; స్వర్లోకే = చంద్రలోకమున; గంధర్వాః = గంధర్వులు; పితరః = పితరులు; ఇతిచ = అని; ద్వివిధాః = రెండు విధములగు, ప్రజాః = ప్రజలు కలరు.

ఏడు వ్యాహృతు లగునని వింటిమి. 41

వ్యాఖ్య : సత్యలోకము, తపోలోకము అనువానికి లోక సంజ్ఞ లేదు అందు ఆత్మైక రూపము ఇంకొకటి లేదు, కాననే వానికి లోక సంజ్ఞ లాక్షణికము. మిగిలిన ఐదింటి యందు ఐదు విధములగు జనులు వసింతురు. 42

వ్యాఖ్య · జనోలోకమున ముముక్షులుందురు వీరికే ప్రమథులు, రుద్రులు, సిద్ధులు, గణములు అనియు పేర్లు. 43

వ్యాఖ్య : మహాలోకమున ఆదిత్యులు, సాధ్యులు అను పేరు గల ప్రజలుందురు. చంద్రలోకమున గంధర్వులు, పితరులు అనువా రుందురు. 44

శ్లో॥ భువర్లోకే పిశాచాః స్యుః భూలోకేతు నరాః స్మృతాః
స్వర్లోకాది జుషో దేవా వసవశ్చేతి కీర్తితాః ॥ 45

భువర్లోకే=భువర్లోకమున; పిశాచాః=పిశాచు లనువారు; స్యుః=ఉందురు; భూలోకే తు=భూలోకమున; నరాః=నరులు అని; స్మృతాః=చెప్పబడిరి; స్వర్లోకాది జుషః=స్వర్లోకము మొదలగు వానియం దగువారు; దేవాః, వసవఃచ ఇతి=దేవతలు, వసువులు అని కూడ; కీర్తితాః=చెప్పబడిరి.

వ్యాఖ్య : భువర్లోకమున, పిశాచములు, భూలోకమున నరులు ఉందురు. స్వర్లోకాదులను పొందినవారిని దేవతలు, వసువులు అని అందురు. 45

# తృతీయ పరిచ్ఛేదః

## 8. మధ్యమాధికరణమ్

శ్లో॥ యాన్తరిక్షేభి నిష్పన్నా పరమస్య పుమాకృతిః
ప్రథమాంతాంపి భావన్తే మధ్యమాం దేవతాం విదః 1

పరమస్య=పరమాత్మ యొక్క; పుమాకృతిఃయా=ఏ పురుషాకృతి యో; తాం=దానిని; ప్రథమాం=మొదటి ఆవిర్భావముగను; మధ్యమాం దేవతాం=మధ్యమ స్థానమందగు దేవతగను; విదః=తెలిసికొనువారు; ప్రభాషన్తే=పలుకుదురు.

శ్లో॥ మహేశ్వరం విదుఃశైవాః తం మహేంద్రంతు వైదికాః
తద్రూపమన్యత్ ప్రాగుక్త మిదం స్యా దాధిదైవికం 2

తం=వానిని; మహేశ్వరం=మహేశ్వరుడని; శైవాః=శైవులు, విదుః=తెలిసికొనిరి, వైదికాః=వేదము ప్రమాణమను వారు, మహేంద్రం=మహేంద్రుడని తెలిసికొనిరి, అన్యత్ తద్రూపం=దేహాభిన్నమైన మఱియొక రూపము; ప్రాగుక్తం=పూర్వము తెలుపబడినది; ఇదం=ఇప్పుడు చెప్పిన పురుషాకృతి గల రూపము; అధిదైవికం=అధి దైవికము

శ్లో॥ మహేశ్వర్యథ వేన్ద్రాణి తత్పత్నీ వనితాకృతిః
సూక్ష్మతేజోంశతః పూర్వాః శక్తే రన్యా రసాంశతః 3

వనితాకృతిః=స్త్రీ రూపము గల; తత్పత్నీ=వాని భార్య; మహేశ్వరీ=మహేశ్వరి; అథవా=లేక; ఇంద్రాణి=శచీదేవి; పూర్వాః=పూర్వమందగునది (నిరాకార రుద్రాది శబ్ద వాచ్యులందగునది); శక్తేః=శక్తియొక్క; సూక్ష్మ తేజోంశతః=సూక్ష్మ తేజోంశముచే అగునది; అన్యా=ఇప్పుడు స్త్రీ రూపమందగునది; రసాంశతః=రసాంశచే అగునది.

# తృతీయ పరిచ్ఛేదము

## 8 మధ్యమాది కరణము

వ్యాఖ్య : పరమాత్మయొక్క అంతరిక్షమున ఆవిర్భవించిన మొదటి పురుషాకృతినే మధ్యముడను దేవునిగ భావించుచున్నారు. 1

వ్యాఖ్య : ఆ పురుషునే వైదికులు మహేంద్రుడనియు, శైవులు మహేశ్వరుడనియు అందురు. పూర్వము తెలిపిన పేరులు గల రూపము దీనికన్న భిన్నము. అది అరూపము. ఇది అధిదైవికము, ఇది సగుణ రూపము. 2

వ్యాఖ్య : తేజోంశచే నయినది మహేశ్వరి అనియు, రసాంశచే అయినది ఇంద్రాణి అనియు అన్వయించిరి. అప్పుడు ఆ భేదము ఒక్క స్త్రీ రూపము నందే ఏల అయినదియు ఫలితముగాని కానరాదు. కాన అధిదైవిక స్త్రీ రూపము రసాంశచే నైనదని భావించితిని. వాస్తవము సహృదయులు గ్రహింతురు. 3

## 9. హిరణ్యగర్భాధికరణమ్

శ్లో॥ సకలం మండలం భానోః ప్రవివేశ పరః పునః
తదస్య కరణం జజ్ఞే నిఖిలాండానుభూతయే ॥ 4

సకలం = సమస్తమైన; భానోః = సూర్యుని, మండలం = మండలమును; పరః = పరపురుషుడు; పునః = మరల; ప్రివివేశ = ప్రవేశించెను; తత్ = ఆ ప్రదేశము, అస్య = వీనికి; నిఖిలాండాను భూతయే = నిఖిలాండానుభూతికి; కరణం = సాధనముగ, జజ్ఞే = తెలిసెను,

శ్లో॥ రోమకూపే రోమకూపే యథా నృణాం త్వగింద్రియం
హృదయం లోకనాథస్య మండలే మండలే తథా ॥ 5

నృణాం = మనుజులకు; రోమకూపే రోమకూపే = ప్రతిరోమకూపమున; యథా = ఏ విధముగ; త్వగింద్రియం = చర్మముండునో, తథా = ఆ విధముగ, మండలే మండలే = ప్రతి సూర్యమండలమున, లోకనాథస్య = పరమాత్మ యొక్క; హృదయం = హృదయముండును.

శ్లో॥ ద్వైత దృష్ట్యాతు జీవానాం భేదా హృదయ భేదతః
ఐక్యానుభూతే ర్నాధ్యక్ష భేదో మండల భేదతః ॥ 6

ద్వైతదృష్ట్యా = ద్వైత దృష్టిచే, జీవానాం = ప్రాణులకు; హృదయ భేదతః = హృదయము వేరగుటవలన; మండల భేదతః = భిన్నమండలము లగుటచే; భేదాః = భేదములగుచున్నవి; ఐక్యానుభూతేః = ఒకే అనుభవ మగుటచే, అధ్యక్ష భేదః = అధ్యక్షభేదము; న = లేదు.

శ్లో॥ ఏకత్వానుభవా దేవ మధ్యమా న్మండలాంతరః
హిరణ్యగర్భ ద్వంద్వాత్తు విభక్తోపి న భిద్యతే 7

# 9. హిరణ్యగర్భాధికరణము

వ్యాఖ్య ఆ పర పురుషుడు సూర్యమండలమున మరల ప్రవేశిం
చెను. ఆ ప్రవేశముచే దాని సహాయమున ఆతనికి
సకలాండానుభవము కలుగుచున్నవి. 4

వ్యాఖ్య ప్రతి రోమ కూపమున నరులకు చర్మేంద్రియ మున్నట్లు
ప్రతి సూర్య మండలమందు పరమాత్మయొక్క
హృదయముండును 5

వ్యాఖ్య హృదయ భేదముచే ద్వైత దృష్టికి జీవుల భేదము కాని
ఐక్యానుభూతివలన మండల భేదముచే అద్వైత భేదము
లేదు. 6

వ్యాఖ్య సూర్యమండలాంతర వర్తి అయిన పురుషుడు అంత
రిక్షాంతరుడగు మధ్యమునికన్న భిన్నుడయ్యు, ఐక్యాను

మధ్యమాత్ = మధ్యముని కంటె మండలాంతరః = సూర్య మండలాంతర వర్తి; ఏకత్వానుభవాదేవ = ఐక్యానుభూతిచే, హిరణ్యగర్భద్వంద్వాత్తు = హిరణ్యగర్భద్వంద్వముకంటె, విభక్తోపి = వేరైన వాడయ్యు, న భిద్యతే = వేరు కాదు

శ్లో॥ మండలాంతర సామాన్యం సూర్యనామ ప్రకీర్తితం
హిరణ్యగర్భ నామ స్యాదన్తరస్యైవ కేవలం ॥ 8

సూర్యనామ = సూర్యుడను పేరు, మండలాంతర సామాన్యం = మండలమునకు అంతంమునకు కూడ అగునని, ప్రకీర్తితం = గానము చేయబడినది హిరణ్యగర్భనామ = హిరణ్యగర్భుడను పేరు కేవలం అంతరస్యైవ = ఒక్క మండలాంతరునకే అగును.

శ్లో॥ యత్సూర్య ఆత్మా జగ తస్తుష శ్చేతి దర్శనం
ద్విధాపి తత్సమన్వేతి బాహ్యాభ్యంతర వైభవాత్ 9

యత్ = ఏ; సూర్యః = సూర్యుడు; జగతః = జగత్తునకు; తస్థుషశ్చ = దేవునకును, ఆత్మా = ఆత్మ, ఇతి = ఇట్లను; దర్శనం = వేదము, బాహ్యాభ్యంతరవైభవాత్ = బాహ్యము, అభ్యంతరము అయిన వైభవము కలవాడగుటచే; ద్విధాపి = రెండు విధములుగను; తత్ = ఆ వేదవచనము, సమన్వేతి = అన్వయించుచున్నది

శ్లో॥ మండలస్యాంతరం కేచి ద్విష్ణునామ్నా ప్రచక్షతే
ఉత్తమాభిఖ్యయా కేచిత్ ఉద్గీథాభిఖ్యయా పరే 10

కేచిత్ = కొందరు, మండలస్య = సూర్యమండలము యొక్క, అంతరం = అంతర పురుషుని, విష్ణునామ్నా = విష్ణువను పేరుచే, ప్రచక్షతే = చెప్పుచున్నారు పరే = కొందరు; ఉద్గీథాభిఖ్యయా = ఉద్గీథుడను పేరుతో; ప్రచక్షతే = చెప్పుచున్నారు కేచిత్ = కొందరు, ఉత్తమాభిఖ్యయా = ఉత్తముడను పేరుతో చెప్పుదురు

భూతిచే అభిన్నుడగుచున్నాడు 7

వ్యాఖ్య సూర్యుడను పేరు, మండలమునకు, మండలాంతరమునకు కూడ వర్తించును హిరణ్యగర్భుడను పేరు కేవలము మండలాంతరునకే చెందును 8

వ్యాఖ్య 'సూర్య ఆత్మా జగతః తస్థుషశ్చ' అని వేదమంత్రము కలదు సూర్యుడు మండలాంతర సామాన్యుడు. కావున నే అతడు జగమునకు, ఆ శివునకు ఆత్మ అగుచున్నాడు అట్లే శివునకు, మండలమునకు అనగా హిరణ్యగర్భునకు ఆత్మ అగుచున్నాడు 9

వ్యాఖ్య సూర్యమండలాంతరుడైన పురుషుని ఉత్తముడని కొందరు, విష్ణువని కొందరు, ఉద్గీథుడని కొందరు చెప్పుచున్నారు నామభేదమే కాని అతడు సూర్యమండలాంతరుడు 10

# 10. సప్తాశ్వాధికరణమ్

శ్లో॥ యే భాస్కరస్య సప్తాశ్వాః పురాణేషు ప్రకీర్తితాః
సప్తభ్యః కిరణేభ్యస్తే భిద్యన్తే నైవ తత్వతః 11

పురాణేషు = పురాణములందు భాస్కరస్య = సూర్యునకు, సప్తాశ్వాః = ఏడు గుఱ్ఱములని, ప్రకీర్తితాః = చెప్పబడినవో, తే=అవి; సప్తభ్యః=ఏడగు, కిరణేభ్యః=కిరణములకంటె; తత్వతః = వాస్తవమునకు నైవ భిద్యన్తే = వేరుకావు.

శ్లో॥ తురంగః సప్తనామైకః శుక్లో రశ్మి రుదాహృతః
సప్తానా మపి రశ్మీనాం సమష్టిర్వాసితో ఘృణిః 12

శుక్లః రశ్మిః = తెల్లని కిరణము, సప్తనామ = సప్తఅను పేరుగల, తురంగః=అశ్వము అని; ఉదాహృతః = చెప్పబడినది, సప్తానామపి = ఏడగు, రశ్మీనాం = కిరణముల; సమష్టిః=సమూహామే సితః= తెల్లని; ఘృణిః = సూర్యుడు

శ్లో॥ సప్తాశ్వాస్తు యే గీతాః తేహి సప్త మరీచయః
మార్తాండో యోష్టమో గీతః స శుక్లో రశ్మి రిష్యతే 13

యే సప్తాశ్వాఃతు = ఏ ఏడుగుఱ్ఱములు; గీతాః = గానము చేయుబడినవో; తేహి = అవియే; సప్తమరీచయః = ఏడు కిరణములు, యః = ఎవడు అష్టమః = ఎనిమిదవ వానిగ; గీతః = గానముచేయుబడెనో స మార్తాండః=ఆ సూర్యుడే; శుక్లః రశ్మిః= తెల్లని కిరణమని, ఇష్యతే = అంగీకరింప బడుచున్నది.

శ్లో॥ మార్తాండస్యచ మిత్రస్య న భేదః కోఽపి విద్యతే
భాసః స్వస్థతయా మిత్రో మధ్యమస్థాన ఉచ్యతే ॥ 14

మార్తాండస్య = మార్తాండునకు, మిత్రస్య=మిత్రునకు, భేదః=వ్యత్యాసము; కోఽపి విద్యతే=ఏమియులేదు; భాసః=

# 10. సప్తాశ్వాధికరణము

వ్యాఖ్య పురాణములందు సూర్యునకు ఏడు గుఱ్ఱములని చెప్పబడినవి ఆ అశ్వములు ఏడగు కిరణములకన్న భిన్నములు కావు. 11

వ్యాఖ్య · తెల్లని కిరణమే సప్త అని పేరుగల సూర్యాశ్వముగ వర్ణింపబడినది ఏడు కిరణముల సమష్టిరూపమే తెలుపు. అతడే ఘృణి అనబడును. 12

వ్యాఖ్య · సూర్యుని అశ్వములుగా వర్ణింపబడిన ఏడును, ఏడు కిరణములు ఎనిమిదవ వానిగా వర్ణింపబడిన ఆ మార్తాండుడే ఏడు కిరణముల సమూహమగు తెలుపువర్ణము. 13

వ్యాఖ్య · మార్తాండునకు, మిత్రునకు భేదములేదు. కిరణములు తనయం దగుటచే మిత్రుడే మధ్యమ స్థానుడని చెప్పబడుచున్నాడు. 14

కిరణములు; స్వస్థత్వయా=త్వమ్మయ్యుం దుండుటచే, (స్వర్లోకమునం దుండుటచేత) మిత్రః=మిత్రుడే, మధ్యమస్థానః=మధ్యమ స్థానుడని; ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

## 11. మిత్రా వరుణాధికరణమ్

శ్లో॥ కిరణానాం ప్రతి ద్వంద్వీ వరుణ స్తిమిరాత్మకః
మిత్రోఽహ్న ఇవ రాత్రేస్తు దేవతా పరికీర్త్యతే 15

కిరణానాం=కిరణములకు, ప్రతిద్వంద్వీ = శత్రువు; తిమిరాత్మకః=చీకటి రూపముగాగల, వరుణః=వరుణుడు, అహ్నః=పగటికి, మిత్రఇవ = సూర్యునివలె, రాత్రేః = రాత్రికి, దేవతా తు= దేవతగదా.

శ్లో॥ తేజః సమస్తం విసృజత్యా దత్తే సకలం తమః
తస్మా త్పాయుశ్చ రసనం తా వధ్యాత్మ ముదాహృతౌ ॥ 16

తేజః= తేజమును, పాయుః=గుదేంద్రియము, విసృజతి= విడుచుచున్నది, రసనము = రసనేంద్రియము సకలం=సమస్తమైన, తమః = తమమును; ఆదత్తే = గ్రహించుచున్నది; తస్మాత్ =ఆ కారణముచేత, తౌ=ఆ రెండింద్రియములను అధ్యాత్మమ్=అధ్యాత్మమయినవని, ఉదాహృతౌ= చెప్పబడినవి.

శ్లో॥ మిత్రేణాను గృహీతః స్యాద్బోధో జాగ్ర ద్దశాశ్రయః
బోధో నిద్రా సమాధ్యోస్తు వరుణే నానుగృహ్యతే 17

జాగ్రద్దశాశ్రయః=జాగ్రద్దశయందు; బోధః = జ్ఞానము మిత్రేణ=మిత్రునిచేత, అనుగ్రహీతః=అనుగ్రహింపబడునది, స్యాత్ =అగును, నిద్రాసమాధ్యోః=నిద్ర, సమాధి వీనియందగు; బోధః=జ్ఞానము, వరుణేన = వరుణునిచే, అనుగృహ్యతే = అనుగ్రహింపబడుచున్నది

## 11. మిత్రావరుణాధికరణము

వ్యాఖ్య కిరణములకు వ్యతిరేకమైనది చీకటి కిరణాత్మకమైన పగటికి మిత్రుడు దేవత అగునట్లు తిమిరాత్మకుడగు వరుణుడు రాత్రికి దేవత అగుచున్నాడు 15

వ్యాఖ్య మిత్రుడు దేహేంద్రియములందు పాయు స్థానీయుడు వరుణుడు రసనేంద్రియ స్థానీయుడు ఇట్లు వీరు అధ్యాత్మరూప సంబంధము కలవారు పాయువు ద్వారముగా మిత్రుడు తేజమును విడుచుచున్నాడు వరుణుడు రసనేంద్రియ రూపముగా తమమును స్వీకరించుచున్నాడు. కాన ఆ రెండింద్రియములకు అధ్యాత్మత్వము కలదనుచున్నారు. ఇవి కర్మేంద్రియములయ్యు అధ్యాత్మత్వమున్నవి 16

వ్యాఖ్య : జాగ్రద్దశయందగు బోధను మిత్రుడనుగ్రహించును. నిద్రా సమాధులందగు బోధను వరుణుడనుగ్రహించును. 17

శ్లో॥ మిత్రః సర్వాణి భూతాని సహాలోకేన పశ్యతి
యత్రనిద్రాన్తి భూతాని వరుణ స్తత్ర పశ్యతి 18

మిత్రః=మిత్రుడు; సర్వాణి భూతాని = సమస్త ప్రాణులను సహాలోకేన=లోకముతో కూడ, పశ్యతి=చూచుచున్నాడు, యత్ర=ఎక్కడ; భూతాని=ప్రాణులు, నిద్రాన్తి = నిద్రించుచున్నవో, తత్ర=అక్కడ, వరుణః=వరుణుడు, పశ్యతి=చూచుచున్నాడు

శ్లో॥ అఖండం వారుణం జ్ఞానం విభక్తం మైత్ర ముచ్యతే
అన్యాదృశం నాన్ధకారో తమస్తు వరుణాత్మకమ్ ॥ 18

అఖండం=ఏక రూపమైన, వారుణం=వరుణ సంబంధమైన, జ్ఞానం=జ్ఞానము విభక్తం=వేరయి, మైత్రం=మిత్రుని సంబంధమగు జ్ఞానము అని, ఉచ్యతే=చెప్పబడుచున్నది, అన్యాదృశం తమః=అన్య సదృశము గాని తమస్సు; వరుణాత్మకం=వరుణాత్మకమైనది, అంధకారః=చీకటి, న=కాదు

## 12. అర్యమాధికరణమ్

శ్లో॥ చాంద్రం మండల మావిష్టః సౌరం స్యా ద్రశ్మిరర్యమా
ప్రాణినాం స్వప్నజం జ్ఞాన మర్యమ్ణా త్వనుగృహ్యతే ॥ 20

చాంద్రం=చంద్రసంబంధమగు; మండలం=మండలమును; ఆవిష్టః=ఆవేశించిన; సౌరం=సూర్యసంబంధమగు; రశ్మిః=కిరణము; అర్యమా=అర్యమ అని వ్యవహరింపబడును, ప్రాణినాం=ప్రాణులకు; స్వప్నజం=స్వప్నమునందగు; జ్ఞానం=జ్ఞానము; అర్యమ్ణః=అర్యముని వలన, అనుగృహ్యతే=అనుగ్రహింపబడుచున్నది

శ్లో॥ యత్స్వప్న శ్చంద్రికా భావే యజ్జాగ్రద్ధీ ర్నిశాగమే
దవిష్ట చంద్రికాఘ్రస్ర సద్భావా దేవ తద్ద్వయమ్ ॥ 21

వ్యాఖ్య ప్రాణులు తెలిసి చూచుచున్నప్పుడు వానితో కూడ మిత్రుడు లోకమును చూచుచున్నాడు చూచుట అను వ్యాపారమునకు సామర్థ్యము కూడ అనుగ్రహించుచు దానితోపాటు తానును చూచుచున్నాడు. లోకము నిద్రించినప్పుడు వరుణుడు లోకమును చూచుచున్నాడు. నిద్రనుండి బోధను నిద్రయందలి ఆను భూతిని వరుణుడు అనుగ్రహించుచు చూచుచున్నాడు 18

వ్యాఖ్య మొదట అఖండ వరుణ జ్ఞానమే ఉన్నది. ఇందు విషయములు స్ఫురింపని జ్ఞానమున్నది ఇది సమాధి కలవానికి ఆత్మ విషయకమగును నిద్రితునకు విషయ రహిత విశ్రాంతి రూపము అది విషయ జ్ఞానముచే విభక్తమై మైత్ర జ్ఞాన మగుచున్నది వరుణాత్మకమైన తమస్సు వెలుగు లేకుండుట అను చీకటి మాత్రము కాదు అది అనన్యాదృశము. 19

## 12. అర్యమాధికరణము

వ్యాఖ్య : సౌరరశ్మి చంద్రమండలమును ప్రవేశించును. అట్లా విష్టమైన సౌరరశ్మియే అర్యమా అను దేవత అని వ్యవహరింపబడును. ఆ దేవతచే ప్రాణులకు స్వాప్నిక జ్ఞానము అనుగ్రహింపబడును. ఆ దేవత పితరులలో శ్రేష్ఠుడని గీతావాక్యము. 20

వ్యాఖ్య : మనకు చంద్రుడు లేని సమయమున కలుగు స్వప్నమును, సూర్యకాంతి లేకున్నను తెలివిడియు, దూర

చంద్రికాభావే=వెన్నెల లేకున్నను, యః స్వప్నః=ఏ స్వప్నము అగుచున్నదో; నిశాగమే=రాత్రియందు. యత్ జాగ్రద్ధీః=ఏది తెలిసి యుండు బుద్ధియో, తద్ద్వయం=ఆ రెండును, దవిష్ట చంద్రికాఘస్రి సద్భావాదేవ=దూరముగ వెన్నెలయు, సూర్యకాంతియు ఉండుట చేతనే అగుచున్నవి

## 13. నాసత్యాధికరణమ్

శ్లో॥ తుహినాతప యోగేన శీతోష్ణౌ భవతో గుణౌ
నాసత్యౌ పరికీర్త్యేతే దేవౌ జగతి తావుభౌ ॥ 22

తుహినాతప యోగేన=మంచు (వెన్నెల చల్లదనము) ఎండ అనువాని యోగముచే, శీతోష్ణౌ=శీతము, ఉష్ణము అను; గుణౌ=గుణములు; భవతః=అగుచున్నవి; తౌఉభౌ=ఆ ఇద్దరు; నాసత్యౌ=అశ్వినులను; దేవౌ=దేవతలుగ, పరికీర్త్యేతే=గానము చేయుబడుదురు

శ్లో॥ శీతస్యోష్ణం భేషజం స్యాచ్ఛీత ముష్ణస్య భేషజమ్
కథితౌ దేవ భిషజౌ తస్మాదేతౌ విచక్షణైః ॥ 23

శీతస్య=చల్లదనమునకు, ఉష్ణం=వేడిమి, భేషజం=మందు, ఉష్ణస్య = వేడిమికి శీతం = చల్లదనము; భేషజం = మందు, స్యాత్ =అగును, తస్మాత్ =ఆకారణముచే, విచక్షణైః=వివేకము గల వారలచే; తౌ ఉభౌ=ఆ భేషజ రూపులైన, ఏతౌ= వీరిద్దరు; దేవ భిషజౌ= దేవ వైద్యులని చెప్పబడిరి.

శ్లో॥ తుహినాతప హేతుత్వా చ్చన్ద్రసూర్యాపరే విదుః
నాసత్యౌ తత్త్వతః కేచి ద్రజనీ దివసౌ విదుః ॥ 24

తుహినాతప హేతుత్వాత్ =వెన్నెల, ఎండ వీనికి కారణమగుటచే, చన్ద్రసూర్యౌ=చంద్రుడు, సూర్యుడు; నాసత్యౌ= అశ్వినీ దేవతలని; పరే=కొందరు, విదుః= తెలిసికొనిరి, కేచిత్ =

ముఁగ నున్న వెన్నెల, సూర్యరశ్మి వలననే కల్గుచున్నవి. 21

## 13. నాసత్యాధికరణము

వ్యాఖ్య వెన్నెల, సూర్యకాంతి అనువానిచే శీతోష్ణములను గుణములు కలుగుచున్నవి. ఆ రెండింటినే నాసతులు అను పేరు గల దేవతలుగ చెప్పుదురు. 22

వ్యాఖ్య : వేడికి చలువయు చల్లదనమునకు వేడియు భేషజములు. అందుచే ఆ రూపులైన వీరిరువురు దేవ వైద్యులని వివేకులనిరి 23

వ్యాఖ్య మంచునకు ఎండకు కారణమగుటచే చంద్ర సూర్యులకే అశ్వినీ దేవతలను పేరని కొందరందురు మరి కొందరు వాస్తవముగ రాత్రింబగళ్ళనే అశ్వినీ దేవతలందురు 24

కొందరు, తత్త్వతః=యథార్థముగ; రజనీ దివసౌ=రాత్రింబవళ్ళు అని; విదుః=తెలిసికొనిరి

## 14. కాలాధికరణమ్

శ్లో॥ విజ్ఞానమేవ కాలాఖ్యం వస్తుతో యది చిన్త్యతే
భూతం భవద్భావి చైతత్ సర్గే త్రేధా విభజ్యతే ॥ 25

వస్తుతః=వాస్తవముగ, చిన్త్యతే యది=విచారించినచో, విజ్ఞానమేవ=విజ్ఞానమే, కాలాఖ్యం=కాలమను పేరు గలది, సర్గే=సృష్టియందు, భూతం=జరిగిన; భవత్=జరుగుచున్న; భావి=జరుగబోవు, త్రేధా=మూడు విధములుగ; విభజ్యతే=విభజింపబడుచున్నది.

శ్లో॥ అహస్తేజస్తమో రాత్రిర్భక్తిస్తత్ర కాలతా
మాసాదే కాలనామత్వమపి భాక్తం విచిన్వతామ్ ॥ 26

అహః=పగలు; తేజః=వెలుగు, తమః=చీకటి; రాత్రిః=రాత్రి, తత్ర=ఆ విషయమున, కాలతా=కాలత్వము, భాక్తతః=లాక్షణికముగ నగుచున్నది, మాసాదేః=మాసము మొదలగు వానికిని, కాలనామత్వమ్ అపి=కాల వ్యవహారము కూడ; విచిన్వతామ్=ఆలోచించువారలకు, భాక్తమ్=లాక్షణికము.

శ్లో॥ యచ్చ దివ్యం యుగం ప్రోక్తం యచ్చోక్తం మానవం యుగమ్
ద్వాదశాబ్దసహస్రాత్మ తత్త్వన్మానవశాద్బుధైః 27

యత్ చ=ఏ, దివ్యం=దేవ సంబంధమగు; యుగం=యుగము, ప్రోక్తం=చెప్పబడినదో; యత్=ఏది; మానవం=మనుజుల, యుగం చ=యుగమును, ప్రోక్తం=చెప్పబడినదో; తత్త్వన్మానవశాత్ = వారి వారి మానములను అనుసరించి బుధైః=పండితులచే ద్వాదశాబ్దసహస్రాత్మ=పన్నెండు వేల సంవత్సరముల ప్రమాణము గలవని చెప్పబడుచున్నది.

## 14. కాలాధికరణము

వ్యాఖ్య : వాస్తవముగ విజ్ఞానమునకే కాలమని పేరు. ఇది సృష్టి యందు భూత భవిష్య ద్వర్తమానములని మూడు విధములుగ విభజింప బడుచున్నది. ౨౫

వ్యాఖ్య : పగలు వెలుగు, రాత్రి చీకటియు అగుచున్నవి అవి భూత భవిష్య ద్వర్తమానము లందగు వ్యాపారములు కావు. కాన వానికి కాల వ్యవహారము లాక్షణికము. అట్లే బాగుగా ఆలోచించిన మాసాదులకును కాల నామము లాక్షణికమే అగుచున్నది. సర్గ వ్యాపారము జరుగుటను బట్టి కాలము త్రిధా విభక్తము. పగలు రాత్రి మాసములు, ఇవి సర్గ వ్యాపారములు కావు. ఇందు సర్గాదులు జరుగు చున్నందున వీనికి కాల వ్యవహారము సిద్ధించుచున్నది. 26

వ్యాఖ్య : నాలుగు యుగముల ప్రమాణమును, మానవ లోకమున మానవ వత్సర గణనము మాని, దేవ వత్సరములనే మానవ వత్సరములుగ మార్చి, పురాణము లందు చూప బడినది కాని దీనికి తగిన ప్రమాణము కాన రాదు కాన మానవ యుగము మానవ వత్సరములు గనే భావింప వలెనని భావము 27

శ్లో॥ విభాగస్తు చతుర్ధాస్య నైవ కాల విశేషతః ।
శక్త్యశక్తి కృతః పూర్వో ధర్మాధర్మకృతః పరః॥ 28

అస్య = ఈ కాలమునకు; చతుర్ధా = నాలుగు విధముల; విభాగః=విభాగము; కాలవిశేషతః=కాలమందలి విశేషము ననుసరించి; నైవ = కాదు; పూర్వః = దేవ యుగము; శక్తి అశక్తి కృతః = శక్తి అశక్తుల ననుసరించి చేయబడినది; పరః = మానవ యుగము; ధర్మాధర్మ కృతః = ధర్మాధర్మముల ననుసరించి చేయబడినది.

శ్లో॥ భూతపాకో వియత్యాసీ ద్బ్రహ్మ దృష్ట్యూష్మణో యథా ।
పాక మండేషు పశ్యామః తథా సప్తహయోష్మణః ॥ 29

యథా = ఏ విధముగ; బ్రహ్మదృష్ట్యూష్మణః = బ్రహ్మ దృష్టి చేసిన ఊష్మచే; వియతి = ఆకాశమున; భూతపాకః = భూతముల పరిణామము; ఆసీత్ = ఆయెనో; తథా = ఆ విధముగ; అండేషు = గోళములందు; సప్తహయోష్మణః = సూర్యరశ్మిల ఊష్మచే; పాకం = పరిణామమును; పశ్యామః = చూచుచున్నాము.

శ్లో॥ ఏషసప్తహయ స్యోష్మా బ్రహ్మదృష్ట్య నిలోష్మణః ।
నాన్యో యన్మాతరి శ్వైవ పక్షపుచ్ఛం వినా రవిః ॥ 30

ఏషః = ఈ; సప్తహయస్య = సూర్యునియొక్క; ఊష్మ = ఊష్మ; బ్రహ్మదృష్ట్యనిలోష్మణః = బ్రహ్మయొక్క చూపుచేసిన గాలియొక్క ఊష్మకన్న; న అన్యః = భిన్నముకాదు; యత్ = ఏలనన; మాతరిశ్వా ఏవ = మాతరిశ్వయే; పక్ష పుచ్ఛం వినా = రెక్కలు తోక లేని; రవిః = సూర్యుడు; (అని వేదవచనము)

వ్యాఖ్య : నాలుగు విధములుగ విభజించుట కాలవిశేషముచే కాదు దేవయుగము శక్త్యశక్తి కృతము. మానవ యుగము ధర్మాధర్మ కృతము. 28

వ్యాఖ్య : పరిణామము రెండు స్థలములందు ఇద్దరిచే జరుగుచున్నది అందు మొదటిది ఆకాశమున బ్రహ్మ దృష్టిచే నైన ఊష్మచే భూతపాకము జరుగుచున్నది. తేజస్సు, అప్పు, అన్నము అనునవి భూతాణువులు వాని త్రివృత్కరణము మొదలగు పరిణామము బ్రహ్మదృష్టి యందలి ఊష్మచే జరుగుచున్నది. అట్లే సూర్యరశ్ముల ఊష్మచే అండమునందు పరిణామము జరుగుచున్నది. 29

వ్యాఖ్య : పక్షపుచ్ఛములు లేని మాతరిశ్వయే రవి. కాన సూర్యోష్మ మాతరిశ్వయొక్క అనిలోష్మకన్న భిన్నము కాదు. కొందరు 28వ శ్లోకమున శక్త్యశక్తి అనుటకు శక్త శక్తి కృతః పూర్వః అని పాఠాంతరమును చదువుచున్నారు. వారి పక్షమున భావమిది: శక్త శక్తుల సంబంధముచే నైన విజ్ఞానధారచే దేవతల యుగ గణనము వారికి సూర్యులోకముకన్న క్రింది వగు మండలములందగు పాకముతో సంబంధము లేదు.

వారు దాని కతీతులు. సత్యలోకము మొదలు మాత రిశ్వా యొక్క దృష్ట్యావ్మలచే నగు పాకమే వారి కాలము. కాన అది శక్తుడు శక్తి అనువానిచే నగు పాకము. అది వారి కాలము సూర్యోష్మచే నగు పాకము అండములందు అగును అది ధర్మము ధర్మిని అనుస రించి యుండును ఇది మానవుల కాలము అని వారి భావము. ఈ పాఠాంతరములు చూడవలసి యున్నవి. అది ధర్మధర్మికృతము కాల విశేషము చేత ఈ చతు ర్విధ విభాగము జరుగలేదనుటకు ఐతరేయ బ్రాహ్మ ణము ప్రమాణము 30

శ్లో 'కలిఃశయానో భవతి సంజిహానస్తు ద్వాపరః
ఉత్తిష్ఠ త్రేతాభవతి కృతం సపద్యతే చరన్

మహాభారతమునందు, మనుస్మృతి యందు, పండ్రెండు వందల సంవత్సరములు చతుర్యుగ ప్రమాణ మని కలదు మను స్మృతి యందు 'ఏతద్ద్వాదశ సాహస్రం దేవానామ్ యుగముచ్యతే' అని దివ్యత్వము యుగమున కేగాని సంవత్సరములకు తెలుపలేదు. విష్ణుపురాణము, సూర్య సిద్ధాంతము మొదలగు అర్వాచీన గ్రం థము లందు ఉన్న తీరు ననుసరించి నవీనులు దివ్యత్వమును సంవత్సరములకు కల్పించి కాలమును మానవుల సంవత్సరములను దేవ వత్సరములగు పన్నెండువేలతో సరిచేసి, 12000×360 యుగ ముల ప్రమాణములని చెప్పుచున్నారు. అమరమునను 'మన్వంత రంతు దివ్యానామ్ యుగానామ్ ఏకసప్తతిః' అని యుగములకే దివ్యత్వమును చెప్పినాడు. కాన మానవయుగము 5 సంవత్సరముల ప్రమాణము కలది కావలయును. కొందరు సావన మానము మానవము, చాంద్రము, పిత్ర్యము, సౌరము దివ్యము అని భావించుచున్నారు. విష్ణుపురాణాద్యుక్త కాల ప్రమాణము చారి త్రిక సమ్మతము కాలేదు. కాన ఇది విమర్శాసహము. విస్తరము ఇక్కడ అనవసరము.

శ్లో॥ సోఽయం భూతభవద్భావి రూపో భువన పాచకః
కాలః శక్తేర్దశాభేద స్త్వష్టా శాస్త్రే ప్రగీయతే 31

శక్తేః = శక్తియొక్క, దశాభేదః = దశాభేదము; భూత, భవత్, భావిరూపః = జరిగిన, జరుగుచున్న, జరగబోవునట్టి; భువనపాచకః = విశ్వపరిణామము; సోఽయం కాలః = అదియే కాలము, శాస్త్రే = శాస్త్రమున; త్వష్టా = త్వష్ట అని, ప్రగీయతే = గానము చేయబడుచున్నాడు.

## 15. వైశ్వానరాధికరణమ్

శ్లో॥ నరాణామిహ విశ్వేషాం భాసాంగుష్ఠ ప్రమాణకః
హృదయాన్తర వర్త్యాత్మా వైశ్వానర ఉదాహృతః 32

విశ్వేషాం నరాణాం = అందరు మనుజులకు· ఇహ = ఈ లోకమున; భాసా = కాంతిచే; అంగుష్ఠ ప్రమాణః = అంగుష్ఠ ప్రమాణుడైన; హృదయాన్తరవర్తి = హృదయాంతరమునందగు; ఆత్మా = ఆత్మయే;= వైశ్వానరః = వైశ్వానరుడని; ఉదాహృతః = చెప్పబడినాడు.

వాస్తవముగ ఆత్మ దృష్టియే కాలము. దృష్టి అనగా సంవిన్మాత్రము. అది అంతర్ముఖమైన ప్రతీచి అనియు, బాహ్యాముఖమైన పరాచీ అనియు విశ్రాంతమైన శాంతి అనియు అందురు. ప్రజ్ఞానము విజ్ఞానము మానము. వీనికి క్రమముగ పర్యాయములు. యోగము సంగము త్యాగము వ్యాప్తి వ్యాయామము ఉపరతి అని క్రమముగ అందురు అందు సర్గము, స్వప్నము, తపము, సాయుజ్యము అని మొదటిది నాలుగు విధములు. స్థితి జాగరితము కర్మ భోగము అని రెండవది నాలుగు విధములు. ప్రళయము సంప్రసాదము, నిద్ర, ముక్తి అని మూడవది నాలుగు విధములు. పరాచియే పగలు. ప్రతీచియే సంధ్య. విశ్రాంతియే రాత్రి. ఇదియే కాలము. మిగిలిన వ్యవహారములు భుక్తములు.

వ్యాఖ్య : వాస్తవముగ పరిణామమే కాలము. ఇది జరిగిన-జరుగుచున్న జరగబోవు రూపములతో నున్నది. ఇది పాచకశక్తియొక్క అవస్థాభేదము. కాలము అని వ్యవహారింపబడును. దీనినే శాస్త్రమున త్వష్టా అని నుతించుచున్నారు. 31

## 15. వైశ్వానరాధి కరణము

వ్యాఖ్య . భూమియందు మనుజుల హృదయాంతరమునందు అంగుష్ఠ ప్రమాణ జ్యోతి రూపుడు ఉన్నాడు. వానినే వైశ్వానరుడందురు. 32

శ్లో॥ స్థానం వైశ్వానరస్యాహుః కేచి న్నయనమండలమ్ ।
మనః కేచిత్ జాగరితే స్వప్నే చైతే ప్రకీర్తితే । 33

కేచిత్ = కొందరు; వైశ్వానరస్య = వైశ్వానరునకు; నయనమండలమ్ = నేత్ర మండలము; స్థానం = స్థానము అని; ఆహుః = చెప్పుచున్నారు. కేచిత్ = కొందరు; మనః = మనస్సు, అని చెప్పుచున్నారు. కాని; జాగరితే = తెలిసి ఉన్నప్పుడు; స్వప్నేచ = స్వప్నమందును; ఏతే = ఈ రెండును; ప్రకీర్తితే = చెప్పబడుచున్నవి.

శ్లో॥ వస్తుతో హృదయం స్థానం తత స్తేజోఽస్య నిర్గతమ్
స్థానాంతరగతం పశ్యే త్స్వప్నా జ్జాగ్రతి చాఖిలమ్ 34

వస్తుతః = వాస్తవముగ; హృదయం = హృదయమే; స్థానం = స్థానము, తతః = అచ్చటినుండి; అస్య = ఈ వైశ్వానరుని, తేజః = తేజము, నిర్గతమ్ = బయలు దేరినది; స్థానాంతర గతం = ఇంకొక చోటునుపొంది; స్వప్నే = స్వప్నమునందును; జాగ్రతి = జాగ్రదవస్థయందును; అఖిలమ్ = సమస్తమును; పశ్యేత్ = చూచును.

శ్లో॥ యథావ్యోమ్నః పరం తేజః సూర్యమండల మావిశత్
తథైవ సూర్యాదపి తద్వికారం హృదయ మండలమ్ 35

యథా = ఏ విధముగ; వ్యోమ్నః = ఆకాశముయొక్క; పరం = శ్రేష్ఠమగు; తేజః = తేజస్సు, సూర్యమండలమ్ = సూర్యమండలమును, ఆవిశత్ = ఆవేశించునో, తథా ఏవ = ఆ విధముగనే, సూర్యాదపి = సూర్యునివలన; విశాః = మనుజుల; హృదయమండలమ్ = హృదయమండలమును; ఆవిశత్ = ఆవేశించెను.

వ్యాఖ్య: కొందరు వైశ్వానరుడు నేత్రమండల మందున్నాడు, అది వాని స్థానము అందురు. కొందరు మనస్సు స్థానము అనుచున్నారు. కొందరు జాగరితావస్థ యందు నేత్రము నను, స్వప్నావస్థయందు మనస్సునందు ఉండునందురు　33

వ్యాఖ్య: వాస్తవముగ వైశ్వానరునకు హృదయమే స్థానము. స్వప్నమున మనసును, జాగ్రదవస్థయందు నేత్రమండల మందును, హృదయమునుండి వెడలిన వాని తేజమును పొంది సమస్తమును చూచును.　34

వ్యాఖ్య: ఏ విధముగ ఆకాశమునందలి సూత్రాత్మ తేజము సూర్యమండలము నావేశించునో, అట్లే సూర్యమండల మందలి తేజము విశ్వజనుల హృదయమండల మందు ఆవిష్ట మయ్యెను　35

శ్లో॥ సూత్రాత్మా మధ్యమః ప్రోక్తో మహానాత్మార్క-బింబగః ।
జీవాత్మా హృదయ స్థానః శుద్ధాత్మా పరమః స్మృతః ॥ 36

మధ్యమః=వ్యోమమందగు పురుషుడు; సూత్రాత్మా=సూత్రాత్మ అని; ప్రోక్తం=చెప్పబడినాడు; అర్క-బింబగః=సూర్యమండలమం దగువాడు; మహానాత్మా=మహా ఆత్మఅనియు; హృదయ స్థానః=మనుజుల హృదయమం దగువాడు; జీవాత్మా=జీవాత్మ అనియు; పరమః=సత్యలోకవాసి, శుద్ధాత్మా=శుద్ధాత్మ అనియు; ప్రోక్తః=చెప్పబడెను.

శ్లో॥ దేహాభిమానీ సర్వోపి జీవః పృథ గివ స్థితః
ఆత్మానుభూతిమా న్సర్వః సతో జీవో నభిద్యతే 37

జీవః సర్వోపి దేహాభిమానీ=దేహాభిమానము గల ప్రతి వాడును; పృథగివ=వేరైనవాని వలె; స్థితః=ఉన్నాడు; సర్వః ఆత్మానుభూతిమాన్=ఆత్మానుభవము గల ప్రతివాడును; సతః=సత్తుకంటె; జీవః=జీవుడు; న భిద్యతే=వేరుగా ఉండలేడు.

శ్లో॥ అన్తరం భగవద్బుద్ధ్యా మన్వానోఽభిన్నమాత్మనః ।
య ఉపాస్తే నర స్తస్మిన్ భగవా న్సంప్రసీదతి 38

అన్తరం=హృదయాంతరమును, భగవద్బుద్ధ్యా = భగవంతుడు అను బుద్ధితో, ఆత్మనః=తన కన్న, అభిన్నం=వేరు కాని వానిగను, యః నరః=ఏ మనుజుడు; ఉపాస్తే=ఉపాసించునో తస్మిన్=వానియందు, భగవాన్=భగవంతుడు; సంప్రసీదతి=అనుగ్రహించును.

శ్లో॥ అన్తరే భగవద్బుద్ధిః సత్యరూపా న సంశయః
విభిన్నం మన్యతే యత్తు మాత్మనస్తత్ పునర్మృషా 39

అన్తరే=హృదయాంతరమున; భగవద్బుద్ధిః=భగవంతుడు అను బుద్ధి; సత్యరూపా=నిజమైనది; న సంశయః=సందేహము

వ్యాఖ్య : సత్యలోకవాసి పరమాత్మ శుద్ధాత్మ; వ్యోమ మందగు వాడు సూత్రాత్మ, సూర్య మండలమందగువాడు మహాత్మ, జీవులందగు వాడు జీవాత్మ అని క్రమముగ వ్యవహరింప బడుచున్నాడు. 36

వ్యాఖ్య : దేహాభిమానము గల ప్రతి జీవుడు సత్తు కంటె భిన్న ముగా నున్నాడు. అనగా భేదభావముతో నున్నాడు. ఆత్మానుభూతి నందిన జీవుడు సత్తుకన్న అభిన్నుడుగ ఉన్నాడు 37

వ్యాఖ్య : హృదయాంతరమును భగవంతునిగను, ఆత్మాభిన్నుని గను ఎవడు ఉపాసించునో వానిని భగవంతు డను గ్రహించును. 38

వ్యాఖ్య : హృదయాంతరుని భగవంతునిగను ఆత్మాభిన్నునిగను తెలచుట సత్యము విభిన్నునిగ తలచుట అసత్య రూపము. 39

లేదు; ఆత్మనః=తనకన్న; తం=వానిని (హృదయాంతరుని); విభిన్నం=వేరగు వానిగ; యత్ మన్యతే=ఏది కలదో; తత్ పునః=అది అయితే; మృషా=అసత్యమైనది.

శ్లో॥ ఆత్మానమేవ మన్వానా అన్తరం య ఉపాసతే
ఇహైవాత్మానుభూతిః స్యాత్తేషామితి విదో విదుః 40

ఏవం=ఈ విధముగ; అంతరం=హృదయాంతరమును; ఆత్మానం=ఆత్మగా, అనగా ఆత్మ రూపుడగు భగవంతునిగా; మన్వానాః=తలచుచు; యే=ఎవరు; ఉపాసతే = సేవించునో, తేషాం=వారలకు; ఇహైవ=ఈ లోకమునందే, ఆత్మానుభూతిః= ఆత్మానుభవము, స్యాత్ =అగును, ఇతి=ఇట్లని; విదః = తెలిసిన వారు; విదుః= తెలిసికొనుచున్నారు.

## 16. హిరణ్మయరూపాధికరణమ్

శ్లో॥ హిరణ్మయం యదనఘం వపుర్మహత ఆత్మనః
తన్మధ్యమస్య విజ్ఞేయం మండలే ప్రతిబింబితమ్ ॥ 41

యత్ = ఏ; మహతః ఆత్మనః = మహత్తు అను ఆత్మ యొక్క అనగా తేజో రూపమగు ఆత్మయొక్క; హిరణ్మయం= హిరణ్మయమగు, అనఘం=పాపరహితమైన; వపుః= దేహమో; తత్ =అది; మధ్యమస్య = మధ్యముడగు సూత్రాత్మయొక్క, మండలే=సూర్యమండలమున; ప్రతిబింబితమ్= ప్రతిబింబించిన రూపమని; విజ్ఞేయం= తెలియదగినది.

శ్లో॥ సూర్యరూపతయేన్ద్రస్య స్తోత్రం తదుపపద్యతే
శివాయ విష్ణురూపాయేత్యాది సంగచ్ఛతతః 42

తత్ = ఆ కారణముచే, ఇన్ద్రస్య=ఇంద్రునకు; సూర్య రూపతయా=సూర్యరూపముతో స్తోత్రం=నుతి; ఉపపద్యతే=

వ్యాఖ్య : ఈ విధముగ హృదయాంతరమును భగవంతునిగ ఎవరు తెలిసికొని ఉపాసించు చున్నారో వారికి ఈ లోకమునసే ఆత్మానుభవము అగునని పండితులు తెలిసికొనుచున్నారు 40

## 16. హిరణ్మయ రూపాధికరణము

వ్యాఖ్య : మహాన్ ఆత్మయగువాని తేజోమయమగు పాపరహితమైన ఏ రూపమో అది సూత్రాత్మయగు మధ్యముని మండలమున ప్రతిబింబించిన రూపమని తెలియవలయును. 41

వ్యాఖ్య : సూర్యాత్మయొక్క ప్రతిబింబమే మహానాత్మయగుటచేత ఇందిని సూర్యరూపముతో నుతించుట యుక్తముగ జరుగుచున్నది. అట్లే 'శివాయ విష్ణురూపాయ, శివ రూపాయ విష్ణవే' మొదలగు స్తోత్రములు లెస్సగా యుక్తములగుచున్నవి. 42

ఒప్పుచున్నది; తతః=అందుచేతనే; విష్ణురూపాయ=విష్ణురూపుడగు; శివాయ = శివునకు; ఇత్యాది=మొదలగు వాక్యములచే నుతి; సంగచ్ఛతే=లెస్సగాఅగుచున్నది.

శ్లో॥ తద్విశాం నయనస్థానే పునశ్చ ప్రతిబింబితమ్
తద్భిన్న మన్యవద్భాతి హృదయాన్తర వర్తినః 43

విశాం = మానవుల; నయనస్థానే = నేత్రమునందు; పునశ్చ=తిరిగి; తత్ =అది; ప్రతిబింబితమ్=ప్రతి బింబించినది; తత్ =ఆ ఆత్మయేహృదయాన్తరవర్తినః = హృదయాంతరుడగు వానికన్న; భిన్నమ్ = వేరైనదిగను, అన్యవత్ = ఇతరుని వలెను; భాతి=ప్రకాశించుచున్నది.

శ్లో॥ యద్రూపం ప్రథమం దీప్తే మండలే ప్రతిబింబితమ్
తదేవ మండల ద్వారా నయనే ప్రతిబింబితమ్। 44

దీప్తే=ప్రకాశించుచున్న; మండలే=సూర్యమండలమున; ప్రథమం= మొదట, యత్ రూపం=ఏ రూపము, ప్రతిబింబితమ్= ప్రతిబింబించినదో; తదేవ=అదియే; మండలద్వారా=మండలముగుండా; నయనే=నేత్రమునందు; ప్రతిబింబితమ్ = ప్రతిబింబించినది.

శ్లో॥ ఇంద్రమేకే పరే సూర్యం తమాహు ర్నయనాశ్రయమ్
ఉభయోరపి సంబంధ స్తస్యతుల్యోహి దృశ్యతే 45

ఏకే=కొందరు, తం=వానిని; ఇంద్రం=ఇంద్రునిగను; తం నయనాశ్రయమ్=ఆ నేత్రమండము నాశ్రయించిన వానినే; సూర్యం=సూర్యునిగను,పరే=ఇతరులు, ఆహుః=చెప్పుచున్నారు, తస్య=వానికి;ఉభయోరపి=ఇద్దరియొక్క ,సంబంధః=సంబంధము; తుల్యః=సమానమైనదిగ; దృశ్యతే హి=కనబడుచున్నది కదా.

వ్యాఖ్య : సూర్యమండలమున ప్రతిబింబించినదియే మనుజుల నేత్ర మండలమున ప్రతిబింబించినది. అది హృదయాంతరుని కన్న భిన్నునిగను వేరగు వానివలెను భాసించుచున్నది. వాస్తవమునకు వేరుకాదని భావము. 43.

వ్యాఖ్య : ఏ రూపము మొదట సూర్యమండలమున ప్రతిబింబితమైనదో అదియే ఆ మండల ద్వారముగ నేత్ర మండలమున ప్రతిబింబించినది. 44

వ్యాఖ్య : నయనమండలాశ్రయుడైన వానిని ఇంద్రునిగ కొందరు, సూర్యునిగ కొందరు చెప్పుచున్నారు. వానికి ఇరువురి తోడను సంబంధము తుల్యముగ నున్నది. 45.

శ్లో॥ పార్థివేషు శరీరేషు నరాణాం ప్రతిబింబనాత్
పార్థివజ్యోతిషో నామ్నా తమగ్ని మపరే విదుః 46

నరాణాం=మనుజుల, పార్థివేషు, శరీరేషు=పార్థివదేహము లందు, ప్రతిబింబనాత్=ప్రతిబింబించుటవలన; పార్థివజ్యోతిషో నామ్నా=పార్థివజ్యోతి అనుపేరుతో, తం=వానిని; అగ్నిం=అగ్నినిగా. అపరే=కొందరు, విదుః=తెలిసికొనిరి

శ్లో అన్తరస్త్వణిమా పూర్వో హృదయే యః సమీరితః
నయనే బింబితా సేయం హిరణ్మయ పుమాకృతిః 47

హృదయ=హృదయమందు; పూర్వః-మొదట అయిన; యః=ఏ; అణిమా=అతిసూక్ష్మమగు; అన్తరః=అంతరము అని; సమీరితః=చెప్పబడెనో, సేయం=ఆ, ఈ; హిరణ్మయ పుమాకృతిః=హిరణ్మయ పురుషాకృతియే(తైజసరూపమునకే హిరణ్మయ మందురు) నయనే=నేత్రమందు, ప్రతిబింబితా=ప్రతిబింబించినది.

శ్లో ఛాయామాత్రం ప్రభాషన్తే కేచి దేతం తు చాక్షుషమ్
పృథగన్తఃకరణినం పరే ప్రాజ్ఞాః ప్రచక్షతే 48

ఏతం చాక్షుషమ్=ఈ నేత్రమండలమందున్న పురుషుని; కేచిత్=కొందరు; ఛాయామాత్రం=ఛాయామాత్రునిగ; ప్రభాషన్తే=చెప్పుచున్నారు, పరే ప్రాజ్ఞాః=కొందరు ప్రాజ్ఞులు; పృథగన్తః కరణినమ్=వేరుగ నంతఃకరణము కలవానినిగ; ప్రచక్షతే=చెప్పుచున్నారు

శ్లో॥ పృథగన్తఃకరణినం వాసిష్ఠో నానుమన్యతే
నిషేధా ద్బోద్ధు అన్యస్య సర్వథా శ్రుతిమూర్ధని 49

వాసిష్ఠః=వాశిష్ఠుడగు గణపతిముని (గ్రంథకర్త); పృథగన్తఃకరణినం=వేరుగ అంతః కరణముకలవానిని; సర్వథా=అన్నివిధములుగ, బోద్ధుః = తెలిసికొను హృదయాంతరునికన్న;

వ్యాఖ్య : మనుజుల పార్థివ దేహములందు ప్రతిబింబించిన కారణముచే ప్రతిబింబించిన పురుషుని పార్థివజ్యోతి అని అగ్నిరూపుడని కొందరందురు 46

వ్యాఖ్య : హృదయమందు అంతరము అని ఏది అణురూపమని చెప్పబడినదో ఆ తైజసరూపమే నయనమండలమున ప్రతిబింబించినది. 47

వ్యాఖ్య : కొందరు ఈ చాక్షుష పురుషుని ఛాయామాత్రునిగ చెప్పుచున్నారు కొందరు వేరుగ అంతః కరణము కల వాడని అందురు. 48

వ్యాఖ్య : తెలిసికొను హృదయాంతరుని కన్న ఇతరుని ఉపనిషత్తు లెచ్చటను ఉన్నట్టు అంగీకరింపలేదు గాన ఉపనిషత్తులకు విరుద్ధమగునట్టి వేరుగ అంతః కరణముగల చాక్షుష పురుషుని గ్రంథకర్త అంగీకరింపలేదు. ఇందు అంగీకరింప బడని విషయము పృథగన్తఃకరణము మాత్రమే. 49

అన్యస్య = ఇతరుని యొక్క ఉనికిని; శ్రుతిమూర్ధని = ఉపనిషత్తు లందు; నిషేధాత్ = నిషేధించుటచే; న అనుమన్యతే = అంగీకరింప లేదు.

శ్లో॥ ఛాయామాత్రం పామరాణాం తదన్య ప్రతిబింబవత్
అన్తర్ద్విదళ చక్రస్థమైశ మన్యన్తు నేత్రగమ్ ॥ 50

పామరాణాం = పామరులకు; తత్ = అది, అన్యత్ = వేరగు; ప్రతిబింబవత్ = ప్రతిబింబమువలె; ఛాయామాత్రం = ఛాయామాత్రము; అన్తర్ద్విదళ చక్రస్థం = భ్రూమధ్యమందగు (అజ్ఞాచక్రమునందగు); ఐశం = ఈశ్వర సంబంధమగు; నేత్రగమ్ = నేత్రమునం దగునది; అన్యన్తు = భిన్నము.

శ్లో॥ దృష్టాత్మనాన్తు సిద్ధానాం ప్రతిబింబః స ఐశ్వరః
పశ్యత్యఖిల మావిష్టో హృదయాన్తర తేజసా 51

సః = ఆ నేత్రము; దృష్టాత్మనాం = ఆత్మ దర్శనము కల; సిద్ధానాం = సిద్ధులకు, ఐశ్వరః = ఈశ్వర సంబంధమగు, ప్రతిబింబః = ప్రతిబింబము; హృదయాంతర తేజసా = హృదయమందలి తేజస్సుచే; ఆవిష్టః = దాని నావేశించి; అఖిలం = సమస్తమును; పశ్యతి = చూచుచున్నాడు.

శ్లో॥ దివ్యం చక్షు స్తదేవాహు రుత్తమం రూప మైశ్వరమ్
స ధన్యః పురుషో లోకే య స్త దావిశ్య పశ్యతి 52

దివ్యం = దివ్యమగు, చక్షుః = నేత్రము, తదేవ = అదియే; యః = ఎవడు, తత్ = ఆ నేత్రమును; ఆవిశ్య = ఆవేశించి; ఉత్తమం = శ్రేష్ఠమగు; ఐశ్వరమ్ = ఈశ్వర సంబంధమగు; రూపం = రూపమును; పశ్యతి = చూచుచున్నాడో; సః పురుషః = ఆ పురుషుడు; లోకే = లోకమునందు; ధన్యః = ధన్యుడు.

వ్యాఖ్య : పామరుల కది ప్రతిబింబమువలె చ్ఛాయగ నుండును. భ్రూమధ్యమున ఆజ్ఞాచక్రమునందు ఈశ్వర సంబంధ మగు నేత్రము నందగునది అచ్చట వేరుగ నున్నది 50

వ్యాఖ్య : ఆ దివ్య నేత్రము ఆత్మ దర్శనము గల సిద్ధులకు ఈశ్వర ప్రతిబింబము. హృదయాంతర తేజముచే దాని నావేశించి వారు స్వరము చూడగలరు ద్రష్ట హృదయాంతరు డొక్కడేయని ఎఱుక. 51

వ్యాఖ్య : అదియే దివ్యనేత్రము. దాని నావేశించి ఎవడు ఉత్తమ మైన ఈశ్వర రూపమును చూచుచున్నాడో వాడు లోకమున ధన్యుడు. 52

# 17. దేవతాత్రయాధికరణమ్

శ్లో॥ చిద్విభూతిస్త్రిధాప్రోక్తా సత ఏవం పరాత్మనః
ఇన్ద్రసూర్యాగ్ని రూపేణ శిష్టస్తు గుణవైభవమ్ 58

సత ఏవ=సత్తైన; పరాత్మనః = పరమాత్మయొక్క; చిద్విభూతిః = చిద్విభూతి; ఇన్ద్ర సూర్యాగ్నిరూపేణ = ఇందుృడు, సూర్యుడు, అగ్ని అను రూపములచే; త్రిధా=మూడు విధములుగ; ప్రోక్తా=చెప్పబడినది; శిష్టస్తు=మిగిలినది; గుణవైభవమ్=గుణవైభవము మాత్రమే అగుచున్నది.

# 17. దేవతాత్రయాధికరణము

వ్యాఖ్య : సత్తైన పరమాత్మయొక్క చిద్విభూతి ఇంద్ర సూర్యాగ్ని రూపములచే మూడు విధములుగ నున్నది. మిగిలిన రూపములన్నియు గుణవైభవముచే నగునవి 1. పరమాత్మ శుద్ధ సత్వపదార్థము. 2. మాతరిశ్వా : స్వర రూపముచే రుద్రుడు. ప్రాణ రూపముచే మాతరిశ్వా. ఐశ్వర్య యోగముచే ఇంద్రుడు అనబడును అరూపుడు ఈ రెండింటి భేదము వ్యావహారికము 58

సగుణబలం. (1) మఘ్యమః : మహేశ్వర మహేంద్ర అను నామాంతరుడు. ఇతని వనిత మహేశ్వరి, ఇంద్రాణి అను నామాంతరము కలది. (2) హిరణ్యగర్భః. పరపురుషని ప్రతిబింబము. సూర్యమండలావిష్టము విష్ణు, ఉత్తమ, ఉద్గీథ అను నామాంతరములు కలవు. (3) మిత్రావరుణౌ; ఏడు సూర్య కిరణముల సమూహము. శుక్ల వర్ణము అతడే మార్తాండుడు. సప్త అని తెలుపునకు నామాంతరము. మార్తాండునకే ఘృణి, మిత్ర అనునవి నామాంతరములు. శుక్ల వర్ణము గుణము కాన గుణ వైభవముచే నైన దేవత. పగటి దేవత మిత్రుడు వరుణుడు తిమిరాత్మకుడు. రాత్రికి దేవత. మిత్రునిచే జాగ్రద్దశా బోధ కలుగు తీరున నిద్రా సమాధు లందగు బోధ వరుణునిచే నగును. తిమిర మనగా అంధకారము కాదు. విషయ వస్తువులను గ్రహింపక దృష్టి ఉండుటచే అంధకారమని వ్యవహారము. (4) అర్యమా : చంద్ర మండలమును ప్రవేశించిన సూర్యరశ్మియే అర్యమ. స్వప్న బోధ నిచ్చువాడు. (5) నాసత్యౌ : శీతోష్ణగుణముల వైభవముచే నైన దేవతలు. అశ్వినులు. సూర్యా చంద్రులని కొందరు, దివా రాత్రములని కొందరు అందురు (6) త్వష్టా : కాల స్వరూపుడు.- విజ్ఞానమే కాలము. శక్తి యొక్క దశా భేదము. (7) వైశ్వానరః : మానవ హృదయములందు ఆవిష్టుడై ప్రతిబింబించిన హిరణ్యగర్భుని రూపము జీవాత్మ. (8) హిరణ్మయ రూపుడు. సూర్య మండల ప్రతిబింబిత రూపము. ఇంద్ర సూర్యా

శ్లో॥ విద్యుద్దృశ్యా రవేర్బింబం పార్థివోఽగ్నిశ్చ తత్త్వతః ।
భౌతికాన్యేవ వస్తూని దేవతాఖ్యా స్త్రయోఽన్తరాః ॥ 54

దృశ్యా=చూడనర్హమగు; విద్యుత్=విద్యుత్తును; రవేః=సూర్యుని, బింబం = మండలమును; పార్థివః = భూమియందగు; అగ్నిః=అగ్నియు, భౌతికాని; ఏవ=భౌతికములగు, వస్తూని=వస్తువులు, త్రయః, అంతరాః=వానియందగు మూడు అంతరములు, దేవతాఖ్యాః=దేవతలను ప్రసిద్ధి కలవి

శ్లో॥ వైశ్వానరస్య ప్రతిమా పార్థివోఽగ్ని రుదీరితః
మండ లాన్తర్గత స్యాహుః మండలం ప్రతిమాం బుధాః ॥ 55

పార్థివః, అగ్నిః=పార్థివాగ్ని, వైశ్వానరస్య=వైశ్వానరుని; ప్రతిమా=ప్రతిమ అని; ఉదీరితః=పలుకబడినది; మండలాంతర్గతస్య=మండలాంతరుని యొక్క; ప్రతిమా=ప్రతిమ। మండలం=మండలమని; బుధాః=పండితులు; ఆహుః=చెప్పిరి.

శ్లో॥ దృశ్యోఽయం వైద్యుతో వహ్నిః స్పృశ్యోఽయం చ సమీరణః
ప్రాణస్య మహతః ప్రాజ్ఞైః ప్రతిమే సహజే ఉభే 56

దృశ్యః=చూడదగిన, అయం=ఈ; వైద్యుతః వహ్నిః=వైద్యుతాగ్నియు; స్పృశ్యః=స్పృశింపతగిన; అయం=ఈ సమీరణః చ=వాయువును; ప్రాణస్యమహతః=ప్రాణమైన మహత్తు యొక్క; సహజే=సహజములగు ఉభే=రెండు; ప్రతిమే=ప్రతిమలు,

గ్నులు తప్ప మిగిలినవి గుణ వైభవముచే నైనవి భౌతికములగు గుణ కర్మలచే కూడా ఇట్లే దైవత్వముగును అవి పరంపరచే నైన దైవత్వమని అన్నింట విభూతి గుణాది భేదమే కాని ఆరాధ్యమగు వది పరమాత్మ యని భావము కావుననే 'కస్మై దేవాయ' అను నపుడు ఏకస్మై దేవాయ అని ఏకార లోపము చెప్పిరి.

వ్యాఖ్య : కనపడు విద్యుత్తు, సూర్యబింబము, పార్థివాగ్నియు భౌతిక వస్తువులయ్యును దేవతాంతరములు కలవి కాన వానికి దేవత్వము మూడింటికి అగును. ఇంద్ర సూర్యాగ్నులను అంతర రూపులకే దైవత్వము. 54

వ్యాఖ్య : వైశ్వానరుని ప్రతిమ పార్థివాగ్ని అనియు, మండలాంతరుని ప్రతిమ మండలమనియు పండితులు తెలిపిరి. 55

వ్యాఖ్య : దృశ్యమగు వైద్యుతాగ్నియు, స్పృశ్యమైన వాయువును ప్రాణమైన మహాత్తు యొక్క సహజములగు రెండు ప్రతిమలు అని ప్రాజ్ఞులు పలికిరి 56

శ్లో॥ అండపిండో పాధికత్వా త్ప్రణవోపాధికత్వతః
పూజనీయా చిద్విభూతిస్త్రివిధా పరమాత్మనః 57

అండపిండో పాధికత్వాత్ = బ్రహ్మాండములు, దేహములు ఉపాధులుగాకల దగుటచేతను; ప్రణవోపాధి కత్వతః = ప్రణవము ఉపాధిగా కలదగుట చేతను; పరమాత్మనః = పరమాత్మయొక్క; త్రివిధా = మూడువిధములగు; చిద్విభూతిః = చిద్విభూతి; పూజనీయా = పూజింప దగినది

శ్లో॥ విదుర్మహాన్త మాత్మానమండోపాధిక మీశ్వరమ్
అగ్నిం వైశ్వానరమిమం పిండోపాధిం ప్రచక్షతే 58

అండోపాధికం = మండల ముపాధిగాకల; ఈశ్వరమ్ = ఈశ్వరుని; మహాన్తమ్, ఆత్మానం = మహాన్ ఆత్మ అని; విదుః = తెలిసికొనిరి. పిండోపాధిం = దేహ ముపాధిగాకల; అగ్నిం = అగ్నియైన, వైశ్వానరం = వైశ్వానరునిగ; ప్రచక్షతే = చెప్పుచున్నారు.

శ్లో॥ భణన్తిప్రణవోపాధి మిన్ద్రం విశ్వోత్తరం బుధాః
వదన్తి పరమాత్మానం తమేవ నిరుపాధికమ్ 59

బుధాః = పండితులు, విశ్వోత్తరం = విశ్వశ్రేష్ఠుడైన; ఇన్ద్రం = ఇంద్రుని; ప్రణవోపాధిం = ప్రణవమే ఉపాధిగాకల వానిగా, భణన్తి = చెప్పుచున్నారు తమేవ = వానినే, నిరుపాధికమ్ = ఉపాధి లేనివానిని; పరమాత్మానం = పరమాత్మగా, వదన్తి = చెప్పుచున్నారు.

శ్లో॥ కేచిద్భంగ్యన్తరేణాహుః త్రీనేతానేవ పూరుషాన్
హృత్సూర్యగగన స్థానా న్విధి విష్ణు మహేశ్వరాన్ । 60

కేచిత్ = కొందరు; భంగ్యన్తరేణ = వేరువిధముగ, ఏతాన్ = ఈ; త్రీన్, ఏవ, పురుషాన్ = ముగ్గురినే, హృత్, సూర్య, గగన స్థానాన్ = హృదయము, సూర్యుడు, గగనము స్థానముగా గల; విధి విష్ణు మహేశ్వరాన్ = విధి, విష్ణు, మహేశ్వరుడు అని; ఆహుః = చెప్పిరి

వ్యాఖ్య : అండపిండ బ్రహ్మాండములు ఉపాధులు గాకల పరమాత్మ యొక్క మూడు విధములగు చిద్విభూతి పూజింపతగిన దగుచున్నది. 57

వ్యాఖ్య : మండలోపాధియై ఈశ్వరుడు మహాత్మ అనియు, పిండోపాధియైన వైశ్వానరుని అగ్ని అనియు చెప్పచున్నారు 58

వ్యాఖ్య : విశ్వోత్తరుడైన ఇంద్రుని బ్రహ్మోపాధిగల వానిగ చెప్పచున్నారు వానినే నిరుపాధికుడైనచో పరమాత్మ అనుచున్నారు. 59

వ్యాఖ్య : కొందరు ఈ ముగ్గురు పురుషులనే వేరువిధముగ చెప్పచున్నారు. ఎట్లన హృదయస్థాన మందగువాడు విధి. సూర్యమండల మందగువాడు విష్ణువు. గగనస్థాన మందగువాడుమహేశ్వరుడు అని చెప్పిరి. 60

# చతుర్థః పరిచ్ఛేదః

## 18. ఇతర దేవతాధికరణమ్

శ్లో॥ భౌతికానాన్తు వస్తూనాం దేవతాత్వం యదుచ్యతే
కర్మణాంవా గుణానాంవా తత్పరం పరయా భవేత్ 1

భౌతికానామ్=భౌతికములగు, వస్తూనాం = వస్తువులకు; దేవతాత్వం=దేవతాత్వము, ఉచ్యతే, ఇతి యత్, తు=చెప్ప బడుచున్నది ఏది కలదో, తత్ =అది, కర్మణాం వా=కర్మల యొక్క గాని, గుణానామ్ వా=గుణముల యొక్క గాని; పరం పరయా=పరంపరా సంబంధముచే; భవేత్ =అగును.

## 19. మతాంతరేణ మూర్తిత్రయాదికరణమ్

శ్లో॥ సూర్యం పృథ్వీం శశాంకంచ ప్రాహుర్మూర్తిత్రయం పరే
సూర్యాత్పృథ్వీ తతశ్చన్ద్ర ఇతి సర్గ క్రమో మతః 2

పరే=కొందరు; సూర్యం=సూర్యుని, పృథ్వీం=భూమిని; శశాంకంచ=చంద్రుని, మూర్తిత్రయం=మూడు మూర్తులుగ; ప్రాహుః=చెప్పుదురు; సూర్యాత్ =సూర్యుని వలన; పృథ్వీ= భూమియు; తతః=తరువాత; చంద్రః=చంద్రుడును; ఇతి=అని; సర్గక్రమః=సృష్టిక్రమము; మతః=అంగీకరింపబడినది.

శ్లో॥ విశ్వరూపో రవిర్విష్ణుః సత్వోద్రిక్త ఉదాహృతః
రజోఽధికస్త్వయం లోకో నాభి జన్మా ప్రకీర్త్యతే 3

సత్వోద్రిక్తః = సత్వగుణాధికుడును; విశ్వరూపః = విశ్వ రూపుడును అగు; రవిః=సూర్యుడు; విష్ణుః=విష్ణువని; ఉదా హృతః=చెప్పబడినాడు; రజోఽధికః=రజోగుణమధికముగ గల; అయం లోకః=ఈ భూలోకము, నాభి జన్మా=బ్రహ్మ అని; ప్రకీర్త్యతే=చెప్పబడుచున్నాడు.

# సాంఖ్య పరిచ్ఛేదము

## 18. ఇతర దేవతాధికరణము

వ్యాఖ్య భౌతికములగు వస్తువులను దేవతలుగా చెప్పుదురు. అప్పుడు దేవత్వము గుణముల లేక కర్మల పరంపరా సంబంధముచే అగును 1

## 19. మతాంతరముచే మూర్తిత్రయాధికరణము

వ్యాఖ్య సూర్యుడు, భూమి, చంద్రుడు మూర్తిత్రయమని కొందరందురు సూర్యుని వలన భూమియు, తరువాత చంద్రుడును పుట్టిరి, అని సృష్టి క్రమము చెప్పుదురు. 2

వ్యాఖ్య సత్త్వ గుణ ప్రధానుడగు విశ్వవ్యాపకుడైన విష్ణువని [illegible] నందురు. రజోగుణ ప్రధానుడగు బ్రహ్మనుగా ఈ లోకమును చెప్పుదురు. 3

శ్లో॥ ప్రేతలోకః శశాంకస్తు తామసో భూతనాయకః
ఉదాహరన్తి యం జాతం బ్రహ్మణో ఫాలదేశతః 4

ప్రేతలోకః = ప్రేతలోకమగు, శశాంకః =చంద్రుడు; తామసః=తమోగుణ ప్రధానుడగు; భూతనాయకః= శివుడు యం=ఎవనిని; బ్రహ్మణః=బ్రహ్మదేవునికి; ఫాలదేశతః = లలాటము నుండి; జాతం=పుట్టిన వానినిగ; ఉదాహరన్తి =చెప్పుచున్నారో, సః, భూత నాయకః=వాడే శివుడు.

శ్లో॥ ఏతన్మూర్తిత్రయం జ్ఞేయం బ్రహ్మ విష్ణు హరాహ్వయమ్
మహాల్యోఽమూర్తయోలోకాః పిండాహ్యల్పాహి
మూర్తయః 5

బ్రహ్మ విష్ణు హరాహ్వయమ్=బ్రహ్మ, విష్ణువు, హరుడు అను పేర్లు గల; ఏతత్ =ఈ; మూర్తిత్రయం=ముమ్మూర్తులు; జ్ఞేయం= తెలియదగినవి; మహాల్యః= పెద్దవగు; మూర్తయః= మూర్తులు; లోకాః = లోకములు; పిండాః హి = పిండములు (మానవ దేహములు): అల్పమూర్తయః=అల్పమూర్తులు.

శ్లో॥ మూర్తిత్రయాన్తరా జ్ఞేయాః ప్రసిద్ధాః పురుషాస్త్రయః
వ్యాహృతి త్రితయం త్వేషాం మతే భూ చన్ద్ర భానుషు॥ 6

మూర్తిత్రయాన్తరాః=ఆ మూడు లోకమూర్తుల అంతరములగు, త్రయః=ముగ్గురు; పురుషాః=పురుషులు; ప్రసిద్ధాః= ప్రసిద్ధులు; జ్ఞేయాః =తెలియతగినవారు; త్వేషాంమతే=వారి మతమున; వ్యాహృతి త్రితయం = మూడు వ్యాహృతులు; భూచన్ద్రభానుషు=భూమి, చంద్రుడు, సూర్యుడు అను మూడింటియందగును.

## 20. ఉభయ లింగాధికరణమ్

శ్లో॥ భోక్తృత్వమపి భోగ్యత్వం లోకానాం సంప్రదృశ్యతే
భునక్తి సూర్యః పృథివీం భుజ్యతే శీతరశ్మినా ॥ 7

వ్యాఖ్య : ఎవనిని బ్రహ్మయొక్క ఫాల దేశమునుండి పుట్టిన వానినిగా చెప్పుదురో అట్టి తామసుడు, భూత నాయకుడు అగు శివుడే పిత్ర లోకమగు శశాంకుడందురు 4

వ్యాఖ్య : బ్రహ్మ, విష్ణు మహేశ్వరులను మూడు మూర్తులుగ వీరిని తెలియవలెను. లోకములు మహామూర్తులు అండములు, పిండములు అల్పమూర్తులు. 5

వ్యాఖ్య : ప్రసిద్ధులగు నా ముగ్గురు పురుషులు మూర్తిత్రయము యొక్క అంతరములు. ఇట్లనువారి మతమున భూః, భువః, సువః అను మూడు వ్యాహృతులు భూ చంద్ర భానువులందగును. 6

## 20. ఉభయలింగాధికరణము

వ్యాఖ్య : ఈ లోకములకు అనుభవించుట, అనుభవింపబడుటయు అగుచున్నవి. సూర్యుడు భూమిననుభవించుచు, చంద్రు

లోకానాం=ఈ మూడు లోకములకు; భోక్తృత్వమ్=భోక్తృత్వము; భోగ్యత్వం = అనుభవింపబడుట అను రెండును, సంప్రదృశ్యతే=కనబడుచున్నవి; సూర్యః = సూర్యుడు; పృథివీం=భూమిని; భునక్తి = అనుభవించుచున్నాడు, శీతరశ్మినా=చంద్రునిచేత, భుజ్యతే=అనుభవింపబడుచున్నాడు

శ్లో॥ భునక్తి పృథివీ చన్ద్రం తస్మా దుభయలింగతా
త్రయాణామపి లోకానాం తద్రహస్యం విదో విదుః 8

పృథివీ=భూమి; చంద్రం = చంద్రుని; భునక్తి=అనుభవించుచున్నది; తస్మాత్ = ఆ కారణముచే, ఉభయలింగతా=రెండు లింగములు కలిగి యుండుట; త్రయాణాం = మూడగు; లోకానాం=లోకములకు; తత్ = అనుభవించుట, అనుభవింపబడుట అనునది; రహస్యం=గోప్యమైనది, దానిని విదః=తెలిసినవారు; విదుః=తెలుసుకొనుచున్నారు

శ్లో॥ అసౌ విభాకర శ్చండీ పృథ్వీ కమలా మతా
సోమ స్సరస్వతీదేవీ భోగ్యత్వే వ్యవహారతః 9

భోగ్యత్వే=భోగ్యత్వమందు; వ్యవహారతః = వ్యవహారముచే, అసౌ=ఈ, విభాకరః = సూర్యుడు; చండీ=చండీనామధరుడు. పృథివీ=భూమి. కమలా=కమలా నామకము, సోమః=చంద్రుడు, సరస్వతీదేవీ=సరస్వతీదేవి.

శ్లో॥ తన్త్రే సహోదర ద్వంద్వ త్రితయం యదుదీరితమ్
ఏకైక స్యోభయాత్మత్వం తత్ర జ్ఞేయం మనీషిభిః 0

తన్త్రే = తంత్రశాస్త్రమందు; యత్ =ఏ; సహోదర ద్వంద్వ త్రితయమ్ = సహోదర ద్వంద్వత్రయము, ఉదీరితమ్=పలుకబడినదో; తత్ర=అక్కడ, ఏకైకస్య=ఒక్కొక్క గోళమునకు. ఉభయాత్మత్వం=ఉభయ లింగత్వము; మనీషిభిః=పండితులచే; జ్ఞేయం= తెలియదగినది,

నిచే అనుభవింపబడు చున్నాడు. 7

వ్యాఖ్య భూమి చంద్రుని అనుభవించుచున్నది ఇట్లు వానికి ఉభయ లింగత్వ మేర్పడినది. అది ఆ లోకముల రహస్యము నెరిగినవారు ఎరుగుదురు. 8

వ్యాఖ్య · అనుభవింపబడునపుడు, సూర్యునకు చండ యనియు, భూమికి కమలాయనియు చంద్రునకు సరస్వతీ అనియు పేర్లు 9

వ్యాఖ్య: తంత్ర శాస్త్రమున సహోదర ద్వంద్వ త్రితయము చెప్పబడినది ఉభయ లింగములు గల మూడు గోళములే అక్కడ ఉద్దిష్టములని పండితులు తెలియవలసినది. 10

శ్లో॥ స్త్రీ రూపతా యథా పుంసాం స్త్రీణాం పుంరూపతా తథా।
తన్త్రోదితా సమన్వేతి లింగ ద్వితయ సంగతేః ॥ 11

పుంసాం=పురుషులకు; యథా = ఏ విధముగా; స్త్రీ రూపతా=స్త్రీ రూపమో; స్త్రీణాం=స్త్రీలకు; తథా=అట్లే, పుంరూపతా=పురుషరూపము; లింగద్వితీయ సంగతేః=రెండు లింగముల నంగీకరించుటచే; తంత్రోదితా=తంత్రవాక్యము; సమన్వేతి=సమన్వయించుచున్నది.

శ్లో ఏవం త్రయాణామ్ ద్వైవిధ్యా లోకానాం షట్స్వరూపతా।
తన్త్రోదితా సమన్వేతి లింగ ద్వితయ సంగతేః ॥ 12

ఏవం=ఈ విధముగా; త్రయాణాం లోకానాం=మూడు లోకములకు; ద్వైవిధ్యాత్=స్త్రీ పురుష భేదముచే రెండు రూపము లగుటవలన; షట్స్వరూపతా=అరు రూపములగుట; లింగ ద్వితయ సంగతేః=ఉభయ లింగత్వము చేత: తంత్రోదితా=తంత్రవాక్యము; సమన్వేతి=సమన్వయించుచున్నది.

శ్లో॥ భోక్తా సూర్యో హరిర్నామ భునక్తి పృథివీం రమామ్।
భోక్తా సోమో హరోనామ భుంక్తే చండీ మినాత్మికామ్ ॥ 13

హరిర్నామ=హరియను; భోక్తాసూర్యః = భోక్తయగు సూర్యుడు; రమామ్=రమఅను; పృథివీం=భూమిని; భుంక్తే= అనుభవించుచున్నాడు; హరోనామ=హరుడను; భోక్తాసోమః= భోక్తయైన సోముడు; ఇనాత్మికామ్ = సూర్యాత్మికమైన; చండీమ్=చండిని; భుంక్తే=అనుభవించుచున్నాడు.

శ్లో॥ అయం లోకో విధిర్నామ భోక్తా భుంక్తే సరస్వతీమ్
ధాతా పీయూష సరసాం చన్ద్రమండల రూపిణీమ్ । 14

విధిర్నామ=విధియను పేరుగల; ధాతా=బ్రహ్మ; అయం లోకః=ఈ భూలోకము అను; భోక్తా=భోక్త; పీయూష సర

వ్యాఖ్య : స్త్రీలకు పురుష రూపమెట్లో, పురుషులకు స్త్రీరూపము అట్లే అగును. ఇట్లు ఉభయ లింగత్వాంగీకారముచే తంత్రి వాక్యము సమన్వయించుచున్నది. 11

వ్యాఖ్య : స్త్రీ పురుష భేదముచే ద్వివిధమగుటచే మూడు లోక ములకు ఆరు రూపము లగుచున్నవి. ఉభయ లింగ త్వముచే తంత్రివాక్యము సమన్వయించుచున్నది. 12

వ్యాఖ్య : సూర్యుని భోక్త్రంశ హరియను పేరున భూమి భోగ్యాంశ మైన రమను అనుభవించుచున్నాడు. అట్లే భోక్తమైన సోముడు హారుడను పేరున భోగ్యాంశమైన ఇనాత్మక మగు చండిని అనుభవించుచున్నాడు. 13

వ్యాఖ్య : ఈ లోకము భోక్త అగునపుడు విధి, ధాత అను పేరు లతో చంద్ర మండల రూపమైన అమృతరస సరసమగు సరస్వతిని అనుభవించుచున్నాడు. 14

సాం=అమృత రసయుతమగు; చంద్రమండలరూపిణీమ్=చంద్ర మండల రూపమగు; సరస్వతీమ్ = సరస్వతిని, భుంక్తే=అను భవించుచున్నాడు.

## 21. మతాంతర గౌణత్వాదికరణమ్

శ్లో॥ త్రియాణామిహ లోకానాం భూభాను తుహిన త్విషామ్
గుణతః స్యాదుభయథా త్రిమూర్తిత్వ ప్రకల్పనమ్ ॥ 15

భూభాను తుహినత్విషామ్=భూమి, సూర్యుడు, చంద్రుడు అను; త్రియాణాం లోకానాం=మూడు లోకములకు; ఇహ= ఇక్కడ; గుణతః=గుణముల ననుసరించి; ఉభయథా= రెండు విధములుగా; త్రిమూర్తిత్వ ప్రకల్పనమ్=మూర్తిత్రయ కల్పనము; స్యాత్ =అగును.

శ్లో నిత్యం చలన శీలాస్తే యద్యపి ప్రాణిన స్త్రయః
పృథగన్తః కరణినో న వేత్యత్ర తు సంశయః 16

నిత్యం=ఎల్లప్పుడు; చలనశీలాః=చలన స్వభావముకల, త్రయః=మూడును; యద్యపిప్రాణినః=ప్రాణముకలవి అనుట యుక్తమైనను, పృథగన్తః కరణినః=వేరుగా అంతఃకరణములు గలవి అగునా; న వా=కావా, అని; అత్ర=ఈ విషయమున; సంశయః=సందేహము కలదు.

## 22. తృతీయ మతే మూర్తిత్రయాధికరణమ్

శ్లో॥ ఉద్గీథః పురుషో భానౌ ప్రథమః పురుషః క్షితౌ
శశాంకే ప్రథమః ప్రేతోమహాన్త స్తేతు వస్తుతః ॥ 17

భానౌ=సూర్యునియందు; ఉద్గీథః, పురుషః=ఉద్గీథుడను వాడును; క్షితౌ= భూమియందు, ప్రథమః పురుషః= మొదటి

## 21. మతాంతర గౌణత్వాధికరణము

వ్యాఖ్య. భూ, చంద్ర, సూర్యులను ఈ మూడు లోకములకు గుణభేదముచే రెండు విధములుగను, త్రిమూర్తిత్వ కలనమగుచున్నది. 15

వ్యాఖ్య : చలన స్వభావముగల ఈ గోళములు మూడును ప్రాణములు గలవనుటకు అవకాశమున్నను వేరుగా అంతఃకరణములు కలవా, లేవా అను విషయము నిర్ధారితము కాలేదు. 16

## 22. తృతీయ మతముచే మూర్తిత్రయాధికరణము

వ్యాఖ్య : సూర్యమండలమందగు ఉద్గీథుడు, భూమియందు మొదటివాడు, చంద్రునందు మొదటి ప్రేతయు వాస్తవముగ గొప్పవారు 17

పురుషుడును; శశాంకే=చంద్రునియందు, ప్రథమః ప్రేతః= మొదటి ప్రేతయు; తే తు=వారు ముగ్గురును; వస్తుతః=నిజముగ మహాన్తః=గొప్పవారు.

శ్లో॥ తేషామపి త్రిమూర్తిత్వ కల్పనా దృశ్యతే క్వచిత్
విదుషాం కల్పనే తేషాం నైక స్యోభయలింగతా ॥

తేషామపి=ఆ ఉద్గీథాదులకు; మూర్తిత్వకల్పనా= దేహిత్వ కల్పనము; క్వచిత్=కొన్ని స్థలములందు; దృశ్యతే=కనబడు చున్నది; ఏ తేషాం=వీరలకు; ఏకస్య=ఒక్కొక్కనికి; ఉభయ లింగతా= ఉభయలింగములు కలిగియుండుట; విదుషాం=పండి తుల; కల్పనా=కల్పన,

శ్లో. న భిదా విష్ణు విషయే పక్షయో రాదిమాన్త్యయోః
తృతీయే నియతైకత్రి బ్రహ్మసంజ్ఞా శరీరిణి ॥ 19

ఆదిమాన్త్యయోః పక్షయోః=అద్యంతము లగు పక్షము లకు; విష్ణువిషయే = విష్ణువిషయమున; నభిదా = భేదము లేదు; తృతీయే=మూడవ మతమున; శరీరిణి= దేహియందు; బ్రహ్మ సంజ్ఞా=బ్రహ్మ అను సంజ్ఞ; నియతా=నియతమైనది.

శ్లో॥ యథోద్గీథో భవత్యాత్మా సూర్యమండలవాసినామ్ ।
పితామహ స్తథాత్మా స్యాద్భూమి మండల వాసినామ్ 20

సూర్యమండలవాసినామ్=సూర్యమండలమందగు వారలకు; ఉద్గీథః=ఉద్గీథ పురుషుడు, యథా=ఏవిధముగా; ఆత్మా=ఆత్మ; భవతి=అగునో, తథా=ఆ విధముగా; భూమిమండల వాసినామ్= భూవాసులకు, పితామహః=బ్రహ్మ ఆత్మాస్యాత్ =ఆత్మ అగును.

శ్లో తస్మాన్న కాచన భిదా పక్షయో రాదిమాన్త్యయోః
ఉక్తిభంగీ భిదైవైకా విషయేఽపి ప్రజాపతేః 21

వ్యాఖ్య : ఆ ఉద్గీథాదులకు మూర్తిత్వకల్పన కానవగును. వీరలకు ఉభయలింగత్వము పండితుల కల్పన. 18

వ్యాఖ్య : ఆద్యంత పక్షములందు విష్ణువిషయమున భేదము లేదు. మూడవవారి మతమున, శరీరియే బ్రహ్మసంజ్ఞ కలవాడగును. 19

వ్యాఖ్య : సూర్యమండలవాసులకు ఉద్గీథుడు ఆత్మయగునట్లు, భూమండలవాసులకు బ్రహ్మయే ఆత్మయగును. 20



వ్యాఖ్య : ఆద్యంత పక్షములందు భేదములేదు. ప్రజాపతి విషయమునను మాటల భేదమే కాని విషయభేదములేదు 21

ఆదిమాన్త్యయోః=ఆద్యంతపక్ష విషయమందు; తస్మాత్ = పూర్వశ్లోకోదాహృత విషయానుసారముగ; నకాచన భిదా=ఏమి భేదము లేదు ప్రజాపతేః=బ్రహ్మయొక్క; విషయేః=విషయమందును; ఏక=ఒక్కటియేతీరు, ఉక్తిభంగి భిదా=మాటల భేదమే కలదు.

శ్లో॥ ఆద్యే పక్షే తృతీయస్య పక్షస్య తు హరో యమః
హరాస్త్రయ స్తృతీయేతు రుద్రేశ్వర సదాశివాః 22

ఆద్యేపక్షే=మొదటి పక్షమున; హరః=హరుడను వాడే; తృతీయస్య పక్షస్య=మూడవపక్షమందు వారికి; యమః=ప్రేతపతి; తృతీయే=మూడవపక్షమున; రుద్రేశ్వర సదాశివాః=రుద్ర, ఈశ్వర సదాశివులను; హరాః=శివులు; త్రయః=ముగ్గురు.

శ్లో॥ నాయకః పితృలోకస్య నామతో రుద్ర ఉచ్యతే
ఈశ్వరో వ్యోమలోకస్య పరమాత్మా సదాశివః 23

పితృలోకస్య=చంద్రలోకమునను; నాయకః=నేతయగువాడు, నామతః=పేరుచే; రుద్రః=రుద్రుడు అని; ఉచ్యతే=చెప్పబడును వ్యోమలోకస్య=వ్యోమలోక ప్రభువు; ఈశ్వరః=ఈశ్వరుడనువాడు; పరమాత్మా=పరమాత్మయే; సదాశివః=సదాశివుడు.

## 23. చతుర్వ్యూహాధికరణమ్

శ్లో॥ సదాశివం కేపి నామ్నా వాసుదేవం ప్రచక్షతే
సంకర్షణంచ ప్రద్యుమ్నం పురుషౌ మధ్యమోత్తమౌ 24

కేపి=కొందరు; సదాశివం=సదాశివునే; నామ్నా=పేరుచే, వాసుదేవం=వాసుదేవుడని; ప్రచక్షతే=చెప్పుదురు; మధ్యమోత్తమౌ, పురుషౌ=మధ్యమోత్తములైన పురుషులను, సంకర్షణం=సంకర్షణుడని, ప్రద్యుమ్నం=ప్రద్యుమ్నుడని చెప్పుదురు.

వ్యాఖ్య : మొదటి వక్షములోని హారుడే తృతీయ పక్షములో యముడు. సదాశివ, ఈశ్వర; రుద్రనాయకులైన ముగ్గురు హారులలో రుద్రుడే హారుడు.అతడే యముడు. 22

వ్యాఖ్య : పితృలోకాధిపతి రుద్రుడనబడును. వ్యోమాధిపతి ఈశ్వరుడు. పరమాత్మయే సదాశివుడు. వీరే హార త్రియము. 23

## 23. చతుర్వ్యూహాధికరణము

వ్యాఖ్య : సదాశివుని (పరమాత్మని) వాసుదేవుడని అందురు. మధ్యముని పేరు సంకర్షణుడు ఉత్తముని పేరు ప్రద్యుమ్నుడు అని కొందరందురు. 24

శ్లో॥ పార్థివస్యా నిరుద్ధాఖ్యా మతే తేషాం విపశ్చితామ్
ఆద్యపక్ష ఇవాత్రాపి నోల్లేఖః పితృభూప తేః ॥ 25

తేషాం విపశ్చితామ్ మతే=ఆ పండితుల మతమున; పార్థివస్య=భూమియందగువానికి; అనిరుద్ధాఖ్యా=అనిరుద్ధుడని పేరు; ఆద్యపక్షే ఇవ=మొదటిపక్షమునందువలె; పితృభూప తేః=చంద్రలోకవాసికి; న ఉల్లేఖః=గణన లేదు.

వ్యాఖ్య: భూమియందగు దేవునకు అనిరుద్ధుడని కొందరి మత
మున పేరు. వీరి మతమున చంద్రలోకవాసి యగు
ప్రేతపతికి గణన లేదు. 25

# పంచమ పరిచ్ఛేదః

## 24. శ్రేష్ఠాధికరణమ్

శ్లో॥ శ్రేష్ఠం ప్రాణ మవిజ్ఞాయ జ్ఞాయతే నైవ కించన
ఆత్మనశ్చ శరీరస్య స మధ్యస్థో విరాజతే॥ 1

శ్రేష్ఠంప్రాణం = శ్రేష్ఠప్రాణమును; అవిజ్ఞాయ = తెలియక; నైవ కించన జ్ఞాయతే=కొంచెమైనను తెలియదు; సః = ఆ శ్రేష్ఠ ప్రాణము; ఆత్మనః=ఆత్మకు, శరీరస్య=శరీరమునకు; మధ్యస్థః= మధ్యనున్నదై, విరాజతే=ప్రకాశించుచున్నది.

శ్లో॥ శరీరమాత్మనః శ్రేష్ఠః శరీరస్యతు సోఽన్తరః
అతిలంఘ్యత మాత్మానం ప్రదర్శయితుం క్షమః 2

ఆత్మనః=ఆత్మకు; శరీరం=శరీరమగునది; శ్రేష్ఠః = శ్రేష్ఠ ప్రాణము, సః=ఆ శ్రేష్ఠప్రాణము; శరీరస్య=మన స్థూలశరీర మునకు; అన్తరః=అంతరమైనది, తం = ఆ శ్రేష్ఠప్రాణమును, అతిలంఘ్య=విడిచి; ఆత్మనః=ఆత్మను, కః=ఎవడు; ప్రదర్శ యితుం=చూపుటకు, క్షమః=సమర్థుడు.

శ్లో॥ జీవస్యోపాధి రధ్యాత్మం ప్రాణోఽయం సర్వభూతభృత్
భాగే భూతరసే పాకా దణిష్ఠేఽపా మణుర్మితః 3

సర్వభూతభృత్ = సర్వభూతములను భరించునట్టియును; అయంప్రాణః=ఈ ప్రాణము; జీవస్య=జీవునకు; అధ్యాత్మం= అధ్యాత్మమగు, ఉపాధిః=శరీరము; భూతరసేభాగే=భాగమైన భూతరసమైనట్టియు; పాకాత్ =పరిణామముచే; అణిష్ఠే=మిక్కిలి చిన్నదానియందు; మితః=పరిమితమైన; అపాం అణుః=రసాణువు.

శ్లో॥ ఈశ్వరే ధర్మభూతోఽయం శరీరే ధర్మితా మితః
అహమిత్యభిమానేన యద్భాత్యతి విభిన్నవత్ 4

# అయిందవ పరిచ్ఛేదము

## 24. శ్రేష్ఠాధికరణము

వ్యాఖ్య. శ్రేష్ఠ ప్రాణమును గూర్చి తెలియక ఏమియు తెలియదు అది ఆత్మకు శరీరమునకు మధ్యను ప్రకాశించు చున్నది. 1

వ్యాఖ్య: ఆత్మకు శరీరము శ్రేష్ఠ ప్రాణము స్థూల శరీరమునకు శ్రేష్ఠ ప్రాణము అంతరము అట్టి ప్రాణమును విడచి ఎవడు సత్యమును చూపగలడు? కావుననే ఇది మధ్యస్థము. 2

వ్యాఖ్య: సర్వభూతములను భరించునట్టి ఈ శ్రేష్ఠప్రాణము జీవున కధ్యాత్మోపాధియైనది. భూతరసముల పాకమందు అణువుకన్న చిన్నదై అప్స్వరూపమై యున్నది 3

వ్యాఖ్య: ఈశ్వరుని యందు ధర్మిగను, శరీరియందు ధర్మముగను ఉండి 'నేను' అను అభిమానముచే దేహమున

అయం = ఈ శ్రేష్ఠప్రాణము; ఈశ్వరే = ఈశ్వరునియందు; ధర్మభూతః = ధర్మముగనున్నది; శరీరే = దేహమునందు; ధర్మితాం = ధర్మిత్వమును, ఇతః = అయినది; అహం, ఇతి అభిమానేన = నేను అను అభిమానముచే; అత్ర = దేహమున; విభిన్నవత్ = వేరైనది వలె, భాతి = ప్రకాశించుచున్నది.

శ్లో॥ సూక్ష్మస్థూలేఽస్య శాఖే ద్వే విద్యుచ్ఛక్తి సమీరవత్ ।
తత్రాద్యా జ్ఞానశక్తిః స్యా త్క్రియా శక్తిరనన్తరా ॥ 5

విద్యుచ్ఛక్తి సమీరవత్ = వ్యోమమందు (మాతరిశ్వ వద్ద) విద్యుచ్ఛక్తియు, వాయువును అగునట్లు, అస్య = దీనికి, సూక్ష్మస్థూలే = సూక్ష్మమైన, స్థూలమైన, ద్వే శాఖే = రెండు శాఖలగుచున్నవి, తత్ర = అక్కడ, ఆద్యా = మొదటిది సూక్ష్మము, జ్ఞానశక్తిః = జ్ఞానశక్తి, అనన్తరా = రెండవదగు స్థూలశాఖ, క్రియాశక్తిః = క్రియాశక్తి అగుచున్నది.

శ్లో॥ జ్ఞానేంద్రియాణి ప్రథమా విభూతి ర్మనసా సహ
కర్మేంద్రియాణి త్వపరా విభూతిః సహసా సహ 6

జ్ఞానేంద్రియాణి = జ్ఞానేంద్రియములైదును, మనసాసహ = మనస్సుతోకూడ, ప్రథమావిభూతిః = జ్ఞానశక్తియొక్క విభూతి; కర్మేంద్రియాణి = కర్మేంద్రియములైదును, సహసా సహ = ప్రాణముతోకూడ, అపరావిభూతిః = రెండవ క్రియా శక్తి విభూతి.

శ్లో॥ శ్వాసమాత్రంతు యః ప్రాణం వేద దేహస్య చాలకమ్
స్థూలశాఖైక దేశం న వేద కృత్స్నం స పామరః 7

యః = ఎవడు, దేహస్య = దేహముయొక్క; చాలకమ్ = చలనము కలిగించు, శ్వాస మాత్రంతు ప్రాణం = ఒక్క శ్వాస రూపమగు ప్రాణమునే, వేద = తెలిసికొనునో, సః పామరః = ఆ అజ్ఞాని; తం = ఆ; స్థూలశాఖైక దేశం = స్థూలశాఖయగు క్రియాశక్తి మాత్రమే; వేద = తెలిసికొనుచున్నాడు; న కృత్స్నం = సంపూర్ణ స్వరూపమును తెలియుట లేదు.

వేరైనది వలె ప్రకాశించుచున్నది.

వ్యాఖ్య : విద్యుచ్ఛక్తి సమీరములవలె దీనికి రెండు శాఖలు సూక్ష్మస్థూల రూపమున కలవు. అందు మొదటిది జ్ఞానశక్తి, రెండవది క్రియాశక్తి. 5

వ్యాఖ్య : మనస్సుతో కూడ ఐదు జ్ఞానేంద్రియములు జ్ఞానశక్తి విభూతులు. ప్రాణముతో కూడిన కర్మేంద్రియములు క్రియాశక్తి విభూతులు. 6

వ్యాఖ్య : ఎవడు దేహ చాలకమగు శ్వాస మాత్రమే ప్రాణము అని తెలిసికొను చున్నాడో వాడు ఒక్క స్థూలశాఖ యగు క్రియా శక్తినే తెలిసికొనుచున్నాడు' పూర్ణ జ్ఞాని కాలేడు. 7

శ్లో॥ సర్వప్రాణాత్మకః శ్రేష్ఠః ప్రాణ ఏవం ప్రదర్శితః
తమిమం తత్త్వతో జ్ఞాత్వా సర్వం జ్ఞాస్యతి తత్త్వతః ॥ 8

సర్వప్రాణాత్మకః=సర్వప్రాణరూపమగు; శ్రేష్ఠఃప్రాణః=శ్రేష్ఠప్రాణము, ఏవం=ఈ విధముగ; ప్రదర్శితః=చూపబడినది; తం, ఇమం = ఆ ఈ ప్రాణమును; తత్త్వతః = వాస్తవముగ; జ్ఞాత్వా= తెలిసి; సర్వం=సమస్తమును; జ్ఞాస్యతి= తెలియగలడు.

## 25. మనోధికరణమ్

శ్లో॥ హృదయా దాశిరోనాడీ సుషుమ్నా నామ నామతః
జ్ఞాన తేజోవహాన్త్యస్తి ప్రాణస్య కిల దీప్యతః 9

దీప్యతః= వెలుగుచున్న, ప్రాణస్య=ప్రాణముయొక్క, జ్ఞాన తేజః = జ్ఞాన తేజమును; వహాన్తి = వహించుచున్నట్టియు; సుషుమ్నా నామనామతః=సుషుమ్న అను పేరుగల; హృదయాత్= హృదయమునుండి; ఆ శిరోనాడీ=శిరస్సువరకు అగు నాడి; అస్తికిల= కలదు.

॥ అన్నసారమయం సూక్ష్మం శీర్షే కిమపి విద్యతే।
ప్రాణతేజ స్తదావిశ్య మనో భవతి నామతః 10

శీర్షే=శీర్షమునందు; అన్న సారమయం=అన్న సారభూతమైన, సూక్ష్మం=సూక్ష్మమైన; కిమపి=అనిర్వచనీయవస్తువు, విద్యతే=కలదు. తత్ =దానిని; ప్రాణ తేజః=ప్రాణ తేజము; ఆవిశ్య=ఆవేశించి; నామతః=పేరుచేత; మనః=మనస్సు అని, భవతి=అగుచున్నది.

శ్లో॥ ప్రభా జలజమిత్రస్య యథా ప్రాప్యేన్దుమండలమ్
శీర్షస్థానం ప్రపద్యైవం శీతాస్యా త్ప్రాణదీధితిః । 11

వ్యాఖ్య : సర్వప్రాణాత్మకమగు శ్రేష్ఠ ప్రాణము ఈ విధముగ చూపబడినది దీనిని వాస్తవముగా తెలిసిన తత్త్వము తెలిసి సర్వమును తెలియగలడు. 8

## 25. మనోధికరణము

వ్యాఖ్య : వెలుగుచున్న ప్రాణదీప్తిని వహించునట్టియు, హృదయమునుండి శిరస్సువరకు వ్యాపించినట్టియు, సుషుమ్న అను పేరుగల నాడిగలదు 9

వ్యాఖ్య · శిరస్సునందు అన్నసారమయమగు ఒక వస్తువుకలదు ప్రాణతేజము దానిని ప్రవేశించి మనస్సు అని వ్యవహరింప బడుచున్నది. 10

వ్యాఖ్య : సూర్యకాంతి చంద్రమండలము ప్రవేశించి చెల్లబడు నట్లు ప్రాణదీధితి అన్నమయాణువును శిరసునందగు

జలజమిత్రస్య=సూర్యుని; ప్రభా=కాంతి; ఇన్దుమండలమ్=చంద్రమండలమును; ప్రాప్య=పొంది; యథా=ఏవిధముగ; శీతాస్యాత్=చల్లదనము నొందునో, ఏవం=ఆ విధముగనే, ప్రాణదీధితిః=ప్రాణతేజము; శీర్షస్థానం=శిరస్సును (అన్నాణువును) ప్రపద్య=పొంది, శీతాస్యాత్=చల్లనగును.

శ్లో॥ శరీరం సకలం యాతి మనసః సైవ దీధితిః
సుఖదుఃఖాత్మికాః సర్వా జాయన్తే వేదనా స్తయా । 12

మనసః=మనస్సుయొక్క; సైవదీధితిః=ఆ కాంతియే; సకలం శరీరం=శరీరమంతటిని; యాతి=పొందుచున్నది; సుఖదుఃఖాత్మికాః=సుఖదుఃఖ స్వరూపములగు; సర్వాః వేదనాః=అన్ని వేదనలు; తయా=దానిచే; జాయంతే=అగుచున్నవి.

శ్లో॥ విషయాణా మనుభవాః సంకల్పాశ్చ పృథగ్విధాః
సంభవంతి మనస్యేవ విమర్శః సంభవేన్మతౌ 13

విషయాణాం=విషయముల; అనుభవాః=అనుభవములు; పృథగ్విధాః=అనేకవిధములగు; సంకల్పాః=సంకల్పములు; మనస్యేవ=మనసునందే, సంభవంతి=అగుచున్నవి; మతౌ=బుద్ధియందు; విమర్శః=విమర్శ; సంభవేత్=అగును.

శ్లో॥ నిర్గతా దీధితిః ప్రాణాదప్రాప్తా మస్తకస్థలమ్
మధ్యే నాడీగతా సూక్ష్మా మతిరిత్యభిధీయతే ॥ 14

ప్రాణాత్=ప్రాణమునుండి, నిర్గతా=బయలుదేరి; మస్తకస్థలమ్=మస్తకమును; అప్రాప్తా=పొందకుండునదియు; మధ్యే=మధ్యను; నాడీగతా=నాడియందగునది; మతిః=మతియని; అభిధీయతే=పలుకబడుచున్నది.

శ్లో॥ స్థానం ప్రాణస్య హృదయం తచ్చిత్తమితి చోచ్యతే
ద్వాభ్యాం పదాభ్యా మేతాభ్యాం మనశ్చ క్వచి దీర్యతే ॥ 15

దానిని ప్రవేశించి చల్లదనము నందును. 11

వ్యాఖ్య : ఆ మనస్సుయొక్క కాంతి సమస్త శరీరమును పొందు చున్నది. దానిచే సమస్తములగు సుఖదుఃఖరూపము లగు వేదనలు కలుగుచున్నవి. 12

వ్యాఖ్య : విషయానుభవములు, వివిధములగు సంకల్పములు మనస్సునందగును విమర్శ మతియందగును. 13

వ్యాఖ్య : ప్రాణమునుండి బయలుదేరి శిరస్సును చేరక, నాడి యందు మధ్యనున్న సూక్ష్మమగు నా ప్రాణతేజమే మతి అనబడు చున్నది. 14

వ్యాఖ్య : ప్రాణస్థానము హృదయము. దీనినే చిత్తమందురు. ఈ

ప్రాణస్య=ప్రాణమునకు; స్థానం=స్థానము; హృదయం= హృదయము; తత్ = అది; చిత్తం, ఇతి, చ = చిత్తమనియు; ఉచ్యతే=చెప్పబడుచున్నది, ద్వాభ్యాం=రెండగు; ఏతాభ్యాం= ఈ; పదాభ్యాం=పదములచే; క్వచిత్ =ఒకచో, మనశ్చ= మనస్సును; ఈర్యతే=చెప్పబడుచున్నది.

శ్లో॥ మూలవృత్తిరహంకారః ప్రాణస్య పరికీర్త్యతే
అప్రాప్తయాంచ మూర్ధానం ప్రాణభాయాం సవిద్యతే ॥ 16

ప్రాణస్య=ప్రాణముయొక్క; మూలవృత్తిః=మూలవృత్తి; అహంకారః=అహంకారము; మూర్ధానాం=శిరస్సును, అప్రాప్తయాంచ=పొందకుండు నంతవరకు; సః=అది; ప్రాణభాయాం= ప్రాణతేజము నందు; విద్యతే=ఉండును.

శ్లో॥ ప్రజ్ఞాగతే త్వహంకారే జీవో జ్ఞానమయో భవేత్
క్రియామయః శ్వాసగతే దేహమానీ మనోగతే 17

అహంకారే = అహంకారము; ప్రజ్ఞాగతే = ప్రజ్ఞను పొందగా, జీవః=ప్రాణి; జ్ఞానమయం=జ్ఞానరూపుడు, భవేత్ = అగును, శ్వాసగతే=శ్వాసను పొందగా; క్రియామయః=క్రియారూపుడగును; మనోగతే=మనసుని చెందగా; దేహమానీ= దేహాభిమాని యగును.

శ్లో॥ అన్నసారమయత్వేన మనః స్థానస్య తత్త్వతః
మనోగతే త్వహంకారే జీవోఽన్నమయ వద్భవేత్ 18

తత్త్వతః=వాస్తవముగ; మనస్థానస్య=మనస్థానము; అన్నసారమయత్వేన=అన్నసారమయమగుటచే, అహంకారే=అహంకారము; మనోగతే సతి=మనసుని పొందగా, జీవః=జీవుడు; అన్నమయవత్ =అన్నమయునివలె; భవేత్ =అగును.

రెండు పదములచే ఒకచో మనస్సు కూడా చెప్పబడు చున్నది. 15

వ్యాఖ్య : ప్రాణముయొక్క మూలవృత్తి అహంకారము. అది శిరసును పొందకుండు నంతవరకు ప్రాణతేజము నందుం డును. 16

వ్యాఖ్య : అహంకారము ప్రజ్ఞాగతమైన జీవుడు జ్ఞానమయుడగును. శ్వాసను పొందిన క్రియామయుడును, మనసును పొందిన దేవాభిమానియు అగును. 17

వ్యాఖ్య : మనస్సు అన్నమయాణువు. కాన అహంకారము దాని నందిన జీవుడన్నమయుని వలె అగును. 18

శ్లో॥ య ఏవం మనస స్తత్త్వం చిత్తాహంకార యో రపి
ప్రజ్ఞాయాశ్చ విజానాతి సోఽన్తః కరణ తత్త్వవిత్ 19

యః=ఎవడు; ఏవం = ఈ విధముగ, మనసః=మనస్సు యొక్క; చిత్తాహంకార యోః అపి = చిత్తాహంకారములయు; ప్రజ్ఞాయాశ్చ=ప్రజ్ఞయొక్కయు; తత్త్వం = తత్త్వమును, విజానాతి= తెలిసికొనునో; సః=వాడు; అన్తఃకరణ తత్త్వవిత్ = అంతఃకరణ తత్త్వమును తెలిసినవాడు.

శ్లో॥ ప్రాణోఽధి దైవతం శక్రో విజ్ఞానం పునరుత్తమః
మనోఽధి దైవతం సోమో హృదయం ముదీర్యతే॥ 20

ప్రాణః=ప్రాణము; అధి దైవతం=అధి దైవతరూపము; శక్రః = ఇంద్రుడు, విజ్ఞానం, పునః = విజ్ఞానాధి దైవతము; ఉత్తమః=ఉత్తముడు, మనోధిదైవతం=మనస్సున కధిదైవతము; సోమః=చంద్రుడు. హృదయం=హృదయమే; కం=ఆకాశమని; ఉదీర్యతే=చెప్పబడుచున్నది.

శ్లో॥ స్థూలాత్క్రియావతః ప్రాణశాఖాభేదా న్మనః పరమ్
సూక్ష్మః ప్రజ్ఞామయః ప్రాణశాఖా భేద స్త్వతఃపరః 21

స్థూలాత్ = స్థూలమగు; క్రియావతః=క్రియాశక్తిగల; ప్రాణశాఖా భేదాత్ = ప్రాణశాఖా భేదముకన్న; మనః= మనస్సు; పరం=శ్రేష్ఠమైనటి; సూక్ష్మప్రజ్ఞామయః=సూక్ష్మము, ప్రజ్ఞామయము అగు; ప్రాణశాఖా భేదః=ప్రాణశాఖాభేదము; అతఃపరః=అంతకన్న శ్రేష్ఠము.

## 26. వాగధికరణమ్

శ్లో॥ అణు తేజోమయం కించి న్మూలాధారే విరాజతే।
ఊర్మిః శబ్దమయీ తస్య గాయత్రీ వాగుదాహృతా॥ 22

వ్యాఖ్య : ఎవడు ఈ విధముగ మనస్సు, చిత్తము, అహంకారము, ప్రజ్ఞ వీని తత్త్వమును తెలిసికొనునో వాడు అంతఃకరణ తత్త్వము తెలిసిన వాడగును ఇవియే అంతఃకరణ చతుష్టయము. 19

వ్యాఖ్య : ప్రాణమున కధి దైవతము శక్రుడు. విజ్ఞానమునకు ఉత్తముడు. మనసునకు చంద్రుడు. హృదయమే ఆకాశము అని చెప్పబడుచున్నది. 20

వ్యాఖ్య : స్థూలశాఖయగు ప్రాణముయొక్క క్రియాశక్తి కన్న మనస్సు శ్రేష్ఠమైనది. దానికన్న సూక్ష్మమగు ప్రాణ శాఖా భేదము శ్రేష్ఠమైనది. 21

## 26. వాగధికరణము

వ్యాఖ్య : మూలాధారమున తైజస స్వరూపమగు ఒక వస్తువు

మూలాధారే = మూలాధారమున; అణు తేజోమయం= అణురూపము తైజసము అగు; కించిత్ =ఒక వస్తువు; విరాజతే= ప్రకాశించు చున్నది; తస్య = దానియొక్క; శబ్దమయీ=శబ్ద మయమగు; ఊర్మిః=తరంగము; గాయత్రీవాక్ =గాయత్రీవాక్కు అని; ఉదాహృతా=చెప్పబడినది.

శ్లో॥ యావద్ధృదయ మాధారా చ్ఛబ్దరూపైవ కేవలమ్
ప్రజ్ఞయానుగృహీతా సా తతో వాక్యమయీ భవేత్ 23

ఆధారాత్ = ఆధారమునుండి; యావత్ హృదయం= హృదయము వరకు; కేవలమ్ శబ్దరూపైవ=కేవలముగ శబ్దరూప ముగనే ఉండును; సా = అది; ప్రజ్ఞయా = ప్రజ్ఞచే; అను గృహీతా = అనుగ్రహింపబడి; వాక్యమయీ=వాగ్రూపమయి నది; భవేత్ =అగును.

శ్లో॥ ఆధారస్థా పరావాక్స్యా త్పశ్యన్తీ ప్రజ్ఞయాన్వితా
ఉచ్చారితా వైఖరీస్యా న్మధ్యమాకాశ చారిణీ 24

ఆధారస్థా = మూలధారమందుండి: పరావాక్ = పరా వాక్కు అని: స్యాత్ =అగును. ప్రజ్ఞయాన్వితా=ప్రజ్ఞతోకూడి నదై: పశ్యన్తీ=పశ్యంతి అనబడును; ఉచ్చారితా=ఉచ్చరింపబడి వైఖరీ = వైఖరి అగును: ఆకాశచారిణీ = ఆకాశమందుండి. మధ్యమా=మధ్యమఅని: స్యాత్ =అగును.

శ్లో॥ బ్రహ్మాండే యావదస్తీహ హృది తావచ్చ విద్యతే
వ్యష్టేరనుభవో యావాం స్తతో మనసి నాధికమ్ 25

బ్రహ్మాండే=బ్రహ్మాండమందు: యావదస్తి=ఎంతగలదో; తావత్ చ=అంతయు. ఇహ=ఈ లోకమున. హృది=హృదయ మందు విద్యతే=కలదు; వ్యష్టేః = వ్యక్తియొక్క: అనుభవః= అనుభూతి. యావాం=ఎంతయో, తతః = అంతకంటె. మనసి= మనసునందు; న అధికం=అధికము లేదు

కలదు. దాని శబ్ద తరంగమునే గాయత్రి వాక్కు అందురు. 22

వ్యాఖ్య : మూలాధారము నుండి హృదయము వరకు అది శబ్ద రూపముగనే యుండును. అది హృదయమున ప్రజ్ఞచే అనుగ్రహింపబడి వాక్యరూపము నందును. 23

వ్యాఖ్య : మూలాధారమందున్న పరావాక్కు అనియు, ప్రజ్ఞతో కూడినప్పుడు పశ్యంతి అనియు, ఉచ్చరింపబడిన వైఖరి యనియు, ఆకాశమందుండి మధ్యమ అనియు వ్యవహరింపబడును. 24

వ్యాఖ్య : బ్రహ్మాండమున ఎంతకలదో, అంతేయు హృదయమున కలదు. కాని వ్యక్తి యొక్క అనుభవమెంతో అంతే మనసున కలదు వ్యష్టి అనగా ప్రజ్ఞతో విషయము చూడజాలని వాడు. ప్రజ్ఞతో చూచినవాడు సర్వమును తెలియగలడు. 25

శ్లో॥ స్వాధీనే హృదయే వాణీ సర్వమర్థంచ పశ్యతి
మనసా రంజితా వాణీ వ్యక్తేః రనుభవం మితమ్ 26

హృదయే=హృదయము· స్వాధీనే=వశముకాగా, వాణీ=వాక్యము. సర్వమ్ అర్థంచ = సమస్త విషయములను: పశ్యతి=తెలియజేయుటకై చూచును: మనసారంజితా=మనసుచే రంజింపబడిన, వాణీ=మాట, మితం=పరిమితమైనది: వ్యక్తేః = వ్యక్తియొక్క: అనుభవం=అనుభవమునే, పశ్యతి=చూచును.

శ్లో॥ అలోకితాత్మనాం వాణీ మనసా రంజితా భవేత్
సాక్షాత్కృత స్వరూపాణాం శుద్ధ ప్రజ్ఞామయీ భవేత్ 27

అలోకితాత్మనాం = ఆత్మదర్శనము లేనివారియొక్క: వాణీ = వాక్కు; మనసా రంజితా = మనసుచే రంజింపబడినది, భవేత్ =అగును. సాక్షాత్ కృత స్వరూపాణాం=ఆత్మసాక్షాత్కారము కలవారలకు వాక్కు. శుద్ధప్రజ్ఞామయీ=శుద్ధప్రజ్ఞారూపమే, భవేత్ =అగును.

శ్లో॥ అవరాచ వరా వాణీ ద్విధా చైవ ప్రదర్శితా
సామాన్యా దుభయతాఽపి దైవతం బ్రహ్మణస్పతిః॥ 28

అవరాచ వరాచ ఏవం = అవర, వర అను పేరులుగల; వాణీ=వాక్కు. ద్విధా=రెండు విధములుగ. ప్రదర్శితా=చూపబడినది, సామాన్యాత్ = సామాన్యత్వముచే· ఉభయతాఽపి=రెండింటికి; బ్రహ్మణస్పతిః=బ్రహ్మణస్పతియే దైవతం= దేవత;

## 27· ప్రాణసంఖ్యాధికరణమ్

శ్లో॥ ప్రాణా స్త్రయః పంచ సప్త చాష్టౌ వేకాదశేతిచ
సమాఖ్యాతా విపశ్చిద్భిః ఏక ఏవచ తత్త్వతః 29

వ్యాఖ్య : హృదయము స్వాధీనమై ప్రజ్ఞతో పలికిన వాక్యము సత్యముగ సర్వ విషయములను తెలుపును. మనసుచే కూడిన వాక్కు, వాని అనుభవమును మాత్రమే తెలుపును కాననే సహృదయ హృదయ రంజకత్వము వ్యష్టి అనుభవమే కాని క్రాంత దర్శిత్వము కలదికాదు. క్రాంత దర్శియే కవి. మిగిలిన వారికి కవి నామము లాక్షణికమని భావము. 26

వ్యాఖ్య : ఆత్మానుభవము లేనివారి వాక్కు మనస్సుచే రంజింపబడును ఆత్మ సాక్షాత్కారము కలవారి వాక్కు శుద్ధ ప్రజ్ఞా స్వరూపమే అగును. కావుననే ఈ గ్రంథము ప్రజ్ఞామయమని 'యథా బుద్ధం యథా శ్రుతం' అనియు, గురుకటాక్ష జ్యోతియగు ప్రజ్ఞారూపమనియు ఊహింపనగును 27

వ్యాఖ్య : పర, అపర అను రెండు విధములగు వాక్కులు నిరూపింపబడినవి రెండింటి యందును సామాన్యత్వముచే బ్రహ్మణస్పతియే దేవత అగుచున్నాడు. 28

## 27. ప్రాణసంఖ్యాధికరణము

వ్యాఖ్య : ప్రాణములు మూడు, ఐదు, ఏడు, ఎనిమిది, పదకొండు

ప్రాణాః = ప్రాణములు; త్రయః = మూడు. పంచ = ఐదు; సప్త = ఏడు. అష్టౌ = ఎనిమిది. ఏకాదశ ఇతిచ = పదకొండనియు; విపశ్చితః = పండితులచే; సమాఖ్యాతాః = లెక్కింపబడినవి తత్త్వతః = వాస్తవమునకు; ఏక ఏవచ = ఒక్కటియే.

శ్లో॥ మనః ప్రాణశ్చ వాక్చేతి ప్రాణత్రయ ముదాహృతమ్
సహితం శ్రోత్రచక్షుర్భ్యాం ఇదం స్యాత్ప్రాణ పంచకమ్ ॥ 30

మనః = మనస్సు. ప్రాణశ్చ = ప్రాణము. వాక్చ = వాక్కును; ప్రాణత్రయమ్ ఇతి = మూడు ప్రాణములని. ఉదాహృతమ్ = ఉదహరింప బడినవి. శ్రోత్రచక్షుర్భ్యాం = చెవి కన్ను వీనితో. సహితం = కూడి. ఇదం = ఈ ప్రాణత్రయము; ప్రాణపంచకం = ఐదు ప్రాణములగును.

శ్లో॥ తద్యుక్తం రసనాత్వగ్భ్యాం ప్రాణసప్తక మీర్యతే
ఘ్రాణం ప్రచక్షతే ప్రాణం శ్రేష్ఠస్థానేఽత్ర కేచన 31

రసనా త్వగ్భ్యాం = జిహ్వ, చర్మము, వీనితో తద్యుక్తం = ఆ చెప్పబడిన ఐదు కలసి; ప్రాణసప్తకం = ఏడు ప్రాణములని; ఈర్యతే = పలుకబడుచున్నవి. శ్రేష్ఠస్థానే = శ్రేష్ఠప్రాణమునకు బదులుగ. ఘ్రాణం = ఘ్రాణమును అత్ర = ఇక్కడ. కేచన = కొందరు; ప్రచక్షతే = చెప్పుచున్నారు.

శ్లో॥ పాణీంద్రియేణ సంయుక్తం ప్రోక్తం సప్తక మష్టకమ్
అత్ర ప్రకరణే ప్రాణా ఉదితా గ్రహ సంజ్ఞయా 32

సప్తకం = ఈ ఏడును; పాణీంద్రియేణ సంయుక్తం = చేతులతో కలిసి. అష్టకం = ఎనిమిదగును; అత్ర ప్రకరణే = ఈ ప్రకరణమున; ప్రాణాః = ప్రాణములు; గ్రహసంజ్ఞయా = గ్రహములను సంజ్ఞచే ఉదితాః = చెప్పబడినవి.

అని చెప్పిరి. కాని వాస్తవమునకు ఒక్కటియే అని తెలియవలయును 29

వ్యాఖ్య : మనస్సు, ప్రాణము, వాక్కు అనునవి ప్రాణత్రయము. ఆ మూడు, చెవి, కన్ను కలసి ఐదు ప్రాణములగుచున్నవి. 30

వ్యాఖ్య : జిహ్వా, త్వక్కు వీనితో ఆ ఐదును ఏడగునని ప్రాణములను కొందరు లెక్కించిరి. అందు ఘ్రాణమును శ్రేష్ఠస్థానమున కొందరు తెలిపిరి. 31

వ్యాఖ్య : ఈ ఏడును, పాణేంద్రియము కలసి ఎనిమిదగును. ఈ ప్రకరణమున ప్రాణములు సంజ్ఞ చే ఒప్పును. 32

శ్లో॥ జ్ఞానేంద్రియాణి పంచాపి పంచకర్మేంద్రియాణిచ
ఆత్మా త్వేకాదశ స్తేషాం ప్రాణా ఏకాదశ స్మృతాః 33

పంచ జ్ఞానేంద్రియాణి=ఐదు జ్ఞానేంద్రియములు; పంచ అపి కర్మేంద్రియాణి=ఐదు కర్మేంద్రియములు: ఆత్మా= ఆత్మయు. ఏకాదశ=పదకొండు; ప్రాణాః=ప్రాణములు: తేషాం= వారిమతమున: ఏకాదశ ఇతి=పదకొండు అని. స్మృతాః=చెప్ప బడినవి.

శ్లో॥ కేచి దాత్మపదే నాత్ర మనోవాచ్యం ప్రచక్షతే।
విజ్ఞాన మపరే ప్రాహుః శ్రేష్ఠం త్వేకాదశాత్పరమ్ 34

కేచిత్ =కొందరు. ఆత్మపదేన=ఆత్మ అను పదముచే: మనః=మనస్సు. వాచ్యం=చెప్పదగిన అర్థమని ప్రచక్షతే= చెప్పుచున్నారు, అపరే=మరికొందరు. విజ్ఞానం=విజ్ఞానమే అర్థ మని. ప్రాహుః=చెప్పుదురు. ఏకాదశాత్పరం=పన్నెండవది: శ్రేష్ఠం=శ్రేష్ఠ ప్రాణము.

శ్లో॥ శ్రేష్ఠ ఏకోభవే త్ప్రాణ స్తస్యైవాన్యే విభూతయః
ఇతి తత్త్వదృశః ప్రాజ్ఞాః ప్రవదన్తి సమాసతః 35

శ్రేష్ఠ=శ్రేష్ఠము: ఏకః=ఒక్కటియే ప్రాణః=ప్రాణము: భవేత్ =అగును; అన్యే=ఇతరములన్నియు. తస్యైవ=దాని యొక్కయే. విభూతయః=విభూతులు అని. సమాసతః=సంక్షేప ముగా, తత్త్వదృశః=వాస్తవము తెలిసిన; ప్రాజ్ఞాః=ప్రాజ్ఞులు: ప్రవదన్తి=చెప్పుచున్నారు.

శ్లో॥ అనుక్తానాం ప్రకరణే శ్రేష్ఠ ఏవోపసంహృతిః
తత్ర తత్ర ప్రకల్ప్యా స్యా త్తస్యైవాన్యే విభూతయః ॥ 36

ప్రకరణే=ప్రకరణమందు: అనుక్తానాం=చెప్పనివానికి: శ్రేష్ఠేఏవ=శ్రేష్ఠప్రాణమందే; ఉపసంహృతిః=ఉపసంహారము:

వ్యాఖ్య: ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, ఆత్మ కలసి ప్రాణములు పదకొండు అని ప్రాణములను లెక్కించిరి. 33

వ్యాఖ్య: కొందరాత్మ పదమునకు మనస్సనియు, కొందరు విజ్ఞానమనియు అర్థము చెప్పిరి. శ్లేష్మము పన్నెండవ దగును. 34

వ్యాఖ్య: శ్రేష్ఠ మొక్కటియే ప్రాణము. మిగిలినవి దాని విభూతులు, అని తత్త్వము తెలిసిన ప్రాజ్ఞులందురు. 35

వ్యాఖ్య: ప్రకరణమున చెప్పనివానిని శ్రేష్ఠప్రాణమునందే ఉప

తత్రతత్ర=అక్కడక్కడ; ప్రకల్ప్యా=కల్పింపతగినది; స్యాత్=అగును; తస్యహి=దానియొక్కయే, అన్యే=మిగిలినవి; విభూతయః=విభూతులు.

శ్లో॥ ఉపదేశం విభూతీనాం వినా శ్రేష్ఠం కరోతి చేత్
తత్ర విచిన్తయే ద్ఘ్రాణం శ్రేష్ఠస్థానీయ మిన్ద్రియమ్ 37

శ్రేష్ఠం వినా=శ్రేష్ఠప్రాణమును విడిచి, విభూతీనాం=విభూతుల; ఉపదేశం=ఉపదేశము, కరోతి చేత్=చేసిన యెడల తత్ర=అక్కడ; ఘ్రాణం=ఘ్రాణమునే, శ్రేష్ఠస్థానీయమ్=శ్రేష్ఠమునకు చిహ్నముగనైన, ఇంద్రియం=ఇంద్రియమునుగ విచిన్తయేత్=ఆలోచింపవలసినది.

శ్లో॥ ప్రాణా ఏకాదశ వ్యష్ట్యా రుద్రా ఏకాదశోదితాః
ప్రాణానాం సమవాయస్తు శ్రేష్ఠో రుద్రో మరుత్పితా 38

ప్రాణాః ఏకాదశ=పదకొండు ప్రాణములు; వ్యష్ట్యా=వ్యక్తులుగా, ఏకాదశరుద్రాః=పదకొండుగురు రుద్రులు అని, ఉదితాః=చెప్పబడిరి; ప్రాణానాం=ప్రాణముల, సమవాయః=సముదాయము; శ్రేష్ఠోరుద్రః=శ్రేష్ఠుడైన రుద్రుడు; మరుత్పితా=మరుత్తులకు తండ్రి.

శ్లో॥ వాగీష్టే జపతాం నిత్యం ప్రాణోవై యుంజతాం సతామ్
మన ఈష్టే వృత్తవతామీష్టే భక్తిమతాం త్రయం 39

నిత్యం=ఎల్లప్పుడు; జపతాం=జపించువారలకు; వాక్=వాక్కు; ఈష్టే=శుద్ధమగును; యుంజతాం=యోగయుక్తులగు, సతాం=సజ్జనులకు, ప్రాణఃవై=ప్రాణము శుద్ధమగును; వృత్తవతాం=శీలముగలవారలకు, మనః=మనస్సు; ఈష్టే=శుద్ధమగును; భక్తిమతాం=భక్తిగలవారలకు; త్రయం = వాక్కు, ప్రాణము, మనస్సును; ఈష్టే=శుద్ధమగును.

సంహారము చెప్పవలెను. మిగిలిన వన్నియు దాని విభూతులేకదా. 36

వ్యాఖ్య: శ్రేష్ఠప్రాణమును విడచి కేవలము విభూతులను చెప్పినప్పుడు, ఘ్రాణేంద్రియమే శ్రేష్ఠమునకు చిహ్నమని తెలియవలెను. 37

వ్యాఖ్య: పదకొండు ప్రాణములు, పదకొండుగురు రుద్రులు ప్రాణముల సముదాయము మరుత్తులకు తండ్రియైన రుద్రుడు అని చెప్పుచున్నారు. 38

వ్యాఖ్య: మంత్ర జపముచే వాక్కును, యోగముచే ప్రాణమును, శీలముచే మనస్సును, భక్తిచే మూడునూ శుద్ధమైన వగును. 39

# 28. ప్రమాణాధికరణమ్

శ్లో॥ ప్రమాణం దృశ్యతే లోకే ధీన్ద్రియం వాగితి ద్విధా
వరైవ వాక్ప్రమాణం స్యాన్నావరా సూక్తిరేవసా ॥ 40

ధీన్ద్రియం=బుద్ధియు; వాక్ =వాక్కును, ద్విధా=రెండు విధములుగా; ప్రమాణం=ప్రమాణము; లోకే = లోకమందు; దృశ్యతే=కనబడుచున్నది; వరైవవాక్ = వరవాక్కే; ప్రమాణం=ప్రమాణము; స్యాత్ =అగును; న అవరా = అవరవాక్ ప్రమాణము కాదు; సా = అది: సూక్తిరేవ = మంచి వాక్కు మాత్రమే అగును.

శ్లో॥ వేదాః సర్వే వరావాణీ శుద్ధజ్ఞాన మయా హి తే ।
అన్తర స్యాత్మనః సాక్షాత్తే స్యుః శబ్దమయం మహః ॥ 41

వేదాఃసర్వే=అన్ని వేదములు, వరావాణీ=వరవాక్కులు తే=అవి, శుద్ధజ్ఞానమయా హి=శుద్ధజ్ఞానములు కదా, అన్తరస్య= అంతరమగు; ఆత్మనః = ఆత్మయొక్క, శబ్దమయం = శబ్దస్వరూప మగు, సాక్షాత్ =సాక్షాత్తుగ, మహః= తేజస్వరూపములు, తే= అవి: స్యుః=అగుచున్నవి

శ్లో॥ శక్తిః సమష్టేర్వ్యష్టేస్తు వ్యుత్పత్తి ర్వేదదర్శనే
నిత్యత్వంచా ప్యనిత్యత్వం వేదానాం భాగశోభవేత్ । 42

వేదదర్శనే=వేదావిష్కరణమున: సమష్టేః=సమష్టియొక్క శక్తిః=శక్తియు: వ్యష్టేః=వ్యక్తియొక్క: వ్యుత్పత్తి=వ్యుత్పత్తి కారణములు, కావున నే వేదానాం = వేదములకు, నిత్యత్వం= నిత్యత్వము; అనిత్యత్వమపిచ=అనిత్యత్వమును: భాగశః = భాగ ముల వంతున, భవేత్ =అగును.

# 28. ప్రమాణాధికరణము

వ్యాఖ్య : బుద్ధి, వాక్కు అని రెండు విధములుగ ప్రమాణము లోకమందు కనిపించుచున్నది. శ్రేష్ఠమైన వాక్కే ప్రమాణమగును గాని, శ్రేష్ఠముకానిది ప్రమాణము కానేరదు. అది మంచి వాక్కుగా మాత్రమే మిగిలి పోవును. 40

వ్యాఖ్య : వేదములన్నియు వరవాక్కులు. అవి శుద్ధజ్ఞానమయ ములు. అంతరాత్మయొక్క సాక్షాత్తు తేజస్వరూపము లగు శబ్దములు. 41

వ్యాఖ్య : వేద దర్శనమున సమష్టి శక్తియు, వ్యక్తియొక్క వ్యుత్పత్తియు కారణములు. కావుననే వానికి నిత్య త్వము, అనిత్యత్వము కూడ సంభవించుచున్నది. సమష్టి శక్తిచే నిత్యత్వమును, వ్యుత్పత్తిచే అనిత్యత్వ మును అగును. ముక్త పురుషులు హృదయప్రజ్ఞచే చూచుదురు కావున అది సమష్టిప్రజ్ఞ. సత్య దర్శ కము. దానినే వ్యక్తియొక్క భాష ననుసరించి వ్యక్తము చేయును. ఆభాగ్యము అనిత్యము. ఇట్లు నిత్యానిత్యత్వము కలుగును. వేదము అమృతులు ఆత్మ రూపులు రచించిన దగుటచే ఆత్మరూపుడు బ్రహ్మ

శ్లో॥ ప్రత్యక్ష మనుమానం చేత్యుభయం ద్వివిధం పునః
సాక్షాత్ప్రమాణం ప్రత్యక్ష మనుమానన్తు లింగతః 43

ఉభయం=ధీ ఇంద్రియము, వాక్కు అను రెండును; పునః=తిరిగి; ప్రత్యక్షం=ప్రత్యక్షము, అనుమానం=అనుమానము అని; ద్వివిధం=రెండు విధములుగ ఉన్నవి, సాక్షాత్ ప్రమాణం=సాక్షాత్తగు ప్రమాణము; ప్రత్యక్షం= ప్రత్యక్షము, అనుమానన్తు=అనుమానము; లింగతః=లింగముచే నగును.

శ్లో॥ వేదః ప్రమాణం ప్రత్యక్షం శాబ్దం విద్వద్భి రుచ్యతే ॥
అనుమానన్తు తన్మూలాస్మృతీ రాగాదివర్జితా 44

వేదః=వేదము; శాబ్దం=శబ్ద రూపమును; ప్రత్యక్షం=ప్రత్యక్షమును, అని, విద్వద్భిః=విద్వాంసులచే, ఉచ్యతే=చెప్ప బడుచున్నది; తన్మూలా = అది మూలముగా గల; రాగాది వర్జితా=రాగ ద్వేషాదులు లేని; స్మృతిః=స్మృతియు; అనుమానం; తు=అనుమాన ప్రమాణమగుచున్నది.

## 29 పంచాహుత్యధికరణమ్

శ్లో॥ ఊర్ధ్వ విష్టప పర్జన్య పృథివీ పురుషా బలాః
జన్మ ప్రసంగే పంచాగ్నీ న్హోమస్థానా న్యపాం విదుః 45

ఊర్ధ్వ విష్టప పర్జన్య పృథివీ పురుషా బలాః=ఊర్ధ్వ లోకము, పర్జన్యుడు, భూమి పురుషుడు, స్త్రీ అను అయిదుగురు; జన్మ ప్రసంగే=జన్మ ప్రసంగ సందర్భమందు, అపాం=జలము లకు; హోమస్థానాన్ = హోమస్థానములగు; పంచాగ్నీన్= ఐదు అగ్నులని; విదుః= చెప్పుదురు.

రచించె సందురు అందలి విషయము ఇతరుడనిన అది దాని ననుసరించు సూక్తి యగును. 42

వ్యాఖ్య : ధీ వాగింద్రియ ప్రమాణములు రెండును మరల ప్రత్యక్షానుమానములచే రెండు విధములగును. సాక్షాత్ప్రమాణమే ప్రత్యక్షము. లింగముచే అగునది అనుమానము. 43

వ్యాఖ్య : వేదము, శాబ్దము ప్రత్యక్షము అగు ప్రమాణమని పండితులనిరి వేద మూలకము రాగ ద్వేషాది వర్జితము అగు స్మృతి అనుమాన ప్రమాణ మగుచున్నది. 44

## 29. పంచాహుత్యధికరణము

వ్యాఖ్య ఊర్ధ్వలోకము, పర్జన్యుడు, భూమి, పురుషుడు, అబల అను అయిదును సీటికి హోమస్థానములగు అగ్నులని జన్మ ప్రసంగ విషయమున పండితులు చెప్పు చున్నారు. 45

శ్లో॥ రసో జైవాతృకో వృష్టి రన్నం రేతశ్చ కీర్త్యతే
హోమద్రవ్యస్త్వేక మేవ పంచధా పరిణామతః 46

హోమద్రవ్యః=హోమద్రవ్యము; ఏకఏవ=ఒక్కటియే పరిణామతః=మార్పుచే; రసః=రసము, జైవాతృకః=సోముడు, వృష్టిః=వర్షము; అన్నం=అన్నము; రేతః=రేతస్సు అని; పంచధా=ఐదు విధములుగ; కీర్త్యతే=చెప్పబడుచున్నది.

శ్లో॥ విరాడ్విభూతి భూతానాం భావానా మత్ర హోతృతా।
యథాస్వభావం కల్ప్యాస్యా త్తేషా మేవచ దేవతా 47

విరాడ్విభూతి భూతానాం=విరాట్ పురుషుని విభూతులగు; భావానాం=భావములకు; అత్ర=ఇచ్చట, యథా స్వభావం=స్వభావము ననుసరించి; హోతృతా=హోతృత్వము; కల్ప్యా=కల్పింపదగినది, స్యాత్=అగుచున్నది తేషామేవ=వాటికే. దేవతా=దేవత్వము కల్పింప బడుచున్నది.

శ్లో॥ పంచమ్యా మాహుతా వాపో భజన్తి పురుషాహ్వయమ్।
అనుప్రవేశ సిద్ధాన్తా జన్మా పత్తిస్తు నాత్మనః 48

పంచమ్యామ్ ఆహుతౌ=అయిదవ ఆహుతియందు; అపః=జలము; భజతే=పొందుచున్నది. అను ప్రవేశ సిద్ధాన్తాత్=అనుసరించి ప్రవేశించుచున్నది అని సిద్ధాంతమందగుటచే; ఆత్మనః=ఆత్మకు; నజన్మాపత్తి=జనించుట అను దోషములేదు.

శ్లో॥ ప్రాణస్యోపాధి భూతస్య పార్థక్యేన త్వహం కృతిః
ఉత్క్రాన్తిగత్యా గతయో ర్మృత్యుశ్చైవాస్య నాత్మనః 49

అహంకృతిః=అహంకారము, ఉపాధి భూతస్య ప్రాణస్య=ఆత్మకు ఉపాధియైన ప్రాణమునకు; పార్థక్యేన=వేరైనదగుటచే; ఉత్క్రాన్తిగత్యా గతయోః=ఉత్క్రాన్తియందగు గత్యాగతులందు; మృత్యుఃచ=మృత్యువును అగుచున్నది; న ఆత్మనః=ఆత్మకు జన్మ మృత్యువులు లేవు.

వ్యాఖ్య : రసము, జైవాతృకము, వృష్టి, అన్నము, రేతస్సు అని ఒకే హోమద్రవ్యము పరిణామ క్రమము ననుసరించి అయిదు స్థానములందు అయిదు నామములందు చున్నది. 46

వ్యాఖ్య : విరాడ్విభూతులగు భావములకే స్వభావము, ననుసరించి హోతృత్వము దేవత్వము కల్పింపబడుచున్నవి. 47

వ్యాఖ్య : అయిదవ ఆహుతియందు జలములే పురుష సంజ్ఞనందును. అనుసరించి ఆత్మ ప్రాణమున ప్రవేశించుచున్నదనుటచే ఆత్మకు జన్మించుట అను దోషము లేదు. 48

వ్యాఖ్య : అహంకారము వేరయి ఆత్మకు ఉపాధియైన శ్రేష్ఠప్రాణ మునకే చెందుచున్నది. కాని ఆత్మయొక్క ఉత్క్రాంతి యందు, స్థితియందు అగతియందు ఆత్మకు జన్మమృత్యు వులు లేవు. 49

శ్లో॥ ఆత్మనాను ప్రవిష్టస్య ప్రాణస్య పురుషాఖ్యతా
ఏకైవతు మహాశక్తిః సర్వప్రాణావ భాసికా 50

ఆత్మనా=ఆత్మచే; అనుప్రవిష్టస్య=అను ప్రవేశింపబడిన; ప్రాణస్య=ప్రాణమునకు; పురుషాఖ్యతా=పురుషుడని వ్యవహారము; ఏకా ఏవతు=ఒక్కటియైన. మహాశక్తిః=గొప్పశక్తి; సర్వప్రాణావ భాసికా=అన్ని ప్రాణములను భాసింప జేయుచున్నది.

శ్లో॥ ప్రాణ ఏవ పృథగ్భూతో నాత్మా ప్రతికలేబరమ్
అను ప్రవిశతి ప్రాణా నేకస్యై వాత్మనో మహః 51

ప్రతికలేబరమ్=ప్రతి దేహమునను; ప్రాణఏవ=ప్రాణమే; పృథక్ భూతః=వేరైనది; న ఆత్మా=ఆత్మ వేరుకాదు, ఏకస్య ఏవ=ఒక్కటైన; ఆత్మనః=ఆత్మయొక్క మహః=తేజస్సు. అను ప్రవిశతి=అనుసరించి ప్రవేశించుచున్నది.

శ్లో॥ యథాసర్వాణి చక్షూంషి విశేదేకస్య భారవేః
శ్రేష్ఠాన్ప్రాణాం స్తథా సర్వాన్విశేదేకస్య భాత్మనః॥ 52

యథా = ఏ విధముగా, సర్వాణి చక్షూంషి = అన్ని నేత్రములను; ఏకస్య రవేః = ఒకే సూర్యుని; భా = కాంతి; విశేత్ =ప్రవేశించునో, తథా=ఆ విధముగ; సర్వాన్ శ్రేష్ఠాన్ ప్రాణాన్ =సమస్త శ్రేష్ఠ ప్రాణములను; ఆత్మనః=ఆత్మయొక్క, భా=కాంతి; విశేత్ =ప్రవేశించును.

శ్లో॥ ఆహుతి క్రమతః సిద్ధమావృత్తశ్చంద్ర మండలాత్
ప్రాణం చాప్యా విశేత్ప్రాణో దీపోదీప మివాపరమ్ 53

ఆహుతి క్రమతః సిద్ధం=ఆహుతి క్రమమువలన జన్మించిన దానిని; ప్రాణం=ప్రాణమును; చంద్రమండలాత్ =చంద్రమండలము నుండి; ఆవృత్తః ప్రాణః = తిరిగివచ్చిన ప్రాణము. దీపః

వ్యాఖ్య: ప్రాణమునందు ఆత్మ అను ప్రవేశించిన తరువాత దానికే పురుషవ్యవహారము. అన్ని ప్రాణులను భాసింప జేయు మహాశక్తి ఒక్కటియే అయి ఉన్నది. 50

వ్యాఖ్య: ప్రతి దేహమునందు ప్రాణములు వేరుగనున్నవి కాని ఆత్మ వేరుగలేదు. ఒకే ఆత్మయొక్క తేజము సర్వ ప్రాణములందు ప్రవేశించుచున్నది. 51

వ్యాఖ్య: ఒకే సూర్యకాంతి అన్ని నేత్రములను ప్రవేశించు తీరున ఒకే ఆత్మ తేజము సర్వప్రాణములను భాసింప జేయును. 52

వ్యాఖ్య: ఆహుతి క్రమమువలన అయిన ప్రాణమును, చంద్ర మండలావృత్తమగు ప్రాణము ఆవేశింపవచ్చును. ఎట్లన,

దీపమ్ అపరమివ = దీపము మఱియొక దీపమువలె, ఆవిశేత్ = ఆవేశింపవచ్చును.

శ్లో॥ ఆహుతి క్రమతః సిద్ధే కేవలే కులవాసనాః
అన్యేన భూయ ఆవిష్టే భవన్త్యన్యస్య వాసనాః 54

ఆహుతి క్రమతఃసిద్ధే=పంచాహుతి క్రమమువలన సిద్ధమైన ప్రాణమునకు; కేవలే = ఒక్క, కులవాసనాః = కులగుణములు, వాసనలు ఉండును. అన్యేన భూయః ఆవిష్టే=ఇతరునిచే ఆవేశింపబడిన వానియందు; అన్యస్య = ఇతరుని: వాసనాః = వాసనలు అగును.

దీపము వేరు దీపముతో కలిసిన తీరున ఆ కలయిక ఉండును. 53

వ్యాఖ్య : ఆహుతి క్రమముగ వచ్చిన ప్రాణికి కులవాసనలు మాత్రము ఉండును. ఇతరునికే (చంద్ర మండలా వృత్తిసచే) అవిష్టు డైన చో వాని వాసనలుండును. 54

# షష్ఠః పరిచ్ఛేదః

## 30. ధర్మవృత్తాధికరణమ్

శ్లో॥ సంస్కార జనకం కర్మ ధర్మ ఇత్యభిధీయతే
తస్యావ బోధే తస్మాకం ప్రమాణో వైదికోవిధిః 1

సంస్కార జనకం=సంస్కారమును కలిగించు. కర్మ=కర్మ; ధర్మః=ధర్మమని. అభిధీయతే=చెప్పబడుచున్నది. తస్య = దాని యొక్క. అవబోధే = తెలియుట యందు. అస్మాకం = మనకు; వైదికః = వేదము నందు తెలుపబడిన. విధిః = విధివాక్యము ప్రమాణః=ప్రమాణము.

శ్లో॥ వేదావిరుద్ధ స్మార్త శ్చ విధి ర్వేదానుమాపకః
రాగద్వేషాదిభిః స్మర్తుః దోషైర్యది నరంజితః 2

వేదావిరుద్ధః = వేదమునకు విరుద్ధము కానిది; వేదానుమాపకః=వేదము వలన స్మరింపబడినది అయిన, స్మార్తశ్చవిధిః= స్మృతిచే విధింపబడినదియు ప్రమాణ మగున, స్మర్తుః=స్మృతి కర్త యొక్క; రాగద్వేషాదిభిః=రాగము ద్వేషము మొదలగు; దోషైః=దోషముల చేత; నరంజితఃయది=దూష్యము కాకున్న ప్రమాణ మగును.

శ్లో॥ సంస్కారస్యాన్తరత్వాచ్చ సూక్ష్మత్వాచ్చ నగృహ్యతే
యథోక్తాచార సంపన్నే తేజసైవానుమీయతే 3

సంస్కారస్య=సంస్కారము; అన్తరత్వాత్ =అంతరమైన దగుటచేతను; సూక్ష్మత్వాత్ చ = సూక్ష్మమైనదగుటచేతను; నగృహ్యతే = గ్రహింపబడదు; యథోక్తాచార సంపన్నే= శాస్త్రోక్తాచార సంపన్నుడగు వానియందు, తేజసైవ=కాంతి చేతనే; అనుమీయతే=ఊహింపబడుచున్నది.

# ఆరవ పరిచ్ఛేదము

## 30. ధర్మవృత్తాధికరణము

వ్యాఖ్య. సంస్కారమును కలిగించు కర్మయే ధర్మమనబడును. దానిని తెలియుటకు ప్రమాణము వైదిక విధి వేద విహితమైన కర్మలు చేయుట నిషిద్ధ కర్మలు మానుట అనునదియే ప్రమాణము. అట్లు చేయుటకే ధర్మమని పేరు. 1

వ్యాఖ్య: వేదా విరుద్ధము, వేదముచే ఊహింప అనువైనట్టిదియు, స్మర్తయొక్క రాగద్వేషాదులచే దూషితము కానట్టియు స్మృతి వాక్యము ప్రమాణమగుచున్నది. 2

వ్యాఖ్య: సంస్కారము సూక్ష్మమైనది, అంతరమైనది అగుటచే అది గ్రహింపబడదు. శాస్త్రోక్తాచార సంపన్నునందు తేజస్సు చేతనే గ్రహింపబడుచున్నది. 3

శ్లో॥ పరై రనిందితం కర్మ యత్పర స్యోపకారకమ్
సాధారణం లోకసిద్ధం తద్వృత్త మభిధీయతే ॥ 4

పరైః = ఇతరులచే; అనిందితం = నిందింపబడనిదిగాను; పరస్య = ఇతరులకు; ఉపకారకం = ఉపకారము చేయునట్టియు; సాధారణం = సర్వసాధారణమై వేదవిహితము కాని; లోకసిద్ధం = లోకముచే గ్రహింపబడునది అగు తత్కర్మ = ఆ పని; వృత్తం = వృత్తమని అభిధీయతే = చెప్పబడుచున్నది.

శ్లో॥ ధర్మస్య కశ్చి దేవార్థో వృత్తస్యాన్య ప్రయోజనమ్
ధర్మవాన్లభతే స్వర్గం వృత్తావాం ఛ్ఛాన్ని మశ్నుతే ॥ 5

ధర్మస్య = ధర్మమునకు; అస్యదేవ అర్థః = ప్రయోజనము వేరైనదియె అగును; వృత్తస్య = శీలమునకు; అన్యత్ప్రయోజనం = వేరు ప్రయోజనము; ధర్మవాన్ = ధర్మము చేయువాడు; స్వర్గం = స్వర్గమును; (కొందరు శక్తిం అను పాఠమును చెప్పుదురు; శక్తిం = శక్తిని ప్రజానాశనము కలిగించు నరకాదులను పొందని ఉత్తమ లోకములను పొందు శక్తిని) లభతే = పొందును. వృత్తవాన్ = శీలవంతుడు. శాంతి మశ్నుతే = శాంతిని పొందును.

శ్లో॥ ధర్మనామాపి వృత్తస్య వ్యవహారేషు దృశ్యతే
ధర్మశాస్త్రే కథాస్తస్మా దుభయో ర్ధర్మవృత్తయోః 6

వ్యవహారేషు = వ్యవహారముల సందర్భములో; ధర్మనామాపి = ధర్మమను పేరు, వృత్తస్య = వృత్తమునకును, దృశ్యతే = కనబడుచున్నది, తస్మాత్ = అందుచేత, ధర్మశాస్త్రే = ధర్మశాస్త్రమునందు; ధర్మవృత్తయోః = ధర్మవృత్తముల, ఉభయోః = రెండింటియొక్క, కథాః = ప్రసంగములు.

## 31. భక్తియోగాధికరణమ్

శ్లో॥ సమర్ప్య భార మీశస్య మస్తకే భజనం సదా ।
అనన్యాధీన మనసా భక్తియోగ ఉదాహృతః 7

వ్యాఖ్య : ఇతరులచే నిందింపబడనిదియు, ఇతరులకు మేలు చేయునదియు, వేదవిహితము కాకున్నను లోకముచే గ్రహింపబడు సాధారణమగు ఆ కర్మ వృత్త మనబడును. 4

వ్యాఖ్య : ధర్మమునకు, శీలమునకు ఫలములు భిన్నములు. ధర్మవంతుడు ఉత్తమ లోకములను పొందును. శీలవంతుడు శాంతిని పొందును. 5

వ్యాఖ్య : ధర్మమను పేరు వృత్తమునకు వ్యవహారమున కలదు. అందుచేతనే ధర్మశాస్త్రములందు ధర్మవృత్తముల రెండింటి కథలును గలవు. 'అథాతో ధర్మవిచికిత్సా, వృత్తవిచికిత్సా వా స్యాత్' 6

## 31. భక్తియోగాధికరణము

వ్యాఖ్య : భార మిూశునం దర్పించి ఏకాగ్రమగు మనసుతో

భారం=సమస్తఫలాఫలాది భారమును; ఈశస్య=దేవునకు; సమర్ప్య=అర్పించి అనన్యాధీన మనసా=ఏకాగ్రమగు మనస్సుతో; మస్తకే=శిరస్సునందు (భావమున) సదా=ఎప్పుడను; భజనం=పూజ, భక్తియోగః=భక్తియోగమని; ఉదాహృతః=చెప్పబడినది.

॥ బ్రహ్మాండ స్యాధికారేషు లక్ష్యో భాస్కర బింబగః
అథవా మధ్యమో దేవ స్తృతీయో నోపలభ్యతే 8

బ్రహ్మాండస్య=బ్రహ్మాండముయొక్క; అధికారేషు=ఆధికారిక పురుషులందు; భాస్కరబింబగః=సూర్యబింబ మందగు వాడును; అథవా=లేక; మధ్యమః దేవః=ఆకాశ మందగు దేవుడును (సూత్రాత్మ), లక్ష్యో=లక్ష్య మగువాడు; తృతీయః=మూడవవాడు; న ఉపలభ్యతే=లభ్యముకాజాలడు.

శ్లో॥ రూపధ్యానేన హోమేన స్తుత్యా మంత్రజపేన చ।
ఆరాధనం ప్రీతియుక్తం భజనం పరికీర్త్యతే 9

రూపధ్యానేన = రూపధ్యానము చేతను; హోమేన = హోమముచేతను, స్తుత్యా=స్తోత్రముచేతను, మంత్రజపేన చ=మంత్రజపముచేతను; ప్రీతియుక్తం=ప్రేమతోనగు, ఆరాధనం=పూజ; భజనం=భజనమని; పరికీర్త్యతే=చెప్పబడుచున్నది.

శ్లో॥ హిరణ్మయం వక్తి వేదో యథా మధ్యమ పూరుషమ్
స్పష్టం వదతి వేదాంత స్తథా పురుషముత్తమమ్ 10

వేదః=వేదము, హిరణ్మయం=హిరణ్మయుడగు; మధ్యమపూరుషమ్=మధ్యముడను వానిని; యథా=ఏవిధముగా; వక్తి=చెప్పుచున్నదో, వేదాంతః=ఉపనిషత్తులు; తథా=ఆ విధముగా, ఉత్తమపూరుషమ్=ఉత్తముని; స్పష్టం=స్పష్టముగా; వదతి=చెప్పుచున్నది.

ఈశ్వరుని పూజించుట భక్తియోగమగును. 7

వ్యాఖ్య : సూర్యమండలమందగు హిరణ్మయ పురుషుడు (మహానాత్మ) లేక ఆకాశమందగు మధ్యముడు (సూత్రాత్మ) లక్ష్యము కాదగినవారు. భక్తియోగమున మూడవ వాడు లేడని భావము. 8

వ్యాఖ్య : రూపమును ధ్యానించుట హోమముచేయుట, మంత్రి జపము మొదలగు వానిచే ప్రేమతో అర్చించుట భజనమగును. 9

వ్యాఖ్య : వేదములు హిరణ్మయుని చెప్పినరీతిగా వేదాంతము ఉత్తముని ధ్యేయరూపునిగా చెప్పుచున్నది. 10

శ్లో॥ హిరణ్మయం వపురిదం సిద్ధ మీశితు రిచ్ఛయా
రూపాణ్యన్యాని సర్వాణి మనోభావనయైవ నః 11

ఇదం హిరణ్మయం వపుః = ఈ తైజసమగు రూపము; ఈశితుః=ఈశ్వరుని, ఇచ్ఛయా = ఇచ్ఛచే, సిద్ధం=సిద్ధమైనది; అన్యాని రూపాణి=ఇతర రూపములు; నః = మనయొక్క; మనోభావన యైవ=మనసుచే కల్పింపబడినవియే అగును.

శ్లో॥ ప్రీత్యై స్యా దుత్తమస్యైవ మండలాంతర వర్తినః
కీర్తేస్త దవతారాణాం కీర్తనమ్ భక్తిపూర్వకమ్ 12

మండలాంతర వర్తినః = సూర్యమండలమందగు; ఉత్తమస్యైవ=ఉత్తముని యొక్క; తదవతారాణాం = వాని అవతారములయొక్క, కీర్తేః = కీర్తియొక్క; భక్తి పూర్వకం=భక్తితో నగు; కీర్తనం=గానము, ప్రీత్యై=ప్రీతికి; స్యాత్ =అగును.

## 32. అవతారాధికరణమ్

శ్లో॥ నిష్కామం కర్మయజ్ఞః స్యాత్తేన కర్తా న బధ్యతే
యజ్ఞేశ్వరాయ సంపన్నం తస్య కర్మైవ తద్భవేత్ ॥ 13

నిష్కామం=కోరిక లేక చేయు; కర్మ=విహితకర్మ; యజ్ఞః స్యాత్ =యజ్ఞమగును; తేన=దానిచే; కర్తా=కర్త; న బధ్యతే= బంధింపబడడు; యజ్ఞేశ్వరాయ సంపన్నం = యజ్ఞేశ్వరునకైన; తత్ =ఆకర్మ, తస్య కర్మైవ = యజ్ఞేశ్వరుని కర్మయే, భవేత్ = అగును.

శ్లో॥ స్వావిభూతి ర్జగద్భర్తుః కర్మాత్మా పరికీర్త్యతే।
యజ్ఞో వై విష్ణు రిత్యేత ద్బ్రాహ్మణం త్వత్రిమాపకమ్ 14

సా=అది, జగద్భర్తుః=ఈశ్వరుని; కర్మాత్మా=కర్మాత్మయగు; విభూతిః=విభూతియని; పరికీర్త్యతే=గానము చేయబడు

వ్యాఖ్య. ఈ తైజస రూపము ఈశ్వరుని యిచ్ఛచే నైనది. మిగిలిన రూపములు మన భావనచే అగుచున్నవి. 11

వ్యాఖ్య : మండలాంతర వర్తియగు ఉత్తమునకు వాని అవతారముల కీర్తిని భక్తితో గానము చేయుట ప్రీతి కగుచున్నది. 12

## 32. అవతారాధికరణము

వ్యాఖ్య నిష్కామకర్మయే యజ్ఞము. అది కర్తను బంధింపదు. యజ్ఞేశ్వరున కర్పితమై అది వాని కర్మ అగును. 13

వ్యాఖ్య. ఈశ్వరార్పిత కర్మయే ఈశ్వరుని కర్మాత్మకమగు

చున్నది, యజ్ఞోవై విష్ణుః ఇతి = యజ్ఞమే విష్ణువు అనునది మొదలుగాగల; బ్రాహ్మణం = బ్రాహ్మణమందలి వాక్యము; అత్ర=ఈ విషయమున; జ్ఞాపకం=జ్ఞాపనము చేయునది.

శ్లో॥ యజ్ఞశక్త్యా తయా దేవో ధర్మేక్షయ ముపాగతే
తస్య సంస్థాపనార్థాయ ప్రాదుర్భవతి భూతలే 15

ధర్మే=ధర్మము; క్షయం = క్షయమును; ఉపాగతేసతి= పొందగా, తయాయజ్ఞశక్త్యా=ఆ యజ్ఞ శక్తిచేత, తస్య=ధర్మము యొక్క; సంస్థాపనార్థాయ=నిలుపుటకు; దేవః=కర్మాత్మ విభూతి రూపుడైన దేవుడు; భూతలే = భూమియందు ప్రాదుర్భవతి= పుట్టుచున్నాడు.

శ్లో॥ ఆహుతిః క్రమతః సిద్ధే ప్రాణే సా శక్తి రద్భుతా
లోకాన్తరా దాగతేవా స్ఫురతీశితురిచ్ఛయా॥ 16

ఆహుతిః క్రమతః = పంచాహుతి క్రమము ననుసరించి; సిద్ధే=సిద్ధమైన; ప్రాణే = ఆ ప్రాణమందు, సాశక్తిః=ఆ కర్మ శక్తి; అద్భుతా = అద్భుతమైనదై, లోకాంతరాత్ = ఇంకొక లోకమునుండి. ఆగతేవ=వచ్చినదివలె; ఈశితురిచ్ఛయా=ఈశ్వరేచ్ఛచే. స్ఫురతి=ప్రకాశించును

శ్లో॥ కర్తవ్య స్యానుసారేణ తథాభూతే తిరశ్చి వా
ఆత్మయోగ బలాత్సిద్ధే ప్రాణి న్యత విలక్షణే॥ 17

కర్తవ్యస్యానుసారేణ=చేయవలసిన పనిననుసరించి, తథాభూతే=అట్టివానియందు; తిరశ్చివా=తిర్యక్కులందు, ఆత్మయోగ బలాత్ =తన యోగబలముచే; సిద్ధే=సిద్ధమైన, విలక్షణే ప్రాణిని =వింత ప్రాణియందు, (పై పద్యములో అన్వయము)

శ్లో॥ అనుప్రవేశో యత్ప్రాణే సచ విశ్వాధికారిణః
ప్రాదుర్భావః సమాఖ్యాతః సర్వసాధారణస్త్వయమ్ 18

విభూతి యజ్ఞమే విష్ణువను బ్రాహ్మణమునందలి వాక్యమే ఇందులకు నిదర్శనము. 14

వ్యాఖ్య : దేవుడు ధర్మము క్షీణించినప్పుడు ఆ యజ్ఞశక్తిచేత ధర్మస్థాపనకై భూమియం దవతరించును. 15

వ్యాఖ్య : పంచాహుతి క్రమము ననుసరించి సిద్ధమైన ఆ ప్రాణమందు కర్మవిభూతి శక్తి ఆశ్చర్యకరమైనదై లోకాంతరమునుండి వచ్చినదానివలె, ఈశ్వరేచ్ఛచే ప్రకాశించును. 16

వ్యాఖ్య : కర్తవ్యముననుసరించి అట్టి ప్రాణియందు తిర్యక్కులందు లేక తన యోగబలముచేనైన విలక్షణ దేహమునందు ప్రాణమం దనుప్రదేశము యేదియో అది విశ్వేశ్వరుని అవతారమందురు. ఇది సర్వ సాధారణముగ జరుగును. 17

వ్యాఖ్య : ఏది ప్రాణమునందు ఆత్మ కర్మ విభూతి రూపాను

ప్రాణే=ప్రాణమునందు; యత్ అనుప్రవేశః = ఆత్మకర్మ విభూతిరూపాను ప్రవేశము యేదియో; సచ = అది, విశ్వాధికారిణః = విశ్వేశ్వరుని; ప్రాదుర్భావః = అవతారమని; సమాఖ్యాతః=చెప్పబడినది; అయం=ఇది, సర్వసాధారణః=అవతార సాధారణము.

శ్లో॥ యోగీంద్రాణాం మహర్షీణాం పశ్యతామన్తరం మహః।
యద్యపి స్యాద్దేవతాత్వం తదన్యద్ధేతుభేదతః 9

అంతరం=హృదయాంతరమగు, మహః = జ్యోతిని, పశ్యతాం=చూచుచున్న; యోగీంద్రాణాం=యోగులకు; మహర్షీణాం =మహర్షులకు, దేవతాత్వం = దేవతాత్వము; యద్యపి స్యాత్= అయినను, తత్=అది; హేతుభేదతః=వేరుకారణముచే, అన్యత్ =వేరు విషయము.

శ్లో॥ మహర్షీణాం దశా తాదృగారోహణ ముదీర్యతే
అవతారోఽన్య ఏవస్యాదుత్తమేచ్ఛైక మూలకః 20

మహర్షీణాం=మహర్షులయొక్క, తాదృక్=అట్టి; దశా= అవస్థ, ఆరోహణం=ఆరోహణమని; ఉదీర్యతే=చెప్పబడుచున్నది; అవతారః=అవతారము; ఉత్తమేచ్ఛైక మూలకః = ఉత్తముని ఇచ్ఛయే కారణముగాగలది, అన్యఏవ=భిన్నమే అగును.

శ్లో॥ యథాస్వభావేన బహూనావిశత్యన్తరో భవన్
తథేచ్ఛయాపి చ బహూనావిశే త్ప్రభురేకదా 21

యథాస్వభావేన = స్వభావముచే యేతీరున; అంతరః = అంతరుడు, భవన్ =అగుచు బహూన్ =అనేకులను; ఆవిశతి=ఆవేశించునో; తథా=ఆవిధముగా; ప్రభుః=ఈశుడు; ఇచ్ఛయా= ఇచ్ఛచే, ఏకదా=ఒక్కసారియే; బహూన్ =అనేకులను; ఆవిశేత్ =ఆవేశించును.

ప్రివేశమో, అది విశ్వేశ్వరుని అవతారమని చెప్ప
బడినది. ఇది అవతార సాధారణము. 18

వ్యాఖ్య : అంతర జ్యోతిని చూచుచున్న మహర్షులను యోగులకు, దేవత్వము కలుగుచున్నది. కాని అది కారణాంతరముచే భిన్నమగు చున్నది. 19

వ్యాఖ్య : అట్టి మహర్షులదశ ఆరోహణ మనబడును. ఉత్తమునిచే మాత్రిము అగు అవతారము భిన్నమే అగును. 20

వ్యాఖ్య : ఏ తీరుగా అనేకాంతరములను స్వభావముచే నావేశించునో అట్లే అనేకులను ఒకేసారి ప్రభువు ఇచ్ఛచే ఆవేశింప వచ్చును. 21

శ్లో॥ ఉత్తమస్యేవ సర్వేషాం దేవానామపి శుశ్రుమ
తత్తత్కార్యానుసారేణ ప్రాదుర్భావం మహీతలే 22

ఉత్తమస్య ఇవ=ఉత్తమునకువలెనే; సర్వేషాం దేవానాం అపి=సమస్త దేవతలకును; తత్తత్ = ఆయా, కార్యానుసారేణ= కార్యముల ననుసరించి, మహీతలే=భూమియందు, ప్రాదుర్భావం= పుట్టుకను; శుశ్రుమ=వింటిమి.

శ్లో॥ న తేషా మవతారేషు భవేద్యజ్ఞః ప్రయోజకః
ఆవేశ ఆత్మశక్త్యైవ కదాచిత్తేషు సంభవేత్ 23

తేషాం అవతారేషు=వారి అవతారములందు. యజ్ఞః= యజ్ఞము. ప్రయోజకః=కారణము. న=కాదు; ఆత్మశక్త్యా=ఆత్మ శక్తిచేతనే, ఆవేశః=ఆవేశము. కదాచిత్ =ఒకానొకప్పుడు, తేషు= వారలందు, సంభవేత్ =అగును.

## 33. మంత్రయోగాధికరణమ్

శ్లో॥ వర్ణావ ల్యనుసంధాన పూర్వకో మనసా జపః
ఏకాగ్రత్వేన మంత్రస్య మంత్రయోగ ఉదాహృతః 24

మంత్రస్య = మంత్రముయొక్క, వర్ణావల్యనుసంధాన పూర్వకః=వర్ణసముదాయమును మాటి మాటికి ఉచ్చరించునట్టి; మనసా=మనసుచే నగు; జపః=జపము, ఏకాగ్రత్వేన=ఏకాగ్ర మైన దగుటచే, మంత్రయోగః=మంత్రయోగమని; ఉదాహృతః=చెప్పబడినది.

శ్లో॥ మంత్రయోగేన దేవస్య ప్రసాదః సులభః స్మృతః
సర్వేష్వపిచ మంత్రేషు ప్రణవస్తు విశిష్యతే 25

మంత్రయోగేన=మంత్రయోగము చే, దేవస్య= దేవుని; ప్రసాదః=అనుగ్రహము: సులభః=సులభమైనదని, స్మృతః= చెప్ప

వ్యాఖ్య. ఉత్తమునకు వలె ఆయా దేవతలకును కార్యానసర మును బట్టి ఆవిర్భావము కలదని వినుచున్నాము. 22

వ్యాఖ్య: వారి అవతారములందు యజ్ఞము కారణము కాదు ఆత్మ శక్తిచేతనే ఒకప్పుడు వారియందు ఆవిర్భవించు శక్తి కలుగును. 23

## 33. మంత్రయోగాధికరణము

వ్యాఖ్య: మంత్రమునందలి అక్షరములను క్రమముగ మనసుచే నుచ్చరించుచు చేయు జపము ఏకాగ్రమైన దగుటచే మంత్రయోగ మనబడును. 24

వ్యాఖ్య. మంత్రయోగముచే దేవప్రసాదము సులభమని స్మరింప బడినది. అన్ని మంత్రములందు ప్రణవము శ్రేష్ఠమైనది. 25

బడినది, సర్వేషు అపి మంత్రేషు=అన్ని మంత్రములందును, ప్రణవః=ఓంకారము; విశిష్యతే= శ్రేష్ఠమైనదగుచున్నది.

శ్లో॥ ఆత్మన స్త్రివిధస్యాపి ప్రణవోనామ కీర్త్యతే
ఈశ్వరస్యైవ కేప్యాహుః సత ఏవ పరేవిదుః 26

త్రివిధస్యాపి=మూడు విధములగు (పరమాత్మ, సూత్రాత్మ, మహానాత్మ); ఆత్మనః=ఆత్మకు; ప్రణవః=ప్రణవము; నామ= పేరు; అని కీర్త్యతే=చెప్పబడుచున్నది; కేపి=కొందరు; ఈశ్వర స్యైవ = ఈశ్వరునికే అని; పరే=మరికొందరు, సతఏవ=సత్తునకే పేరు అని; విదుః= తెలిసికొనిరి.

శ్లో సతారావ్యాహృతి యుతా గాయత్రీ చ ప్రశస్యతే
విలోకితా గాధిజేన విశ్వామిత్రేణ యాః పురా ॥ 27

సతారా=ఓంకారముతో కూడిన; వ్యాహృతి యుతా= మూడు వ్యాహృతులతో కూడిన (ఓం భూః, భువః, సువః) పురా= పూర్వము; గాధిజేన=గాధి పుత్రుడైన; విశ్వామిత్రేణ=విశ్వా మిత్రునిచే; యా=ఏది; విలోకితా=దర్శింపబడినదో; సాగాయత్రీ= ఆ గాయత్రీ మంత్రము; ప్రశస్యతే= శ్రేష్ఠమైనదగుచున్నది.

శ్లో॥ యజుర్మంత్రేషు సర్వేషు శస్తా పంచాక్షరీ మతా
ప్రజపేత్తాం సప్రణవాం దేవతాయత్ర మధ్యమః 28

సర్వేషు యజుర్మంత్రేషు=అన్ని యాజుషమంత్రములందు; పంచాక్షరీ=నమశ్శివాయ అను పంచాక్షరీ; శస్తామతా=ప్రశస్త మైనదని చెప్పబడినది. సప్రణవాం=ఓంకారముతో కూడిన, యత్ర=ఏ మంత్రమున; మధ్యమః=రుద్రుడు; దేవతా= దేవ తయో; తాం=ఆ మంత్రమును; ప్రజపేత్ =అధికముగ జపించ వలెను.

శ్లో సర్వేషు సా మంత్రేషు గాయత్ర్యేక పదోత్తమా।
ఐంద్రీ దృష్టా వసిష్ఠేన మహాత్మా తపసా పురా। 29

వ్యాఖ్య మూడు విధములగు నాత్మకు ప్రణవము నామము. ఒక్క ఈశ్వరునికే పేరు అని కొందరు, సత్తునకే పేరు అని కొందరు చెప్పుదురు. 26

వ్యాఖ్య · ఓంకారము, మూడు వ్యాహృతులు కలసినట్టియు, గాధిజుడైన విశ్వామిత్రి దర్శనమైనట్టియు గాయత్రి మంత్రము ప్రశంసింపబడు చున్నది. 27

వ్యాఖ్య · సమస్త యాజుష మంత్రములందు పంచాక్షరీ ప్రశస్తమైనది. దేనియందు మధ్యముడైన రుద్రుడు దేవతయో ఆ పంచాక్షరిని ప్రణవముతో కూడ జపింపవలెను. 28

వ్యాఖ్య సమస్త సామవేద మంత్రములందు 'ఇందో్ర విశ్వస్య రాజతే' అను ఏకపద గాయత్రి శ్రేష్ఠమైనది. ఇంద్ర

సర్వేషు=సమస్తమగు; సామ మంత్రేషు = సామవేద మంత్రములందు; ఏకపదా గాయత్రీ=ఒకే పాదముగల గాయత్రీ మంత్రము. ఉత్తమా=శ్రేష్ఠమైనది; 'ఇంద్రో విశ్వస్య రాజతే' అనునది అది; మహతా = గొప్పదగు; తపసా = తపస్సు చేత; ఐంద్రీ=ఇంద్ర దేవతాకమగు ఈ మంత్రము; పురా=పూర్వమందు వసిష్ఠేన=వసిష్ఠ మహర్షి చేత: దృష్టా=చూడబడినది.

శ్లో॥ విదుః ప్రశస్తాం తస్యైవ రౌద్రీం చాన్యా మనుష్టుభమ్
కశ్యపేన చ సందృష్టాం త్రిష్టుభం జాతవేదసః 30

తస్యైవ=ఆ వసిష్ఠుని: రౌద్రీం = రుద్ర దేవతాకమును: అనుష్టుభమ్=అనుష్టుప్ ఛందస్సునందగు: అన్యాం=వేరొక మంత్రమును. ప్రశస్తాం=శ్రేష్ఠమగుదానినిగా: విదుః= తెలిసికొందురు; 'త్రియంబకం' ఇతి మంత్రం. జాతవేదసః=జాతవేదసుడు దేవతయగు: త్రిష్టుభం=త్రిష్టుప్ ఛందస్సునందగు. కశ్యపేన సందృష్టాం=కశ్యపదర్శనమగు మంత్రమును; ప్రశస్తాం విదుః=శ్రేష్ఠమైనదని తెలిసికొందురు. 'జాతవేదసే సునవామ' అను మంత్రము'

శ్లో॥ బ్రాహ్మణోక్తేషు మంత్రేషు నామత్రయమనుః పరః
అతి దీర్ఘేణ తపసా భరద్వాజోఽయ మాప్తవాన్ 31

బ్రాహ్మణోక్తేషు=బ్రాహ్మణములందలి మంత్రములలో: నామత్రయమనుః=మూడు నామములు గల మంత్రము: పరః= శ్రేష్ఠము, 'సఘృణిః, సూరియ, ఆదిత్యజా'; అతిదీర్ఘేణ తపసా= దీర్ఘమగు గొప్ప తపస్సుచే. భరద్వాజః=భరద్వాజుడు. అయం= ఈ మంత్రమును; ఆప్తవాన్=దర్శించెను.

శ్లో॥ తాంత్రికేషుతు మంత్రేషు శ్రేష్ఠా పంచదశాక్షరీ
గాయత్రీ మాసురీం ప్రాహుః యాం మానగురు వీక్షితామ్ ॥ 32

తాంత్రికేషు మంత్రేషు తు = తాంత్రిక మంత్రములందైతే: పంచదశాక్షరీ = పదునైదక్షరములు గల మంత్రము:

దేవతాకమగు ఈ మంత్రము పూర్వము వసిష్ఠునిచే దర్శింప బడినది. 29

వ్యాఖ్య : రుద్రదేవతాకము అనుష్టుప్ చందస్సు, వసిష్ఠ దర్శనము అగు మంత్రమును, కశ్యపదర్శనము; త్రిష్టుప్. చందస్సు, అగ్ని దేవతాకము అగు మంత్రమును ప్రశస్తములు. 30

వ్యాఖ్య : బ్రాహ్మణములందు మంత్రములలో సూర్యమంత్రము శ్రేష్ఠము. ఇది నామత్రయాత్మకము దీనిని చాల తపముచే భరద్వాజుడు దర్శించెను. 31

వ్యాఖ్య : తాంత్రిక మంత్రములలో ఆసురీగాయత్రీ అని ప్రసిద్ధి

శ్రేష్ఠ = శ్రేష్ఠమైనది. యాం మహానగురు వీక్షితామ్ = ఏ మహాన గురు దర్శితమైన మంత్రమును. ఆసురీం గాయత్రీ మాహుః = ఆసుర గాయత్రి అని అందురో దానిని శ్రేష్ఠమందురు.

శ్లో॥ యః కశ్చిద్వైదికో మంత్రః శాంతికో వా సతాం మతః ।
సర్వోపిచ స సంసిద్ధ్యై భవేదేవ న సంశయః 33

యః కశ్చిత్ = ఏ ఒక్క; వైదికః మంత్రః = వేదోక్త మంత్రము సతాం = సజ్జనులకు మతః = అంగీకార్యమైన, శాంతికో వా = శాంతిక మంత్రమైనను; సర్వోపి = సమస్తము ను; సంసిద్ధ్యై = సిద్ధికొరకు; భవేత్, ఏవ = అగును; నసంశయః = సందేహము లేదు.

## 34. కర్మయోగాదికరణమ్

శ్లో॥ స్థూలా వాయుమయీ శాఖా ప్రోక్తా ప్రాణస్య యా పురా ।
విభూతి రియమేతస్య వ్యానో నామ మారుతః 34

ప్రాణస్య = ప్రాణమునకు, స్థూలావాయుమయీ = స్థూలము, వాయు స్వరూపమునగు; యా శాఖా = ఏ శాఖ; పురా = ముందుగా; ప్రోక్తా = చెప్పబడినదో; ఏతస్య = దానియొక్క; విభూతిః = విభూతి, ఇయం = ఇది, వ్యానో నామ మారుతః = వ్యాన మను వాయువు

శ్లో॥ వాయోర్మూలం భవేచ్ఛ్వాసోయం ప్రాణం భిషజో విదుః ।
శరీరవ్యాపినీ శాఖాతస్య వ్యాన ఉదీర్యతే 35

వాయుః = వాయువునకు; మూలం = మూలము; శ్వాసః = శ్వాసము, భవేత్ = అగును, భిషజః = వైద్యులు; యం = దేనిని; ప్రాణం = ప్రాణమని; విదుః = చెప్పుదురో; అది శ్వాసము; తస్య = దానియొక్క; శరీరవ్యాపిని = శరీరమంతయు వ్యాపించిన; శాఖా = శాఖ; వ్యాన ఉదీర్యతే = వ్యాన మనబడును.

వహించిన మౌనగురు దర్శనమగు పంచదశాక్షరి ప్రశ
స్తము. దీనినే శ్రీవిద్య అందురు. 32

వ్యాఖ్య : ఏ వైదిక మంత్రమైనను సజ్జను లంగీకరించు తాంత్రిక
మంత్రమైనను సిద్ధికారకగును. సందేహము లేదు. 33

## 34. కర్మయోగాధికరణమ్

వ్యాఖ్య : ప్రాణమునకు స్థూలశాఖ పూర్వమున చెప్పబడినది.
దాని విభూతియగు వ్యానమను వాయువు కలదు 34

వ్యాఖ్య : వైద్యులు ప్రాణమని దేని నందురో ఆ శ్వాసమే
వాయువునకు మూలము. దాని శాఖ శరీరమందంతటను
వ్యాపించియున్నది. దానినే వ్యానమందురు 35

శ్లో॥ స్మరన్కర్తార మాత్మానం కుర్యాత్కర్మాఖిలం కృతీ
అకృత్వా యత్నతః సంగం ఫలేవా విషయేపి వా 36

ఆత్మానాం = ఆత్మను; కర్తారం = చేయుచున్నవానినిగా; సర్మన్ = జ్ఞాపకముంచుకొనుచు: అఖిలం కర్మ = సమస్తకర్మను; కృతీ = నేర్పరి, యత్నతః = యత్నముతో; సంగం = ఆసక్తిని; ఫలేవా = ఫలమందుగాని; విషయేపివా = విషయమందుగాని; అకృత్వా = చేయక, కుర్యాత్ = చేయవలెను.

శ్లో॥ విస్మర్తవ్యో నాపరిమత్తైః ఆత్మాకర్మణి కర్మణి
క్రియాయాం వా మతిం కుర్యా ద్ధ్యాన స్యోపాసనన్తు తత్ 37

కర్మణి కర్మణి = ప్రతికర్మయందు; అప్రమత్తైః = జాగరూకులగువారిచే ఆత్మా = ఆత్మ, న విస్మర్తవ్యః = మరువరానిది; క్రియాయాంవా = క్రియయందైనను, మతిం = బుద్ధిని; కుర్యాత్ = చేయవలయును; తత్ = అది· ధ్యానస్య = ధ్యానముయొక్క; ఉపాసనం = ఉపాసనము.

శ్లో॥ గచ్ఛన్కుర్వంశ్చ విసృజన్ రమమాణో వదన్నపి
కర్తారం యోఽను సంధధ్యాత్స ధ్యానే ప్రతితిష్ఠతి 38

గచ్ఛన్ = వెళ్లుచూ; కుర్వన్ = చేయుచూ; విసృజన్ = విసర్జించుచూ, రమమాణః చ = క్రీడించుచు; వదన్ అపి = మాట్లాడుచు (ఏ పని చేయుచున్నను అని భావము) యః = ఎవడు; కర్తారం = కర్తను, అను సంధధ్యాత్ = అనుసరించునో; సః = వాడు; ధ్యానే = ధ్యానమందు; ప్రతితిష్ఠతి = నిష్ఠను చెందును.

శ్లో॥ క్రియాంవా యోఽను సంధధ్యాత్స ధ్యానం నాతిలంఘతే
శరీరేవ్యాప్నువత్తేజః స్యాదేవం బలవత్తరమ్ 39

యః = ఎవడు; క్రియాంవా = పనినైనను; అనుసంధధ్యాత్ = చేయునో. సః = వాడు: ధ్యానం = ధ్యానమును, న అతిలంఘతే =

వ్యాఖ్య : ఆత్మను కర్తగా తలచుచు ఫలమందుగాని, విషయ మందుగాని సంగమును విడచి నేర్పున సమస్త కర్మలను చేయవలెను. 36

వ్యాఖ్య : ప్రతి కర్మయందు తప్పక జ్ఞాపక ముంచుకొనవలెను. లేదా క్రియయందైనను మతి నుంచవలెను అది వ్యానోపాసనమగును. 37

వ్యాఖ్య : నడచుట, వెళ్లుట, చేయుట మొదలగు ఏ పనులు చేయుచున్నను. ఎవడు కర్తను అడియందుంచుకొననో వాడు వ్యానమందు నిష్ఠితుడగును. 38

వ్యాఖ్య : క్రియనైనను అనుసంధించుచు చేయవలెను. వాడును

దాటుట లేదు ఏవం = ఈ విధముగ; శరీరే = శరీరమును; వ్యాప్నువత్ = వ్యాపించు; తేజః = తేజస్సు, బలవత్తరం = మిక్కిలి బలమైనది, స్యాత్ = అగును.

శ్లో॥ క్షీరం నీరే యథా తేజో దేహే సక్తస్య కుర్వతః
కుర్వతస్త్వ ప్రమత్తస్య తండులేషు తిలాఇవ 40

దేహే = దేహమందు; సక్తస్య = సంగముకలిగి; కుర్వతః = చేయువానికి; క్షీరం = పాలు; నీరేయథా = నీటి యందెట్లో; తేజః = తేజస్సు; అగును; అప్రమత్తస్య = జాగరూకుడై; కుర్వతః = చేయు వానికి: తండులేషు, తిలాఇవ = బియ్యమునందు నువ్వులు కలిపి నట్లగును.

శ్లో శరీరవ్యాపిచే త్తేజస్తండులేషు తిలా ఇవ
తచ్ఛరీరాత్ పరాభూతం మృత్యుత స్త్రాయతే నరమ్॥ 41

తేజః = తేజము; శరీరవ్యాపిచేత్ = శరీరమందంతట నిండి నచో, తత్ = అది; శరీరాత్ = శరీరమునుండి; పరాభూతం = వేరైన; నరమ్ = నరుని; మృత్యుతః = మృత్యువునుండి: త్రాయతే = రక్షించుచున్నది.

శ్లో॥ ఛందోగానా ముపనిషద్యుదితా మతిగోపితామ్
ఇమాం వ్యానోద్గీథ విద్యాం కర్మయోగం విదో విదుః॥ 42

ఛందోగానాం, ఉపనిషద్యుదితామ్ = ఛాందోగ్యోపనిషత్తు నందు తెలుపబడిన, అతిగోపితా = మిక్కిలి రహస్యమగు. ఇమాం వ్యానోద్గీథ. విద్యాం = ఈ వ్యానోద్గీథ విద్యను. కర్మయోగం = కర్మయోగమని; విదః = తెలిసినవారు, విదుః = తెలియుదురు.

శ్లో॥ అగ్నిహోత్రాదికం కర్మ క్రియమాణం యథావిధి।
ఫలాపేక్షా విరహితం కర్మయోగం పరే విదుః॥ 43

వ్యానమందే నిష్ఠ చెందును. దానిచే తేజస్సు శరీరమున బలపడును. 39

వ్యాఖ్య : సంగముతో పనులు చేయువానికి క్షీరనీరములవలె దేహ తేజములకు సంసృష్టి అగును. ప్రమత్తుడు కాని వానికి తిల తండులములువలె దేహ తేజములకు సంకరమై తేజము వేరగును. అని భావము. 40

వ్యాఖ్య శరీరమందు వ్యాపించిన ఆ తేజము తిలలుతండులముల నుండి వేరగునట్లు శరీరమునుండి వేరై మృత్యువునుండి మానవుని రక్షించును. 41

వ్యాఖ్య : ఛాందోగ్యోపనిషత్తు నందు తెలుపబడిన ఈ రహస్యమగు వ్యానోద్గీథ విద్యనే కర్మయోగమని వేత్తలు చెప్పుదురు. 42

వ్యాఖ్య : ఫలాపేక్ష లేక శాస్త్రోక్తమగు అగ్నిహోత్రాది కర్మలు

అగ్నిహోత్రాదికం=అగ్నిహోత్రము మొదలగు; క్రియమాణం = చేయబడుచున్న; యథావిధి = శాస్త్రవిధిని దాటక చేయునట్టి ఫలాపేక్షా విరహితం=ఫలాపేక్ష లేనట్టి; కర్మ=కర్మ; కర్మయోగం=కర్మయోగమని పరే = కొందరు. విదుః= తెలిసి కొందురు.

## 35. జ్ఞానయోగాధికరణమ్

శ్లో॥ ప్రజ్ఞయా అప్రమాదేన ధృతిరాత్మని కీర్తితః
జ్ఞానయోగస్తద్విభేదా న్విద్యాః ప్రాహుర్మనీషిణః 44

ప్రజ్ఞయా = ప్రజ్ఞయొక్క; అప్రమాదేన=ఏమరుపాటు లేక; ఆత్మని=ఆత్మయందు ధృతిః = నిలకడ చెందించుట. జ్ఞానయోగః = జ్ఞానయోగము: తద్విభేదాన్ = దాని భేదములను; విద్యాః=విద్యలని. మనీషిణః=పండితులు; ప్రాహుః = పలుకుదురు.

శ్లో॥ ఉపాసనజ్ఞాన యోగౌ యః పృథక్కురుతే జనః
తేన వేదాన్త శాస్త్రస్య తాత్పర్యం నైవ శోధితమ్ 45

ఉపాసనజ్ఞానయోగౌ=ఉపాసనము, జ్ఞానయోగము అనునవి; యః జనః=ఎవడు, పృథక్కురుతే= వేరుచేయుచున్నాడో; తేన=వానిచేత; వేదాన్తశాస్త్రస్య= వేదాంత శాస్త్రము యొక్క, తాత్పర్యం=భావము; నైవశోధితమ్=పరిశోధింపబడ లేదు.

శ్లో॥ అభ్యాసస్త్వాత్మ నిష్ఠాయా ఉపాసన ముదీర్యతే
తదేవ జ్ఞానయోగాఖ్యం విద్యాఖ్యమపి తత్స్మృతమ్ 46

ఆత్మనిష్ఠాయాః=ఆత్మనిష్ఠకమగు; అభ్యాసః=అభ్యాసము, ఉపాసనమ్ ఉదీర్యతే=ఉపాసన మనబడుచున్నది; తదేవ=అదే జ్ఞానయోగాఖ్యం విద్యాఖ్యం అపి తత్ స్మృతం=అదే జ్ఞానయోగము, విద్య అని అనబడుచున్నది.

చేయుట కర్మయోగమని కొందరి ఆశయము. 43

## 35. జ్ఞానయోగాధికరణము

వ్యాఖ్య · పరిజ్ఞయొక్క ఆత్మయందగు ధృతిని ఏమరిపాటు లేకున్న దానిని జ్ఞానయోగమందురు. దాని విభేదములనే విద్యలు అని పండితులు చెప్పుదురు. 44

వ్యాఖ్య · ఎవడు ఉపాసన జ్ఞానయోగములు భిన్నములనునో వానికి వేదాంత శాస్త్రభావము తెలియదు. 45

వ్యాఖ్య : ఆత్మనిష్ఠమైన అభ్యాసము ఉపాసనమని చెప్పబడు చున్నది. దానినే జ్ఞానయోగమని, విద్య అని అందురు. 46

శ్లో॥ అధికా భక్తితో విద్యా మంత్రిత శ్చాధికా మతా
కర్మత శ్చాధికా విద్యా తస్మాద్విద్యాం శ్రయేతనా 47

విద్యా=విద్య, భక్తితః అధికా = భక్తికన్న మిన్న; మంత్రితఃచ అధికామతా=మంత్రముకన్న గొప్పదని భావింపబడుచున్నది; కర్మతఃచ అధికా=కర్మకన్నా గొప్పది; తస్మాత్ = ఆ కారణముచే, నా=మానవుడు; విద్యాం శ్రయేత్ =విద్యను ఆశ్రయింపవలెను.

శ్లో॥ విద్యాం దివ్య ధనం ప్రాహు రవిద్యా మాసురం ధనమ్ ।
శోభన్తే విదుషస్తస్మా ద్భక్తే ర్మంత్రాశ్చ కర్మణః 48

విద్యాం=విద్యను, దివ్యం= ధనం ప్రాహుః =దివ్యమగు ధనముగా చెప్పుదురు; అవిద్యాం=అవిద్యను అసురం ధనం= అసుర ధనమందురు తస్మాత్ =అందుచే; భక్తిః మంత్రాత్ చ= భక్తి. మంత్రముల కంటె, కర్మణః=కర్మకంటె, విదుషః= విద్యను తెలిసిన వారు, శోభన్తే =ప్రకాశించుదురు.

శ్లో॥ ఏకత్వేపిచ నిష్ఠాయాః పథాం భేదైః ప్రకీర్త్యతే
జ్ఞానయోగస్తు వివిధః శ్రుత్యన్తేషు మహర్షిభిః 49

నిష్ఠాయాః ఏకత్వే అపి=నిష్ఠ ఒకటే అయినప్పటికి, పథాం=మార్గముల, భేదైః=భేదముచే; జ్ఞానయోగం=జ్ఞానయోగమును; వివిధః=అనేక విధములైనదని; శ్రుత్యన్తేషు= వేదాంతములందు; మహర్షిభిః=మహర్షులచే; ప్రకీర్త్యతే=చెప్పబడుచున్నది.

శ్లో॥ జ్ఞానయోగస్తు యత్ప్రాజ్ఞో నస్ఖలత్యన్తరాత్మనః ।
తదేవోపాసన స్యాపి లక్షణం పరికీర్తితమ్ 50

ప్రాజ్ఞః = ప్రాజ్ఞుడు, అంతరాత్మనః = అంతరాత్మనుండి; యత్ నస్ఖలతి=చెదరకుండుటయే. జ్ఞానయోగః=జ్ఞానయోగము; తదేవ=అదే. ఉపాసనస్యాపి=ఉపాసనకును; లక్షణం=లక్షణము, పరికీర్తితమ్=చెప్పబడినది.

వ్యాఖ్య: భక్తి కన్నను, మంత్రము కర్మ, మొదలగు వానికన్నను విద్య గొప్పది. కాన మానవుడు విద్య నుపాసించ వలెను 47

వ్యాఖ్య: విద్య దివ్య ధనము. అవిద్య అసుర ధనము. కావుననే విద్వాంసులు భక్తి మంత్రి కర్మలకన్న విద్యచేతనే శోభింతురు. 48

వ్యాఖ్య: నిష్ఠ ఒక్కటే అయినను మార్గ భేదములచే వేదాంతములందు మహర్షులచే అనేక విధములగు జ్ఞాన యోగములు చెప్పబడినవి. 49

వ్యాఖ్య: అంతరాత్మనుండి ప్రజ్ఞ చలింపకుండుటయే జ్ఞాన యోగమనబడును. అదే ఉపాసనకును లక్షణము. 50

శ్లో॥ యో౽నవేద పృథక్ప్రాజ్ఞో జ్ఞానదేవ ముపాసనమ్
సయథావన్మహర్షీణాం పన్థాను మనుగచ్ఛతి 51

యః=ఎవడు; ఏవం=ఈ తీరున; జ్ఞానాత్ =జ్ఞానము కన్న; ఉపాసనమ్=ఉపాసనమును, న పృథక్ =వేరు కాదని వేద= తెలియునో సః = వాడు; యథావత్ = శాస్త్రానుసారముగ; మహర్షీణాం=మహర్షులయొక్క; పంథానం=మార్గమును; అనుగచ్ఛతి=అనుసరించును.

శ్లో॥ విజానన్పృథగ ప్రాజ్ఞో జ్ఞానయోగా దుపాసనమ్
శాస్త్ర జ్ఞానేన సంతృప్తింగచ్ఛన్నన్తేవ సీదతి । 52

జ్ఞానయోగాత్ =జ్ఞానయోగముకంటే; ఉపాసనం=ఉపాసనమును: పృథక్ =వేరుగ; విజానాన్ =తెలియుచు, అప్రాజ్ఞః= మందుడు, శాస్త్రజ్ఞానేన=శాస్త్రజ్ఞానముచే; సంతృప్తః=తృప్తినొంది; గచ్ఛన్ =వెళ్లుచు; అన్తే అవసీదతి=తుదను నశించును.

వ్యాఖ్య : ఎవడు ఈ విధముగ జ్ఞానోపాసనలు ఒకటి అనీ తెలియునో వాడు మహర్షుల మార్గమును అనుసరించుచున్నాడు. 51

వ్యాఖ్య : ఉపాసన జ్ఞానయోగములు భిన్నములని తలచిన అప్రాజ్ఞుడు, శాస్త్ర జ్ఞానము చే తృప్తిపడి తుదను నశించును. 52

# సప్తమః పరిచ్ఛేదః

## 36. ఉద్గీథ విద్యాధికరణమ్

శ్లో॥ అథాక్షరోద్గీథ విద్యాం సర్వోపాసక శీలితామ్
సర్వవేదాంత సంగీతాం ప్రవక్ష్యామి స్వరూపతః 1

సర్వోపాసక శీలితాం=అందరు ఉపాసకులచే నుతింపబడు నట్టియు; సర్వవేదాంత సంగీతాం=అన్ని వేదాంత గ్రంథములచే గానముచేయబడు నట్టియు; అక్షరోద్గీథ విద్యాం=అక్షరోద్గీథ విద్యను; స్వరూపతః=వాస్తవ రూపముతో. ప్రవక్ష్యామి= చెప్పెదను.

శ్లో॥ అక్షరం పరమం ప్రాహు రోంకారం స్వరకోవిదాః
అనేన వాచః సంతృణ్ణాః పలాశానీవ శంకునా 2

స్వరకోవిదాః=స్వరవేత్తలు; ఓంకారం=ఓంకారమును; పరమం అక్షరం=శ్రేష్ఠమగు అక్షరముగ, ప్రాహుః=చెప్పెదరు; అనేన = దీనిచే వాచః = వాక్కులు, సంకునా = మూడికచే; పలాశానీవ = ఆకులనరములవలె (కొమ్మలవలె) సంతృణ్ణాః = చీలికలై పుట్టి వ్యాపించినవి.

శ్లో॥ దృశ్యతే సూక్ష్మ ఓంకారః స్వశక్తేః పరమః స్వరః।
ఏతస్యైవ స్వరా అన్యే వికారాః పరికీర్తితాః॥ 3

స్వశక్తేః=ఆత్మశక్తియొక్క, పరమః స్వరః = శ్రేష్ఠమగు స్వరము; సూక్ష్మః=సూక్ష్మరూపము అగునది; ఓంకారః=ఓంకారము; దృశ్యతే=కానవచ్చుచున్నది; ఏతస్యైవ=దీనియొక్కయే; అన్యేస్వరాః=ఇతర స్వరములు; వికారాః=వికారములని; పరికీర్తితాః=చెప్పబడినది.

# సప్తమపరిచ్ఛేదము

## 36. ఉద్గీథ విద్యాధికరణము

వ్యాఖ్య : అందరిచే నుతింపబడినట్టియు వేదాంత గ్రంథములందు గానము చేయబడినట్టియు, అక్షరోద్గీథ విద్యయొక్క నిజ స్వరూపమును చెప్పుచున్నాను. 1

వ్యాఖ్య : స్వరతత్త్వవేత్తలు ఓంకారమును పరమైన స్వరముగ చెప్పుదురు శంఖువునుండి ఈ నెలు వ్యాపించిన తీరున దీని నుండి అక్షరములు పుట్టినవి. 2

వ్యాఖ్య : ఆత్మశక్తియొక్క పరమ స్వరమే ఓంకారము. సూక్ష్మమై కాననగును. దాని వికారములే మిగిలిన స్వరములందురు. 3

శ్లో॥ సర్వేషా మపి శబ్దానాం ప్రణవం ప్రకృతిం విదుః
శబ్దబ్రహ్మేతి గీతోఽయ మేతస్మాదేవ కారణాత్ 4

సర్వేషామపి శబ్దానాం = అన్ని శబ్దములకు; ప్రణవం= ప్రణవమును; ప్రకృతిం = మూలమగుదానినిగ· విదుః=చెప్పుదురు, ఏతస్మాదేవ కారణాత్ =ఈ కారణముచే; అయం=ఓంకారము; శబ్దబ్రహ్మ ఇతి=శబ్ద బ్రహ్మము అని, గీతః=గానము చేయబడినది.

శ్లో వాచ్యః శబ్ద ప్రకృత్యైవ భూత ప్రకృతి రీశితా
శాబ్దైర్వికారై రుచ్యన్తే వికారాః సార్వభౌతికాః 5

శబ్దప్రకృత్యా ఏవ = శబ్దప్రకృతుల చేతనే. భూత ప్రకృతిః=భూతప్రకృతి; వాచ్యః = చెప్పబడినదై; ఈశితా= పలుకబడుచున్నడ. శాబ్దైః వికారైః = శబ్దవికారములచే; సార్వభౌతికాః వికారాః = అన్ని భూతవికారములూ; ఉచ్యన్తే=చెప్పబడుచున్నవి.

శ్లో॥ ముఖ్యం నామ తదీశస్య ప్రణవం పరిచక్షతే
నామాన్యన్యాని సర్వాణి గౌణాని విదుషాం మతే 6

ప్రణవం = ఓంకారము; ఈశస్య = ఈశ్వరునకు; ముఖ్యంనామ = ముఖ్యమగు పేరని; పరిచక్షతే = చెప్పుదురు: అన్యాని సర్వాణి నామాని=ఇతర నామములన్నియు, విదుషాం మతే=విద్వాంసుల మతమున, గౌణాని=లాక్షణికములు.

శ్లో ఓంకార మీశనామాహ భగవాంశ్చ పతంజలిః
వాచ్యవాచకయో ర్భేదో మృగ్యతే చే న్నలక్ష్యతే॥ 7

భగవాన్ పతంజలిః చ = భగవంతుడగు పతంజలియు: ఓంకారం=ఓంకారమును: ఈశనామ = ఈశ్వరుని పేరు; ఆహ=

వ్యాఖ్య అన్ని శబ్దములకు ప్రణవము మూలము. అందుచేతనే ఓంకారమును శబ్ద బ్రహ్మమందురు. 4

వ్యాఖ్య శబ్దప్రకృతిచే భూత ప్రకృతి చెప్పబడుచున్నది. శబ్ద ప్రకృతి యనగా ఓంకారముచే భూతప్రకృతియే వాచ్యమగుచున్నది. అట్లే శబ్దవికారములచే భూత వికారములు భోజ్యములగుచున్నవి. 5

వ్యాఖ్య ఈశ్వరునకు ముఖ్యమగు నామము ప్రణవము. ఇతర నామములు వానికి గౌణములు. 6

వ్యాఖ్య : భగవాన్ పతంజలియు, ఈశ్వరునకు అసాధారణ నామము ఓంకారమని చెప్పెను. 'తస్యవాచకః

చెప్పెను: వాచ్యవాచకయోః = వాచ్యవాచకములకు భేదః= భేదము; మృగ్యతేచేత్ =అన్వేషించి నప్పటికి; నలభ్యతే=కాన రాదు.

శ్లో॥ స్వరన్నేవ విజానాతి స్వరన్నేవ శ్వసిత్యపి
తతోఽజ్ఞానం క్రియాచేతి ద్వయం న స్వరమన్తరా 8

స్వరన్నేవ విజానాతి=స్వరము చేయుచునే తెలిసికొను చున్నాడు, స్వరన్ ఏవ శ్వసితి అపి=స్వరము చేయుచునే ఊపిరి తీయుచున్నాడు; తతః=ఆ కారణముచే; జ్ఞానం క్రియా చ ఇతి= జ్ఞానము క్రియ అనునవి; స్వరమన్తరా=స్వరమండలి అంతరములు; నద్వయం=రెండు కావు.

శ్లో॥ ఓంకారమేవం విజ్ఞాయ స్వశక్తేః సహజం స్వరమ్
సూక్ష్మమన్త రుపాసీత ప్రజ్ఞయైవ గిరాతు న 9

ఏవం=ఈ తీరున; స్వశక్తేః=ఆత్మశక్తియొక్క; పరమం స్వరం=శ్రేష్ఠస్వరమును, విజ్ఞాయ=తెలిసికొని, ప్రజ్ఞయా= ప్రజ్ఞచేతను, సూక్ష్మం=సూక్ష్మమగు స్వరమును అన్తః= లోపల; ఉపాసీత=ఉపాసింపవలెను: గిరా=ఉచ్చారణచే న= కాదు.

శ్లో॥ ఉచ్చార్యమాణస్తు గిరా ప్రణవో వికృతిర్భవేత్
గౌణేభ్య ఈశనామభ్య స్తదాయం నాతిరిచ్యతే 10

గిరా = వాక్కుచే, ఉచ్చార్యమాణః తు = పలుకబడిన దైనచో, ప్రణవః=ఓంకారము, వికృతిః=వికృతి శబ్దము; భవేత్ =అగును; తదా=అప్పుడు: గౌణేభ్యః=గౌణములగు, ఈశనామభ్యః=ఈశనామములచే; తదా=అప్పుడు: అయం= ఇది; నాతిరిచ్యతే=భిన్నమైనది కాదు.

శ్లో॥ త్యాగినాం వా గృహస్థానాం తపతాం వా తదక్షరమ్
స్వరం సహజ మస్మాకం నిషేద్ధుం కోను శక్నుయాత్॥ 11

ప్రణవః' నామమునకు, అర్థమును అన్వేషించినను భేదము కానరాదు. 7

వ్యాఖ్య: స్వరము చేయుచు తెలిసికొను చున్నాడు శ్వాసయు, స్వరము చేయుచునే అగుచున్నది. కాన జ్ఞాన క్రియలు రెండును స్వరము లేక జరుగుట లేదు. 8

వ్యాఖ్య: స్వశక్తియొక్క శ్రేష్ఠమగు స్వరూపమగు ఓంకారమును తెలిసి ప్రజ్ఞచే లోపల ఆ సూక్ష్మమగు స్వరమును ఉపాసింప వలెను. కాని పైకి ఉచ్చరించుటచే కాదు. 9

వ్యాఖ్య: ప్రణవము ఉచ్చరింప బడినప్పుడు అది వికృతియగును. అప్పుడు అది ఈశ్వర నామముల కన్న అధికమైనది కాదు 10

వ్యాఖ్య: వటువులు గృహస్థులు సన్యాసులు అయిన మన కందరకు ఆ స్వరము సహజము. కాన అందరు ఉపాసించ

చ్ఛాత్రాణాం=వటువులకు; గృహస్థానాం=కుటుంబస్థులకు; తపతాం వా=తపస్వులకు, తదక్షరమ్=ఆ అక్షరము; అస్మాకం= మనకు; సహజం=సహజముగు, స్వర =ఆ స్వరరూపాక్షరమును; నిషేద్ధుం=నిషేధించుటకు; కోను శక్నుయాత్=ఎవడు సమర్థుడగును?

శ్లో॥ ఉచ్చార్యమాణే ప్రణవే గౌణనామ్ని మహేశితుః
స్వత్వం యద్యపి నామేవ సామయాచారికన్తు తత్ ॥ 12

మహేశితుః=ఈశుని; గౌణనామ్ని = గౌణనామమగు; ప్రణవే = ప్రణవము. ఉచ్చార్యమాణే = ఉచ్చరింపబడగ; స్వత్వం=ముఖ్యమగు; నామఇవ=పేరు; యద్యపి=ఒకచో అగును అనునది; సామయాచారికం=నమ్మకముచేనగు ఆచారము.

శ్లో॥ సంసారిణో యోగినశ్చ శక్తిః స్వరతి నిత్యశః
తం స్వరం యది జానాతి యోగీ తత్ర క్రియానవ ॥ 13

సంసారిణః=సంసారులకు; యోగినః చ=యోగులకు; నిత్యశః=ఎల్లప్పుడు; శక్తిః=శక్తి. స్వరతి=స్వరము చేయుచున్నది. యోగీ = యోగయుక్తుడు, తం స్వరం=ఆ స్వరమును. యదిజానాతి=తెలిసికొనినచో, అత్ర=అక్కడ; క్రియానవకా=పనిచేసినను చేయకున్నను, ఏమి.

శ్లో॥ యాక్రియా సహజా నిత్యా స్వశక్తేః స్వరరూపిణీ
అనన్యాధీన మనసా తస్యజ్ఞాన ముపాసనమ్ ॥ 14

స్వశక్తేః=ఆత్మశక్తికి, యాక్రియా స్వరరూపిణీ=స్వరరూపమగు ఏ క్రియయో అది; సహజా=సహజమైనది; నిత్యా=నిత్యమైనది. తస్య=దానియొక్క; అనన్యాధీన మనసా=ఏకాగ్రమగు మనసుతో; జ్ఞానం=తెలియుటయే; ఉపాసనం=ఉపాసనము.

వచ్చును. ఎవరును సహజమగు దానిని నిషేధింప జాలరు కదా కొందరు ఓంకారమును, సన్యాసులు మాత్రము ఉపాసింపవలెనందురు. అట్టి దోషము లేదని భావము. కొందరు ఉచ్చరితమగు ఓంకారము సన్యాసులకు మాత్రమే ఉపాస్యమందురు. ఏమైనను ఆంతర స్వామాదరకును ఉపాస్యమే. 11

వ్యాఖ్య : ఉచ్చరింపబడు ప్రణవము ఈశ్వరుని కసాధారణ నామమగును అను నమ్మకము సమయాచారమగుచున్నది 12

వ్యాఖ్య : సంసారులకు యోగులకు శక్తి ఎల్లప్పుడు స్వరము చేయుచునే యున్నది. యోగయుక్తుడైనవాడు ఆ స్వరమును తెలిసికొన్నచో పని చేసినను, చేయకున్నను ఒకటే కదా. 13

వ్యాఖ్య : నిత్యము ఆత్మశక్తికి సహజమగు ఏ స్వరరూపమగు వ్యాపారమున్నదో దానిని ఏకాగ్రమగు మనసుతో తెలియుటయే ఉపాసన మగును. 14

శ్లో॥ బాహ్యాస్తు రుద్ర ఇత్యుక్తః స్వరోఽయం రోదతీత్యతః
ఏతస్యోపాసనా న్మర్త్యః సర్వశబ్దాధిపో భవేత్ 15

బాహ్యా=అంతరిక్షము నందగు, అయం స్వరః=ఈ స్వరమే; రోదతీతి=ధ్వని చేయువాడుకాన, రుద్రః = రుద్రుడని, ఉక్తః= చెప్పబడినాడు; ఏతస్య=ఈ స్వరముయొక్క. ఉపాసనాత్ =ఉపాసనచే; సర్వశబ్దాధిపః=సర్వశబ్దములకు అధిపతి. మర్త్యః=మనుజుడు. భవేత్ =అగును.

శ్లో॥ శబ్దానాశ్రిత్య సర్వాణి విజ్ఞానానీహ శేరతే
యద్వశే వ్యాపృతః శబ్దో విజ్ఞానాన్యపి తద్వశే 16

ఇహ=ఈలోకమున. శబ్దాన్ = శబ్దములను· ఆశ్రిత్య= ఆశ్రయించి. విజ్ఞానాని సర్వాణి = సమస్త విజ్ఞానములు; శేరతే= ఉన్నవి. వ్యాపృతః=వ్యాప్తమగు; శబ్దః = శబ్దము; యద్వశే= ఎవనివశ మందగునో, విజ్ఞానాన్యపి=విజ్ఞానమును కూడ. తద్వశే= వానివశమందగును.

శ్లో॥ ఏతస్యోపాసకా ఏవ మునయో దదృశుః పురా
వేదానేషహి వేదానాం ప్రభవః పరికీర్తితః 17

పురా=పూర్వము; ఏతస్య ఉపాసకాః = ఈ శబ్దోపాసకులగు; మునయః ఏవ = మునులే. వేదాన్ = వేదములను, దదృశుః=దర్శించిరి. ఏషహి = ఇదియే. వేదానాం = వేదముల యొక్క ప్రభవః=పుట్టుకని పరికీర్తితః=చెప్పబడినది.

శ్లో॥ పదముక్తమిదం వేదైర్లక్ష్యం చ తపసామిదమ్।
నైష్ఠికా ఏతదిచ్ఛన్తి యదవ్యక్తః పరః స్వరః 18

ఇదం పదం=ఈ స్థానము. వేదైః=వేదములచే; ఉక్తం= చెప్పబడినది; ఇదం=ఇది; తపసాం=తపస్సులకు; లక్ష్యంచ= లక్ష్యమును; యత్ =ఏది; అవ్యక్తః = వ్యక్తముకాని, పరః

వ్యాఖ్య అంతరిక్షమున ధ్వని చేయుచు డుటచే ఈతనికి రుద్రు డని పేరు కలిగెను. దానిని మనుజు డుపాసించుటచే సర్వ శబ్ధాధిపు డగును. 15

వ్యాఖ్య శబ్దముల నాశ్రయించి సమస్త విజ్ఞానములు కలవు. సర్వవ్యాపియైన శబ్దము ఎవరికి వశమో వానికి అన్ని విజ్ఞానములు వశమగును. 16

వ్యాఖ్య : ఈ శబ్దోపాసకులగు మునులే వేదములను దర్శించిరి. ఇదియే వేదముల పుట్టుక యందురు. 17

వ్యాఖ్య : ఇదీ వేదములచే చెప్పబడినది. తపములకు లక్ష్యము.

స్వరః = సర్వజగదాశ్రయమైన స్వరమో; ఏతత్ = దీనిని; నైష్ఠికాః = నిష్ఠాపరులు; ఇచ్ఛన్తి = కోరుచున్నారు

శ్లో॥ ఏషా ముద్రా స్వరస్యాస్య యదనుజ్ఞా విజానతః
తిష్ఠతి స్వర ఏతస్మి న్ననుజాన న్నివ స్థితః 19

విజానతః = తెలిసినవానికి; యత్ = ఏది, అనుజ్ఞాముద్రా = అనుజ్ఞాముద్రయో, అస్యస్వరస్య = ఈ స్వరమునకు; ఏషాముద్రా = ఈ అనుజ్ఞాముద్ర గాను; ఏతస్మిన్ = ఈ ముద్రయందు; స్వరః = స్వరము, అనుజానన్నివ = అనుసరించి తెలియునట్లు వలె. స్థితః = ఉన్నది.

శ్లో॥ య ఏవం విదనుజ్ఞాత్మా ధ్యాయతి ప్రణవం స్వరమ్
సర్వేషామపి కామానాం స సమర్థయితా భవేత్ ॥ 20

యః = ఎవడు. ఏవం విత్ = ఇట్లు తెలిసి; ప్రణవ స్వరం = ప్రణవ స్వరమును; అనుజ్ఞాత్మా = అనుజ్ఞాత్మక మగుదానిని; ధ్యాయతి = ధ్యానము చేయునో; సః = వాడు; సర్వేషాం = సమస్తములగు, కామానామపి = కోరికలకు; సమర్థయితా భవేత్ = సమకూర్పగలవాడగును.

శ్లో॥ వాణీ శ్వాసశ్చ మిథునం స్వరేస్మిన్ప్రతి తిష్ఠతి
యఏవం విదిమం ధ్యాయేత్కామాప్తిస్తస్య నిశ్చితా 21

అస్మిన్ స్వరే = ఈ స్వరమున; వాణీ = సరస్వతియు (వాక్కును); శ్వాసః చ = శ్వాసయు; మిథునం = జంటయై; ప్రతితిష్ఠతి = ఉన్నది, యః = ఎవడు, ఏవం విత్ = ఇట్లు తెలిసి; ఇమం ధ్యాయేత్ = దీనిని ధ్యానించునో; తస్య = వానికి; కామాప్తిః = కోరికలు తీరుట, నిశ్చితా = నిశ్చయము.

శ్లో॥ సర్వేషామపి లోకానాం అస్మి న్ప్రసతమే స్వరే
నిష్ఠితః సతతం విద్వా నమృతత్వాయ కల్పతే 22

ఏది అవ్యక్తమగు జగదాశ్రయమగు స్వరమో అట్టి దానినే నిష్ఠాపరులు కోరుదురు. 18

వ్యాఖ్య : ఈ స్వరమునకు అనుజ్ఞాముద్ర అగుచున్నది. ఈ ముద్ర యందు స్వరము తెలియబడుచున్నట్లుండును. స్వరము ననుసరించి జ్ఞాన ముండును. జ్ఞానముచే అవి గ్రహింపబడుచుండును. కాన అనుజ్ఞ అను తీరు ఉన్నది. దీనికి అటులనే అని అంగీకారము తెలుపునప్పుడు ఉపయోగించు తీరు అనుజ్ఞాముద్ర అందురు. ఇది ఛాందోగ్యమున వివరింపబడినది. 19

వ్యాఖ్య : ఎవడు అనుజ్ఞాముద్ర నెరిగి ప్రణవ స్వరమును ధ్యానము చేయునో వాడు సమస్త కామముల నందించును. 20

వ్యాఖ్య : శ్వాస, వాక్కును జంటగా ఈ స్వరమున కలవు ఇట్లు తెలిసి ఎవడు దీనినుపాసించునో వానికి కోరికలు తీరును. 21

వ్యాఖ్య : అన్ని లోకములందు రసమగు ఈ స్వరమందు ఎవడు ఎప్పుడు నిష్ఠ చెందునో ఆ విద్వాంసుడు మోక్షము

సర్వేషాం అపి లోకానామ్ =అన్ని లోకములకు, రస తమే=రసమగు, అస్మిన్ స్వరే=ఈ స్వరమందు, సతతం=ఎల్ల ప్పుడు; నిష్ఠితః=నిష్ఠ చెందిన, విద్వాన్ విద్వాంసుడు, అమృత త్వాయ=మోక్షమునకు; కల్పతే=అగుచున్నాడు.

శ్లో॥ ఏషాక్షరోద్గీథ విద్యా సర్వవేదాన్త సంస్తుతా
ఉపాసకానాం బోధాయ యథావ దనుకీర్తితా 23

సర్వవేదాంత సంస్తుతా=అన్ని వేదాంతములచే నుతింప బడు: ఏష అక్షరోద్గీథ విద్యా=ఈ అక్షరోద్గీథ విద్య. ఉపాసకా నాం = ఉపాసకులకు: బోధాయ = తెలుపుటకు. యథావత్ = శాస్త్రోక్తమగు తీరున. అనుకీర్తితా=గానము చేయుబడినది

## 37. సంవర్గ విద్యాధికరణమ్

శ్లో॥ అథ సంవర్గ విద్యాయాః పద్ధతిం పరిచక్ష్మహే
రైక్వేణ జానశ్రుతయే దర్శితాయాః సయుగ్వనా 24

అథ=అనంతరమందు (మంగళాచరణము); సంవర్గ విద్యా యాః = సంవర్గ విద్యయొక్క; పద్ధతిం = ఉపాసనామార్గమును; యాః=ఏ సంవర్గ విద్య; సయుగ్వనా=యుగ్వతో కూడిన; రైక్వేణ= రైక్వునిచే. జానశ్రుతయే=జానశ్రుతియనువానికి: దర్శితా=చెప్ప బడినది. యాః=ఏదియో ఆ విద్యను; పరిచక్షతే=సంగ్రహముగా చెప్పెదను.

సందును. విద్వాన్ అనగా గురువు వలన లెస్సగా బ్రహ్మ విద్యను పొంది, శిక్షితుడై యథోక్తముగ ఆచరించువాడని వేదాంత పరిభాష. వాక్కు జ్ఞాన శక్తిశాఖా భేదము, శ్వాసము క్రియా శక్తి శాఖా భేదము. రెండింటి మేళనము ఇందు కలదు స్వరమున రస తమత్వము కలదనుటకు 'తస్మిన్నపో మాతరిశ్వా దధాతి' అను ఉపనిష ద్వచనము ప్రమాణము. శ్రీ రమణ భగవానుడు, దక్షిణామూర్తియు అనుజ్ఞ ముద్రను ప్రదర్శించిరి. 22

వ్యాఖ్య : ఈ అక్షరోద్గీథ విద్య వేదాంత శాస్త్రములందన్నిటను, నుతింపబడినది. ఉపాసకులకు తెలియుట్కై శాస్త్రోక్త ముగా తెలుపబడినది. వ్యానోద్గీథ విద్య కేవల శ్వాస విభూత్యాశ్రియమై జరుగునది ఇది శ్వాసయు, స్వర మును కలిసిన జంటయగు విభూతుల నాశ్రయించి జరుగు ఉపాసనము కేవలము ఓంకారమే ధ్యేయ మగును. క్రమముగ అమృతత్వము సిద్ధించును. 23

## 37. సంవర్గ విద్యాధికరణము

వ్యాఖ్య · జానశ్రుతికొరకు, రైక్వుడు ఏ విద్యను తెలిపెనో ఆ సం వర్గ విద్యను, ఉపాసనా పద్ధతిని చెప్పెదను. 24

శ్లో॥ ప్రాణస్య స్థూలశాఖాయాః ద్వారా వాయురుపాసనమ్ ।
ప్రోక్తా సంవర్గ విద్యేతి సర్వపుణ్యాత తే స్తులా । 25

ప్రాణస్య=ప్రాణముయొక్క; స్థూలశాఖాయాః=స్థూల శాఖ యొక్క; ద్వారా=ద్వారముగ; వాయోః=వాయువు యొక్క; ఉపాసనమ్=ఉపాసనము; సర్వపుణ్యాత తేః=సమస్తపుణ్యములకు; తులా=సరియగు; సంవర్గ విద్యేతి=సంవర్గ విద్య అని; ప్రోక్తా=చెప్పబడినది.

శ్లో॥ జానన్నేవ శ్వసే నిత్య మేతద్వాయో రుపాసనమ్
తదాస్యాచ్ఛక్తి సంపూర్ణా విజ్ఞానానుసృతా క్రియా 26

నిత్యం=ఎప్పుడును; జానన్నేవ=తెలిసి జ్ఞాపకము శ్వాస మీాదనే ఉంచుచు శ్వసేత్=శ్వాసను చేయవలెను. ఏతత్=ఇది; వాయోః=వాయువుయొక్క. ఉపాసనమ్=ఉపాసనము. విజ్ఞానానుసృతాక్రియా=విజ్ఞానముననుసరించుక్రియ; తదా=అప్పుడు; శక్తి సంపూర్ణా=శక్తిచే నిండినది. స్యాత్=అగును.

శ్లో॥ జ్ఞానక్రియా సమావేశాత్తేజసో మథనం భవేత్
ఊష్మాహి జాయతే తత్రసూక్ష్మోప్యధిక విక్రమః । 27

జ్ఞానక్రియా సమావేశాత్=జ్ఞానక్రియల సమావేశముచే; తేజసః=తేజస్సు యొక్క, మథనం=మథనము. భవేత్=అగును; తత్ర=ఆమథనమున; సూక్ష్మోపి=సూక్ష్మమైనదైనను; అధిక విక్రమః=గొప్ప విక్రమము కల; ఊష్మాహి=ఊష్మము; జాయతే=పుట్టును.

శ్లో॥ విభక్తం సర్వనాడీషు తేజో దేహస్య చాలకమ్
సూక్ష్మాం సుషుమ్నాం ప్రత్యేక మూష్మణా ప్రియతే తదా 28

సర్వనాడీషు = అన్ని నాడులందు; విభక్తం = వేరైన; దేహస్య = దేహమునకు; చాలకం = చలనహేతువగు, తేజః =

వ్యాఖ్య : ప్రాణముయొక్క స్థూలశాఖయగు ద్వారమున వాయువును ఉపాసించుట సంవర్గయగును. ఇది సర్వపుణ్యములకు సరియగునది. 25

వ్యాఖ్య : శ్వాసను గమనించుచు ధ్యానముతో శ్వసించుట వాయువుయొక్క ఉపాసనము. అప్పుడు విజ్ఞానానుసృతమగు క్రియా శక్తి సంపూర్ణమగును. 26

వ్యాఖ్య : జ్ఞానక్రియల సమావేశముచే తేజోమథనమగును. దానిచే సూక్ష్మమైన దయ్యు అధిక విక్రమము కల ఊష్మము కలుగును. 27

వ్యాఖ్య : సర్వనాడులందు దేహచాలకమగు ఆ తేజస్సు విభక్తమై

తేజస్సు ఊష్మణా=ఆ ఊష్మచే, సూక్ష్మాం సుషుమ్నాం=సూక్ష్మమగు సుషుమ్నను; ప్రత్యేకం=ప్రత్యేకముగ; హ్రియతే=పొందింప బడుచున్నది

శ్లో॥ ఏకీభూతంతు తత్తేజః సుషుమ్నాయాం మహత్తరమ్
స్థూలదేహా త్పృథగ్భూత మమృతత్వాయ కల్పతే 29

సుషుమ్నాయాం = సుషుమ్నయందు, ఏకీభూతం = ఏకీకృతమై; తత్తేజః = ఆ తేజస్సు, స్థూలదేహాత్ = స్థూలదేహము నుండి; పృథగ్భూతః = వేరయి, అమృతత్వాయ = దేహాత్మభావమునకు (మోక్షమునకును) కల్పతే=అగును.

శ్లో॥ ప్రాణస్యైవతు తత్తేజో ద్రవ్యం కిమపి నేతరమ్
విధాయ తత్పృథగ్దేహాన్నా నమృత్యు మవాప్నుయాత్ 30

తత్తేజః=ఆ తేజము; ప్రాణస్య ఏవతు=ప్రాణసంబంధమైనది; ఇతరం=ఇతరము. న=కాదు; కిమపి ద్రవ్యం=అనిర్వచనీయమగు ద్రవ్యము; తత్=అది. దేహాత్ = దేహమునుండి; పృథక్, విధాయ=వేరుచేసి, మృత్యుం=మరణమును. నా=మానవుడు: న అవాప్నుయాత్ =పొందడు.

శ్లో॥ దేహే సంసారిణ స్తేజః సైన్ధవం సలిలేయథా
నవనీతం యథా తక్రే శరీరే యోగినో మహః 31

సంసారిణః దేహే=అజ్ఞానుల దేహమందు; తేజః=ఆ తేజము. సలిలే=నీటియందు. సైన్ధవం యథా=ఉప్పువలె కలిసి యుండును. నవనీతం యథా తక్రే=మజ్జిగయందు వెన్నవలె, యోగినః దేహే=యోగులయొక్క దేహమున: మహః=తేజము ఉండును.

ఊష్మచే సూక్ష్మమగు సుషుమ్నను పొందింపబడు
చున్నది. 28

వ్యాఖ్య : ఆ తేజము సుషుమ్నయందు ఏకీభవించి స్థూలదేహము
నుండి వేరయి దేహాత్మభావమును కలిగించును. 29

వ్యాఖ్య : దేహము మరణించినచో దేహాభిమాని మరణించును.
దేహమునుండి ప్రాణము ( శ్రేష్ఠము ) వేరైననాడు
ప్రాణమునకు ఉత్క్రాంతి దేవతాభావము ఉన్నది.
కాన వానికి నాశము లేదు.. అది ఆత్మకు శరీరమని
పూర్వము చెప్పబడినది. దీనినే విద్యచే అమృతత్వము
నందునని ఉపనిషత్తు చెప్పుచున్నది. 'విద్యయామృత
మశ్నుతే', దేహాభిమాని మరణించిన ప్రజ్ఞను నశింప
జేయు అసూర్య లోకములను చెందునని ఉపనిషత్తు
తెలుపును కావుననే దేహమునుండి వేరైన దివ్య
రూపమగు ప్రాణతేజము దేహమునుండి వేరై మరణ
మును పొందనీయదు 30

వ్యాఖ్య : సంసారులందా తేజము నీటిలోఉప్పు కలిసి ఉన్నట్లుండును
యోగుల దేహమందది మజ్జిగయందు వెన్నవలె
వేరగును. 31

శ్లో॥ నవనీతం యథా తక్రే యచ్ఛరీరే నిజం మహః
అపరికంప్య స్వశారీరైః సుఖదుఃఖైర్న లిప్యతే 32

యత్ శరీరే=ఎవని శరీరమందు: నిజంమహః=తన తేజము యథా=ఏ విధముగా, తక్రేనవనీతం=మజ్జిగయందు వెన్నవలె వేరై యుండునో; సః=అతడు: శారీరైః=శరీర సంబంధమైన; సుఖదుఃఖైః=సుఖదుఃఖములచే. అపరికంప్య=పరికంపనములు లేనివాడై (చలించని వాడై); నలిప్యతే=స్పృశించబడక ఉండును.

శ్లో॥ అగ్నిజ్వాలావదేతస్య సంకల్పః సుమహాద్యుతిః
దేవసంకల్పవన్మోఘో న భవిష్యతి కర్హిచిత్ 33

అగ్నిజ్వాలావత్ =అగ్నిజ్వాలవలె. ఏతస్య=వీని, సంకల్పః=కోరిక, సుమహాద్యుతిః=మంచి గొప్పదైన తేజస్సుకలదై; దేవసంకల్పవత్ =దైవ సంకల్పమువలె. మోఘః=వ్యర్థమైనది; కర్హిచిత్ =ఎప్పుడు: న భవిష్యతి=కాదు.

శ్లో॥ ముఖ్యప్రాణోద్గీథ విద్యా ప్రాణ విద్యా చ విశ్రుతా
అత్ర సంవర్గ విద్యాయా మన్తర్భూతే స్వరూపతః । 34

ముఖ్యప్రాణోద్గీథ విద్యా=ముఖ్యప్రాణమునకు సంబంధించిన ఉద్గీథ విద్య, ప్రాణవిద్యాచ=వాయు ఉపాసనకు సంబంధించిన ప్రాణవిద్యయు, విశ్రుతాః=ప్రసిద్ధిచెందినవి; అత్ర సంవర్గ విద్యాయాం=ఈ సంవర్గ విద్యయందు; స్వరూపతః=స్వరూపముచే; అంతర్భూతే=అంతర్భాగములైనవి.

శ్లో॥ సర్వేషామపి పాపానాం ఇతర ప్రాణ జన్మనామ్
అన్తశ్చర న్మాతరిశ్వా వధ్యస్థాన ముదీర్యతే । 35

ఇతరప్రాణ జన్మనామ్=వాయుశాఖ కన్న ఇతరములగు ప్రాణములచే చేయబడిన; సర్వేషామపి పాపానాం=అన్ని పాపములకు; అంతశ్చరన్ =లోపల సంచరించు: మాతరిశ్వా=వాయువు; వధ్యస్థానమ్=కొరత కొయ్య అని; ఉదీర్యతే=చెప్పబడుచున్నాడు.

వ్యాఖ్య ఎవని శరీర మందతని తేజస్సు మజ్జిగయందు వెన్నవలె వేరై యుండునో అతడు శరీరసంబంధమైన ప్రకంపనములు లేనివాడై, సుఖ దుఃఖముల కతీతుడై ఉండును. 32

వ్యాఖ్య : అగ్ని జ్వాలవలె మంచికాంతిగల ఈతని సంకల్పము దేవ సంకల్పమువలె ఎప్పుడును వ్యర్థముకాదు. 33

వ్యాఖ్య : ప్రసిద్ధమైన ముఖ్యప్రాణోద్గీథ విద్య, ప్రాణవిద్య అను రెండును ఈ సంసర్గ విద్యయందు అంతర్భావమును పొందినవి 34

వ్యాఖ్య : శ్రేష్ఠప్రాణశాఖలచే చేయబడు పాపములన్నింటికి, ప్రాణరూపుడగు (సూత్రాత్మ) మాతరిశ్వుడు వధ్య స్థానమని చెప్పబడుచున్నాడు వానిచే అపహృత పాపుడని భావము. 35

శ్లో॥ స్థితిరుద్గీథ విద్యాయా మన్తర్యానాదుపాసితుః
సైవాత్రాపి స్థితిః శ్వాస స్వరయో రల్పభేదతః 36

శ్వాస స్వరయోః=శ్వాసకు, స్వరమునకు: అల్పభేదతః=భేదము స్వల్పమగుటచే, ఉద్గీథ విద్యాయాం=ఉద్గీథ విద్యయందు; యత్ =ఏద; అంతరాస్యాత్ =లోపలిది అగునో. సైవ=అదియే; అత్ర అపి స్థితిః=ఇక్కడ కూడ స్థితియగును.

శ్లో॥ అన్తః స్వరం విజానాతి యమేవాక్షర చిన్తకః
తం వాయుం మన్యతే విద్వా న్సంవర్గోపాసకః కృతీ 37

అక్షరచిన్తకః=అక్షరస్వరోపాసకుడు: యం ఏవ అన్త స్వరం=ఏ అక్షర స్వరమును: విజానాతి=తెలియునో. తమేవ=దానినే: కృతీ=ధన్యుడగు; సంవర్గోపాసకః=సంవర్గోపాసకుడు; వాయుం=వాయువునుగ; మన్యతే=తలచును.

శ్లో॥ ఆరంభే లక్ష్యభేదేన విద్యాభేదః ప్రకీర్తితః
ఉపాసనేతు గంభీరే శ్వాసః స్వరమయోభవేత్ 38

ఆరంభే=ప్రారంభమునః లక్ష్యభేదేన=లక్ష్యభేదముచే; విద్యాభేదః=విద్యాభేదము; ప్రకీర్తితః=చెప్పబడినది; గంభీరే ఉపాసనేతు=గంభీరమగు, ఉపాసనమునందు: శ్వాసః=శ్వాసము; స్వరమయో భవేత్ =స్వరరూపమగును.

శ్లో॥ ఇతి సంజీవినీ విద్యా సర్వపాప ప్రణాశినీ ।
ప్రతిమా సర్వపుణ్యానాం యథావదనుకీర్తితా । 39

సర్వపాప ప్రణాశినీ=సమస్త పాపహారియు; సర్వపుణ్యానాం ప్రతిమా=సమస్త పుణ్యములకు ఉద్దియగు: సంజీవినీ విద్యా=సంజీవినీ అను పేరుగల సంవర్గ విద్య; యథావత్ =శాస్త్రోక్తముగ: అనుకీర్తితా=గానము చేయబడినది.

వ్యాఖ్య : శ్వాస స్వరములకు భేదమల్పమగుటచే ఉద్గీథవిద్యయందు ఏ స్థితిలోపల దిగునో అదియే ఇందును అగును. 36

వ్యాఖ్య : ఉద్గీథోపాసకుడు అంతర స్వరమని దేనిని ధ్యానించునో, సంవర్గ విద్యోపాసకుడు దానినే వాయువని ఉపాసించును. 37

వ్యాఖ్య : ప్రారంభమున భేదముండుటచే విద్యాభేదము చెప్పబడినది. కాని గంభీరోపాసనమున శ్వాసము స్వరమయమగును. 38

వ్యాఖ్య : సమస్త పాప వినాశియు, సర్వపుణ్యా సమాహారము అగు సంజీవనీ విద్య అను పేరుగల ఈ సంవర్గ విద్య శాస్త్రోక్తమైనదిగ గానము చేయబడినది. 39

# 38. జ్యోతిర్విద్యాధికరణమ్

శ్లో॥ తీవ్రనిర్విషయధ్యానా దుద్దీప్తం జ్యోతిరాన్తరమ్
ఊష్మద్వారాను సందధ్యా జ్జ్యోతిర్విద్యేయ ముచ్యతే॥ 40

తీవ్రనిర్విషయధ్యానాత్ =తీవ్రమగు విషయరహితధ్యానముచే; అంతరం=లోపలి, జ్యోతిః=జ్యోతి, ఉద్దీప్తం=వెలిగింపబడిన దానిని: ఊష్మద్వారా=ఊష్మముచే; అను సందధ్యాత్ = అనుసంధింప వలెను. ఇయం=ఇది జ్యోతిర్విద్యా ఉచ్యతే= జ్యోతిర్విద్య అని చెప్పబడుచున్నది.

శ్లో॥ యద్యప్యన్యాసు విద్యాసు దీప్తం స్యాజ్జ్యోతి రాంతరమ్
తథాపి లక్ష్యమత్ర స్యా దూష్మద్వారేత్యసౌ భిదా 41

అన్యాసు విద్యాసు = ఇతర విద్యల యందు; అంతరం జ్యోతిః = అంతరమగు వెలుగు, యద్యపి దీప్తం స్యాత్ = దీప్తి నందినప్పటికి, తథాపి = అట్లయ్యును; అత్ర = ఈ విద్యయందు; ఊష్మద్వారా=ఊష్మముఖముగ; ఇతి=అగునని. అసౌ భిదా= ఇది భిన్నమగుచున్నది.

శ్లో॥ అంధో హస్తేన సంస్పర్శా త్సాక్షాత్కుర్యా ద్యథానలమ్
ఏవమూష్మాను సంధానా త్పశ్యేన్నా జ్యోతిరాంతరమ్ 42

అంధః=గుడ్డివాడు, హస్తేన=హస్తముచే; సంస్పర్శాత్ = స్పర్శచే; అనలం = అగ్నిని; యథా = ఏ విధముగ, సాక్షాత్కుర్యాత్ = తెలిసికొనునో, ఏవం=ఈ విధముగ; ఊష్మాను సంధానాత్ =ఊష్మయొక్క అనుసంధానముచే, నా=మానవుడు: అంతరం జ్యోతిః=లోపలి వెలుగును; పశ్యేత్ =చూచును.

శ్లో॥ ఏవం స్వరానుసంధానా చ్ఛృణుయా జ్జ్యోతి రాంతరమ్
ఉద్గీథ విద్యా సందర్భే స్వరధ్యానం ప్రకీర్తితమ్ 43

ఏవం=ఈ తీరున; స్వరాను సంధానాత్ =స్వరసంధానముచే; అంతరంజ్యోతిః=లో వెలుగును; శృణుయాత్ =విన

## 38. జ్యోతిర్విద్యాధికరణము

వ్యాఖ్య: తీవ్రమగు విషయరహిత ధ్యానముచేత అంతరమైన జ్యోతి ఉద్దీప్తమగును. ఊష్మముచే ఆ జ్యోతిని అను సంధానము చేయుటను జ్యోతిర్విద్య యందురు. 40

వ్యాఖ్య: ఇతర విద్యలందును అంతర జ్యోతి దీప్తమగును. అట్లయ్యును ఊష్మద్వారముగ నిదియగును. అందుచే ఇది భిన్నమగుచున్నది. 41

వ్యాఖ్య: గుడ్డివాడు చేతిస్పర్శచే అగ్నిని తెలియునట్లు, మానవుడు ఊష్మాను సంధానముచే లో వెలుగును ఈ విద్య యందు గాంచును. 42

వ్యాఖ్య: ఇరిదు స్వరాను సంధానముచే అంతరజ్యోతి వినగును.

వలెను. ఉద్గీథ విద్యాస-దర్భే=ఉద్గీథ విద్యయందు; స్వరధ్యానం= స్వరధ్యానము, పరికీర్తితమ్= చెప్పబడినది.

శ్లో॥ ఇతి విద్యాత్రయం ప్రోక్తం మధ్యమో యాసు దేవతా ।
ఆకాశే వైభవాత్క్రీడ న్రుద్రవాతేన్ద్ర నామభిః 44

యాసు=ఏ విద్యలందు, ఆకాశే=ఆకాశమున; రుద్రవాతేన్ద్ర నామభిః=రుద్రుడు, వాయువు, ఇంద్రుడు అను నామములచే; వైభవాత్ = ఆత్మవైభవముచే; క్రీడన్ = క్రీడించుచున్న; మధ్యమః = మధ్యముడు; దేవతా = దేవతయో; ఆ విద్యాత్రయం = మూడు విద్యలు: ఇతి=ఇట్లు, ప్రోక్తం = చెప్పబడినవి.

## 39. భూమ విద్యాధికరణమ్

శ్లో॥ వికారజాతం విశ్వస్మి న్నామరూపాత్మకం తు యత్ ।
తదంశస్య పరిత్యాగా త్పశ్యేత్స దఖిలం జగత్ । 45

విశ్వస్మిన్=జగమునందు; తత్ నామ రూపాత్మకం=ఆ నామ రూపాత్మకములగు, వికారజాతం=వికృతిని: తదంశస్య= ఆ వికారముయొక్క; పరిత్యాగాత్ =విడచుటచే; అఖిలం జగత్ = సమస్తజగత్తు, సత్ =సత్పదార్థమై: పశ్యేత్ = చూచును.

శ్లో॥ స్థితౌ స సంప్రసన్నాయాం స్థితః సర్వవికల్పజిత్
భేద బుద్ధిం మహాఘోరాం జయే త్సంసార కారిణీమ్ ॥ 46

సర్వవికల్పజిత్ =అన్ని వికారములను జయించిన, సః= వాడు; సంప్రసన్నాయాం=ప్రసన్నమైన, స్థితౌ=స్థితియందు, స్థితః=ఉన్నవాడై: సంసార కారిణీమ్=అవిద్యాకారణమగు: భేద బుద్ధిం=భేదబుద్ధిని. మహాఘోరాం=ఘోరమగుదానిని. జయేత్ = జయించవలెను.

ఉద్గీథ విద్యయందు స్వరధ్యానము చెప్పబడినది. 43

వ్యాఖ్య : ఆకాశమున రుద్రవాయు ఇంద్రనామములచే క్రీడించుచున్న ఒకే మధ్యమ దేవుడు ఏ విద్యలందు ధ్యేయ దైవమో ఆ మూడు విద్యలు ఇట్లు తెలుపబడినవి. 44

## 39. భూమ విద్యాధికరణము

వ్యాఖ్య : ఈ జగము నామరూపాత్మకము. అందు వికారాంశను విడిచి చూచినచో అంతట సత్పదార్థము కానగును. 45

వ్యాఖ్య : అన్ని వికల్పములు జయించినవాడు సంప్రసన్నమగు స్థితియందున్నవాడై సంసార కారణమగు ఘోరమగు ఆ భేదబుద్ధిని విడిచి సత్పదార్థము నంతట చూడవలెను. 46

శ్లో॥ సంప్రోక్తా భూమవిద్యేయం పూర్ణానుభవదాయినీ
వర్ణయామాస యాం స్కందో నారదాయ మహర్షయే ॥ 47

పూర్ణానుభవదాయినీ=పూర్ణానుభవమునిచ్చు, ఇయం భూమ విద్యా=ఈ భూమవిద్య, నారదాయ మహర్షయే= నారద మహర్షి కొరకు; యాం=దేనిని; స్కందః=కుమారస్వామి; వర్ణయామాస=చెప్పెనో అది; సంప్రోక్తా=చెప్పబడినది

శ్లో॥ ఆత్మానం సర్వభూతేషు సర్వభూతాని చాత్మని
భూమ్నస్తు శీలయ న్విద్యా మభేదేన నిరీక్షతే 48

ఆత్మానం = తనను, సర్వభూతేషు = అన్ని భూతము లందును; సర్వభూతాని=అన్ని భూతములను; ఆత్మని=తన యందును; భూమ్నఃతు శీలయన్ = భూమ వలన చూచుచు; అభేదేన=అభేదముచే, విద్యాం నిరీక్షతే=విద్యను చూచును.

శ్లో॥ తస్య సర్వమిదం మిథ్యా నామరూపాత్మకం జగత్
సత్యరూప మధిష్ఠానం స్వాత్మరూపం ప్రభాసతే ॥ 49

తస్య=వానికి, నామరూపాత్మకం జగత్=నామ రూపాత్మక మగు జగత్తు; మిథ్యా=అధ్యాసరూపము. సత్యరూపం=సత్యరూప మగు; అధిష్ఠానం స్వాత్మ రూపం = జగదధిష్ఠానమగు ఆత్మ రూపము. ప్రభాసతే=కానవగును

శ్లో॥ ఏతమేవ మహావిద్యాం భగవాంచ్ఛంకరో గురుః
ఉపాదిశ త్స్వశిష్యేభ్యో భేదబుద్ధిం విమర్దయన్ ॥ 50

ఏతామేవ=ఈ, మహావిద్యాం=గొప్ప విద్యను; భగవాన్ శంకరః గురుః=జగద్గురువగు శంకర భగవత్పాదులు; భేదబుద్ధిం= భేద భావమును; విమర్దయన్=తొలగించుచు; స్వశిష్యేభ్యః= తన శిష్యులకు; ఉపాదిశత్=ఉపదేశించెను.

వ్యాఖ్య : స్కందుడు నారదునకే భూమవిద్యను చెప్పెనో ఆ భూమవిద్య పూర్ణానుభవము నిచ్చును. 47

వ్యాఖ్య : సర్వభూతము లందు తనను, తన యందు సర్వ భూతములను ఎవడు చూచునో వాడభేదముచే అంతను చూచును. 48

వ్యాఖ్య : వానికీ జగత్తు నామ రూపాత్మకమగునది అధ్యాసము. సత్యమగు ఆత్మ స్వరూపము కానగును. 49

వ్యాఖ్య : జగద్గురువగు శంకర భగవత్పాదులు ఈ విద్యను తన శిష్యుల కుపదేశించెను. దీనిచే భేద భావము తొలగి ఆత్మానుభూతి కలుగును. 50

# 40. శాండిల్య విద్యాధికరణమ్

శ్లో॥ జాయతే విశ్వ మీశానా దీశానే ప్రతితిష్ఠతి
ఈశానే లీయతే చాన్తే తస్య కర్మ మహత్తరం 51

విశ్వం=జగత్తు. ఈశానాత్ జాయతే = ఈశ్వరుని వలన కలుగుచున్నది. ఈశానే ప్రతితిష్ఠతి = ఈశ్వరునియందే నిలిచి యున్నది, అంతే=తుదకు; ఈశానే లీయతే=ఈశ్వరుని యందు లయమగును. తస్య కర్మ = వాని పని; మహత్తరం = మిక్కిలి గొప్పది.

శ్లో॥ తస్యేదం భువనం కార్యం తదుపాదానకం స్మృతమ్
భిన్నం వికారై ర్వివిధై రపి తస్మా న్నభిద్యతే 52

ఇదం భువనం = ఈ జగత్తు; తస్య=ఈశ్వరుని; కార్యం= కర్మచేనైనది; తదుపాదానకం=అతడే ఉపాదాన కారణముగా కలది అని, స్మృతమ్ = చెప్పబడినది; వివిధైః వికారైః అపి= అనేక వికారములచే; భిన్నం = వేరైనది; తస్మాత్ =అందుచే; నభిద్యతే=ఉపాదానమగు ఈశ్వరునికన్న భిన్నముకాదు.

శ్లో॥ సోఽణీయాంశ్చ మహీయాంశ్చ స్వరూపా ద్వైభవా త్తథా
శాన్త ఏవ ముపాసీత సర్వత్ర సమదర్శనః 53

స్వరూపాత్ = స్వరూపముచే; సః = అది; అణీయాన్= అణువుకన్న చిన్నది; వైభవాత్ =వైభవముచే; మహీయాంచ= గొప్పదియు అగును; ఏవం = ఈ విధముగ; సర్వత్ర=అంతట; సమదర్శనః=సమబుద్ధి కలవాడై; శాన్తః = నిర్వికారుడై, ఉపాసీత=ఆరాధింపవలెను.

శ్లో॥ మతిస్తు భూమవిద్యా యా మభేదానుభవాత్మికా
విద్యాయాం మత్ర తు మతిర్విభూ త్యనుభవాత్మికా 54

## 40. శాండిల్య విద్యాధికరణము

వ్యాఖ్య : ఈ జగత్తు ఈశ్వరుని వలన పుట్టి, అందే ఉండి అందే లయమగును. వాని కర్మ గొప్పది. 51

వ్యాఖ్య · ఈ జగత్తునకు, ఈశ్వరునకు కార్యకారణ భావము సంబంధము. ఈశ్వరుడు ఉపాదాన కారణము. కాన జగత్తు వికారములచే నానావిధములుగ ఉన్నను ఉపాదాన కారణమగు ఈశ్వరునికన్న భిన్నము కాదు 52

వ్యాఖ్య : స్వరూపము అనగా సత్తు అణీయము, వైభవముచే మహీయము అని అంతట సమదర్శియై ఉపాసింపవలెను. 53

వ్యాఖ్య : భూమ విద్యయందు మతి అభేదానుభవాత్మకము.

భూమ విద్యాయామ్=భూమవిద్యయందు, మతిః = బుద్ధి అభేద అనుభవాత్మికా = అభేదానుభవము కలది, అత్రతు విద్యాయామ్=ఈ విద్యయందుః మతిః=బుద్ధి; విభూత్యనుభవాత్మికా=విభూత్యనుభవ రూపమైనది.

శ్లో॥ వికారాంశ పరిత్యాగా చ్ఛేషో భూమా ప్రకీర్తితః
వికారాణాం విభూతిత్వ బుద్ధ్యాత్రో పాసనం మతమ్ ॥ 55

వికారాణాం=వికారములకు; విభూతిత్వ బుద్ధ్యా = విభూతులు అను బుద్ధితో; అత్ర=ఇందు; ఉపాసనం మతమ్=ఉపాసన మంగీకరింపబడినది; వికారాంశ పరిత్యాగాత్ =వికారాంశ విడుటచే, శేషః=మిగిలినది: భూమా ప్రకీర్తితః=భూమ అని చెప్పబడినది.

శ్లో॥ శిల్పం విచిత్ర మాలోక్య యథా నా స్తౌతి శిల్పినమ్
జగద్వీ క్ష్యైవమీశానం స్తౌతి విద్యామిమాం శ్రితః ॥ 56

విచిత్రం=చిత్రమగు, శిల్పం=శిల్పమును; ఆలోక్య= చూచి; శిల్పినమ్=శిల్పిని; యథాస్తౌతి=ఎట్లు నుతించుచుండునో; ఏవం=ఆ విధముగ; జగత్ =జగత్తును; వీక్ష్య=చూచి; ఈశానం=ఈశ్వరుని; ఇమాం విద్యాంశ్రితః = ఈ విద్యను ఆశ్రయించినవాడు (ఈ విద్యోపాసకుడు) స్తౌతి=నుతించును.

శ్లో॥ ఇయం ప్రదర్శితా విద్యా శాండిల్యేన మహర్షిణా ।
భవే దిమాం శ్రితో విద్యామన్తే పూర్ణానుభూతిమాన్ ॥ 57

ఇయంవిద్యా=ఈ విద్య, శాండిల్యేన మహర్షిణా=శాండిల్యుడను మహర్షి చే; ప్రదర్శితా=తెలుపబడినది. ఇమామ్ విద్యాం= ఈ విద్యను; శ్రితః = ఆశ్రయించినవాడు; అంతే = కడపట, పూర్ణానుభూతిమాన్ భవేత్ =పూర్ణానుభూతి గలవాడగును.

ఇందు విభూత్యనుభవాత్మకము. 54

వ్యాఖ్య : వికారాంశని విడిచినది భూమ. దాని ఉపాసనయే భూమ విద్య వికారములందు విభూతిత్వ బుద్ధిచే ఉపాసనము శాండిల్య విద్య యగును. 55

వ్యాఖ్య : సుందర శిల్పమును చూచి శిల్పిని మెచ్చు విధముగా జగత్తునందలి విశిష్టతను గాంచి ఈశ్వరుని నుతించుట ఈ విద్యోపాసకుని లక్షణము. 56

వ్యాఖ్య : ఈ విద్య శాండిల్య మహర్షిచే ప్రదర్శింప బడినది. దీని నాశ్రయించిన పూర్ణానుభవము కలుగును. 57

# 41. భృగు విద్యాధికరణమ్

శ్లో॥ పరిత్యజ్య సదా దుఃఖ మానందానుభవాత్మికా
స్థితిర్నిర్విషయాపేక్షా భృగువిద్యా ప్రకీర్తితా 58

దుఃఖం=దుఃఖమును; పరిత్యజ్య=విడిచి, సదా=ఎప్పుడును; ఆనందానుభవాత్మికా=ఆనందము ననుభవించు రూపమైన, నిర్విషయాపేక్షా=విషయాపేక్ష లేని, స్థితిః=ఉనికి; భృగువిద్యా=భృగు విద్య యని; ప్రకీర్తితా=చెప్పబడినది.

శ్లో॥ ఈశస్యానన్ద రూపత్వాదీశే స ప్రతితిష్ఠతి।
యోనిరన్తర మానందే యుక్తాత్మా సుస్థితో జనః॥ 59

ఈశస్య=ఈశ్వరుని యొక్క; ఆనంద రూపత్వాత్=ఆనంద రూపుడగుటచే; యః=ఎవడు, నిరన్తరం=ఎల్లప్పుడు; ఆనందే యుక్తాత్మా=ఆనంద యుక్తుడై; సుస్థితః=లెస్సగా ఉండునో; సః జనః=ఆ జనుడు; ఈశే=ఈశ్వరునందే; ప్రతితిష్ఠతి=నిలకడ చెంది ఉండును

శ్లో వరుణస్యోపదేశేన భృగుర్నామ మహానృషిః
తపసా భూయసా బ్రహ్మ సుఖ రూపం వ్యలోకయత్ 60

భృగుఃనామ మహాన్ ఋషిః=భృగుడను మహర్షి: వరుణస్య=వరుణుని, ఉపదేశేన=ఉపదేశమువలన: భూయసా తపసా=గొప్ప తపస్సుచే, సుఖరూపం బ్రహ్మ = ఆనంద రూపమగు బ్రహ్మను వ్యలోకయత్=చూచెను.

శ్లో॥ ఆనందే తద్దృఢానిష్ఠా భృగు విద్యా ప్రకీర్త్యతే
నిష్ఠితో భృగువిద్యాయాం బ్రహ్మానందం సమశ్నుతే। 61

ఆనందే=సుఖమందు, దృఢానిష్ఠా=అచంచలమగు నిష్ఠ; భృగువిద్యా=భృగువిద్య అని: ప్రకీర్త్యతే=చెప్పబడుచున్నది భృగువిద్యాయాం=భృగువిద్యయందు; నిష్ఠితః=నిష్ఠ చెందినవాడు; బ్రహ్మానందం=బ్రహ్మానందమును: సమశ్నుతే=పొందును.

## 41. భృగు విద్యాధికరణము

వ్యాఖ్య · దుఃఖములను విడిచి ఎల్లప్పుడును ఆనందానుభవాత్మకమగు నిర్విషయాపేక్ష స్థితి భృగువిద్య అనబడును. 58

వ్యాఖ్య ఈశ్వరుడు ఆనంద స్వరూపుడు కావున నిరంతరము ఆనందమయ స్థితియందు ఉన్నవాడు ఈశ్వరునందే నిష్ఠితు డగును 59

వ్యాఖ్య : భృగువను మహర్షి వరుణోపదేశముచే తపస్సు చేసి ఆనంద రూపుడగు బ్రహ్మను గాంచెను 60

వ్యాఖ్య : ఆనందమున ఖండముగ స్థిరము చేసికొని యుండుటయే భృగువిద్య, ఇది నిర్విషయకము కావలెను దాని యందు నిష్ఠ చెందిన వాడు బ్రహ్మానందమును అనుభవించును. 61

శ్లో॥ ద్వేముద్రే భృగువిద్యాయాం రహస్యే పరికీర్తితే
ఇన్ద్రియోనా దృష్టిరేకా దృష్టిర్జిహ్వారసే పరా 63

భృగువిద్యాయాం=భృగువిద్యయందు ద్వే ముద్రే=రెండు ముద్రిలు రహస్యే=రహస్యమైనవి. పరికీర్తితే=చెప్పబడినవి. ఇన్ద్రియోనా=కొండనాలుక యందు దృష్టిః=బుద్ధినిలుపుట, ఏకా=ఒకటి జిహ్వారసే=నాలుకయందగు తడియందు దృష్టిః=బుద్ధినిలుపుట, పరా=రెండవదియగును

## 42. ఉపకోసల విద్యాధికరణమ్

శ్లో॥ సత్యకామాత్తు జాబాలాద్యాం విద్యా ముపకోసలః
లబ్ధవా నుత్తమాం గోప్యాం తాం వక్ష్యామి స్వరూపతః 63

సత్యకామాత్తు జాబాలాత్=జాబాలియగు సత్యకాముని వలన ఉత్తిమాం, యాం విద్యాం=ఉత్తమమైన ఏ విద్యను ఉపకోసలః=ఉపకోసలుడు, లబ్ధవాన్=పొందెనో తాం గోప్యాం=ఆరహస్యమగు విద నను, స్వరూపతః=స్వరూపముతో వక్ష్యామి=చెప్పెదను

శ్లో॥ జీవాత్మనో జాగరితే స్థానం నయనమండలమ్
ద్రష్టారం తత్ర గృహ్ణీయా త్తేజోరూప ముపాసకః 64

జీవాత్మనః=జీవాత్మకు, నయనమండలం=నేత్రమండలము జాగరితే=జాగ్రదవస్థయందు స్థానం=స్థానము, ఉపాసకః=సాధకుడు, తత=అక్కడ తేజోరూపం ద్రష్టారం=జ్యోతిస్వరూపుడగు ద్రష్టను, గృహ్ణీయాత్=గ్రహింపవలెను

శ్లో॥ సంసారీ విషయాన్పశ్చేద నాలక్ష్యైవ సాక్షిణమ్
దర్శనే దర్శనే జ్ఞానీ సాక్షిణి ప్రతితిష్ఠతి 65

సాక్షిణమ్=నేత్రమండల మందైన సాక్షిపురుషుని, అనాలక్ష్యైవ=చూడకయే, సంసారీ=అజ్ఞాని, విషయాన్=దృశ్యము

వ్యాఖ్య భృగువిద్యయందు రెండు మూదిలు రహస్యమైనవి చెప్పబడుచున్నవి ఒకటి కొండనాలుకయందు బుద్ధి నుంచుట సేందరియోనిః స ఏవ స్తన ఇవా... అసు శుతి జిహ్వారసమందు దృష్టినుంచుట రెండవది 62

## 42. ఉపకోసల విద్యాధికరణము

వ్యాఖ్య సత్యకాముడగు జాలి ఏ విద్యను స్వరూపముతో ఉపకోసలునకు చెప్పెనో ఆ రహస్యమైన ఉత్తమమైన విద్యను చెప్పెదను 63

వ్యాఖ్య జాగ్రదవస్థయందు నేత్రమందలి జీవాత్మకు స్థానము ఉపాసకుడు అక్కడ తేజోరూపుడగు దృష్టను చూడవలెను.

వ్యాఖ్య అజ్ఞాని విషయములను చూచుచున్నప్పుడు విషయాసక్తుడై సాక్షిని మరచియుండును జ్ఞాని విషయములను చూచుచున్నపుడు విషయములందాసక్తుడుకాక దష్టయగు సాక్షియందు నిష్ఠకలిగియుండును నేత్రమందలి మందేను సాక్షి

లను; పశ్యేత్ = చూచును, జ్ఞానీ = జ్ఞానవంతుడు; దర్శనే దర్శనే = ప్రతిదృశ్య విషయములను చూచునప్పుడు. సాక్షిణి = నేత్రమండల మందైన పురుషునందు. ప్రతితిష్ఠతి = నిషితుడగును.

శ్లో॥ యః సాక్షిణి సదాతిష్ఠే దృశ్యే సంగ వివర్జితః
సోఽన్తతో దేవయానేన పథోర్ధ్వం యాతి విష్టపమ్ 66

యః = ఎవడు, దృశ్యే సంగవివర్జితః = దృశ్యమందు ఆసక్తి లేక, సాక్షిణి = సాక్షియందు, సదా = ఎల్లప్పుడు; తిష్ఠేత్ = నిల్చునో; అన్తతః = తుదను, దేవయానేన పథ = దేవయాన మార్గముచే, ఊర్ధ్వం విష్టపం యాతి = ఉత్తమ లోకములనందును.

శ్లో॥ సూర్యమండల సంస్థేన చక్షుర్మండల వర్తినః
అభేదమాహు ర్విద్వాంసో విద్యాంగం సచ నిశ్చయః 67

సూర్యమండల సంస్థేన = సూర్యమండలమందగు పురుషునితో, చక్షుర్మండల వర్తినః = నేత్రమండలమం దగువానికి; అభేదం = భేదము లేకుండుటను; విద్వాంసః = పండితులు; ఆహుః = చెప్పుదురు; సచ = అది; విద్యాంగం = విద్యకు అంగము; నిశ్చయః = నిశ్చయము.

శ్లో॥ యస్తేజః పశ్యకం ధ్యాయే త్పూరుషం సహిరణ్మయమ్
అక్షిమండల మధ్యస్థ మావిశే న్నైవ సంశయః 68

యః తేజః పశ్యకం = ఎవడు తేజస్సును చూచుచున్న; హిరణ్మయం పూరుషం = సూర్యమండల వాసియైన హిరణ్మయ

పురుషుడు జాగ్రదవస్థయందు మాత్రమగును, కాన నాతడు ప్రత్యేకముగ హృదయాంతరవర్తికన్న భిన్నుడు కాడు. కాననే ఆతడు ద్రష్ట అగుచున్నాడు. ఆత్మకన్న ఇతరమగు ద్రష్ట లేడు కాన నేత్రమండల వాసి భిన్నుడని భావింపరాదు. నేత్రమండల వాసియగువాడు, సూర్యమండలవాసి కన్న భిన్నుడు కాడని తరువాత తెలియును. బ్రహ్మాండానుభవమునకు, సూర్యమండల వాసి హేతువని పూర్వము వివరింపబడినది వ్యక్తి నేత్రమండలవాసి దృశ్యానుభవ హేతువని భావము 65

వ్యాఖ్య: ఎవడు దృశ్యములయందు సంగములేక సాక్షియందు నిలుచునో వాడు దేహాంతమున దేవయాన మార్గముచే ఊర్ధ్వలోకముల నందును. 66

వ్యాఖ్య సూర్యమండలవాసియు నేత్రమండలవాసియు ఒక్కడే అగుచున్నారు. ఆ అభేదమే విద్యాంగమనుట నిశ్చయము. 67

వ్యాఖ్య: సూర్యమండలవర్తియు, నేత్రమండలవర్తియు ఒక్కడే కాన ఇందెవరిని చూచుచున్నను రెండవ వానియందగు నిష్ఠకూడ చూచువానికగును. కాన సూర్యమండలాంతరుని ధ్యానించువాడు అక్షిపురుషునియందు నిష్ఠితు

పురుషుని ధ్యాయేత్ = ధ్యానము చేయునో; సః = వాడు అక్షి మండల మధ్యస్థం = నేత్రమండల వాసియైన పురుషుని, ఆవిశేత్ = ఆవేశించును నైవసంశయః = సంశయము లేదు

## 43. మధు విద్యాధికరణమ్

శ్లో॥ అన్యదాదిత్య రశ్మిభ్యః సారభూతం న విష్టపే
ఆదిత్యం దేవమధ్వాహుః మధునాడీశ్చ దీధితీః 69

విష్టపే = జగత్తునందు ఆదిత్య రశ్మిభ్యః = సూర్యరశ్మి కన్నా సారభూతం = సారమైనది అన్యత్ = వేరొకటి, న = లేదు ఆదిత్యం = సూర్యుని దేవమధు = దేవమధువుగ ఆహుః = పలుకుచున్నారు దీధితీః = సూర్యకిరణములు, మధునాడీః = మధునాడులగుచున్నవి

శ్లో॥ దర్శం దర్శం ప్రతృప్యన్తి తమేవ మహసాం నిధిమ్
దేవా లోకత్రయస్థానా నాశ్నన్తి న పిబన్తి చ 70

తమేవ మహసాం నిధిమ్ = ఆ తేజో నిలయుడగు సూర్యుని దర్శం దర్శం = చూచి చూచి లోకత్రయస్థానాః = ముల్లోకవాసులగు దేవాః = దేవతలు ప్రతృప్యన్తి = తుష్టినొందుచున్నారు న అశ్నన్తి = తినుటలేదు, న పిబన్తి = త్రాగుటలేదు

శ్లో॥ పదార్థా అనుభూయన్తే రశ్మిద్వారాస్మదాదిభిః
కేవలా అనుభూయేరన్ రశ్మయో జ్ఞానయోగిభిః 71

అస్మదాదిభిః = మనవంటి సంసారులచే రశ్మిద్వారా = కిరణములద్వార, పదార్థాః = దృశ్యవస్తువులు అనుభూయన్తే = అనుభవింపబడుచున్నవి, జ్ఞానయోగిభిః = సాధకులచే కేవలాః రశ్మయః = కేవల సూర్యరశ్ములు మాత్రమే (పదార్థములను విడచి) అనుభూయేరన్ = అనుభవింపబడుచున్నవి

డగును. సందేహము లేదు. అదే దివ్యనేత్రము. "స ధన్యః పురుషో లోకే యత్తదావిశ్య పశ్యతి" అని ముందు చెప్పబడును. 68

## 43. మధు విద్యాధికరణము

వ్యాఖ్య : ఈలోకమున సూర్యరశ్మలకన్న సారమగు వస్తువు లేదు. ఆదిత్యుడే దేవమధువు వాని కిరణములు మధు నాడులు. 69

వ్యాఖ్య : ముల్లోకవాసులగు సాధకులు దేవతలు ఆ సూర్యకిరణములను మధునాడులను చూచి చూచి తృప్తినందుదురు, వారు వానిని తినుట త్రాగుటచేయరు. చూచి ఆనందింతురు. 70

వ్యాఖ్య : సంసారులు సూర్యరశ్మిద్వారా దృశ్యపదార్థములను సంగములో చూచుచున్నారు. దృశ్యరహితములైన కేవల సూర్యరశ్ములు యోగులచే అనుభవింపబడి అప్పుడవి దేవమధువులగు నాడు లగుచున్నవి. 71

శ్లో॥ రశ్మిద్వారైవ దేవస్య సూర్యస్యానుభవో భవేత్
సూర్యస్యానుభవా జ్జీవో దేహాతః స్యాత్పృథక్కృతః॥ 72

రశ్మిద్వారా ఏవ=కిరణములద్వారముననే, దేవస్య సూర్యస్య=దేవుడగు సూర్యుని; అనుభవః=అనుభూతి; భవేత్ = అగును; జీవః = జీవుడు; సూర్యస్య అనుభవాత్ = ఆ సూర్యదర్శనముచే, దేహాతః=దేహమునుండి, పృథక్ కృతః=వేరుచేయబడినవాడు, స్యాత్=అగును.

శ్లో॥ సర్వేషామపి శబ్దానాం ప్రణవః ప్రకృతిర్యథా
సర్వేషాం వ్యక్తరూపాణాం సూర్యభా ప్రకృతిస్తథా॥ 73

యథా=ఏతీరున, సర్వేషామపి శబ్దానాం=అన్ని శబ్దములకును; ప్రణవః=ఓంకారము, ప్రకృతిః=మూలమో; తథా=ఆతీరున; సర్వేషాం వ్యక్తరూపాణాం = అన్ని వ్యక్తరూపములకును: సూర్యభా=సూర్యకాంతి, ప్రకృతిః=మూలకారణము.

శ్లో॥ వికృతాని పరిత్యజ్య రూపాణి సతతం కృతీ।
ఏకమేవ రవిజ్యోతిః సర్వవ్యాప్తం విలోకయేత్ 74

కృతీ=నేర్పరి యగువాడు: వికృతాని రూపాణి=వికారములగు రూపములను; పరిత్యజ్య=విడిచి: సతతం = ఎల్లప్పుడు; ఏకమేవ=ఒక్క; సర్వవ్యాప్తం=అంతటానిండిన, రవిజ్యోతిః=సూర్యకాంతిని; విలోకయేత్ =చూడవలెను.

శ్లో॥ రాత్రావపి రవిజ్యోతి రస్తి వ్యోమ్ని విభాసకమ్।
తద్వినా నైవ తారాది దర్శనం సంభవిష్యతి 75

వ్యోమ్ని = ఆకాశమున, విభాసకమ్ రవిజ్యోతిః=ప్రకాశింప జేయు సూర్యకాంతి; రాత్రావపి=రాత్రియందును, అస్తి=కలదు,తద్వినా=అదిలేక; తారాది దర్శనం=నక్షత్రాదుల దర్శనము: నైవ సంభవిష్యతి=కలుగదు.

వ్యాఖ్య : కిరణములచే లోకములను చూచువానికి లోకబంధమగును. కేవల కిరణములను చూచిన కేవల సూర్య దర్శనమగును. దానివలన లోకమునంటి దేహబంధము వీడి జీవుడు సూర్య సన్నిభుడగును. రూపబంధము తొలగునని భావము. 72

వ్యాఖ్య : అన్ని వ్యక్త శబ్దములకు ప్రణవము ప్రకృతియగునట్లు అన్ని వ్యక్తరూపములకు సూర్యకాంతి మూల ప్రకృతి యగుచున్నది. 73

వ్యాఖ్య : నేర్పరియైనవాడు రూపవికారము గల సకల దృశ్యజాతమును విడిచి సర్వవ్యాప్తమగు సూర్యతేజమునే అంతటా రూపసంబంధము లేకుండా చూడవలెను. ఇదియే ఉపాసనము. 74

వ్యాఖ్య : రాత్రి యందును అన్నిటిని ప్రకాశింప జేయు సూర్యకాంతి ఆకాశమున కలదు. అది లేకున్న నక్షత్రాది దర్శనము మనకు కలుగదు. 'యథా ప్రకాశయ్త్యేకః కృత్స్నం లోక మిమం మహాత్' అను స్మృతి ప్రమాణము. 75

శ్లో॥ గోళస్య పశ్చాత్సూర్యస్య సంస్థితేః స్యాన్నిశీథినీ
తథాపి అతిక్రమ్య భాన్తి భూచ్ఛాయాం తస్య రశ్మయః ॥ 76

గోళస్య=భూగోళముయొక్క, పశ్చాత్ = వెనుక భాగమున; సూర్యస్య సంస్థితేః=సూర్యుని ఉనికి వలన; నిశీథినీ=రాత్రి; స్యాత్ =అగును; తథాపి = అయినను; భూచ్ఛాయాం=భూమి నీడను; అతిక్రమ్య = దాటి, తస్య=సూర్యుని; రశ్మయః=కిరణములు; భాన్తి=ప్రకాశించుచున్నవి.

శ్లో॥ బహిస్తు దృశ్యతే రశ్మిః ఏవాన్తః ప్రపశ్యతి
అతో జ్ఞానాని సర్వాణి ప్రతి తిష్ఠంతి రశ్మిషు 77

రశ్మిః=సూర్యకాంతి; బహిః=పైన; దృశ్యతే=చూడబడుచున్నది ఏవ=అదే; అంతః ప్రపశ్యతి= లోపల చూచుచున్నది; అతః=అందుచే; జ్ఞానాని సర్వాణి=అన్ని జ్ఞానములు; రశ్మిషు=కిరణములందు; ప్రతి తిష్ఠంతి=నిలకడ చెందుచున్నవి.

శ్లో॥ సదా పశ్యతి యస్తేజో బహి రన్తశ్చ భాస్వతః
దినమేవాస్య సర్వోపి కాలః స్యాత్సంప్రపశ్యతః ॥ 78

యః=ఎవడు; భాస్వతః = సూర్యుని. తేజః=కాంతిని, బహిః=పైన, అంతశ్చ = లోపలకూడ; సదా = ఎల్లప్పుడు, పశ్యతి= చూచుచున్నాడో; అస్య సంప్ర పశ్యతః=లెస్సగా చూచుచున్న అతనికి, సర్వోపి కాలః=సర్వకాలమును ; దినమేవ=పగలే; స్యాత్ =అగును.

శ్లో॥ మధువిద్యాం విజానాతి య ఏతా మతిగోపితామ్ ।
ఇహైవ తస్యానుభవః పరస్య జ్యోతిషో భవేత్ । 79

ఏతాం అతి గోపితామ్ మధు విద్యాం=అతి రహస్య మగు ఈ మధు విద్యను, యః=ఎవడు; విజానాతి=తెలియునో, తస్య=వానికి; ఇహైవ=ఈ లోకమందే; పరస్య జ్యోతిషం=పరంజ్యోతి యొక్క; అనుభవః=అనుభూతి; భవేత్ =అగును.

వ్యాఖ్య. సూర్యుడు గోళమునకు వెనుక నుండుటచే గోళమున రాత్రియగుచున్నది. అయినను భూ చ్ఛాయను దాటి ఆకాశమున సూర్యకాంతి ప్రసరించును. సూర్యునికన్న భూగోళము చిన్న దగుటయే కారణము. 76

వ్యాఖ్య· సూర్యకిరణములు పైన కానవగును. అవియే లోపల కూడ అగును. అందుచే ఆ కిరణముల యందు అన్ని జ్ఞానములు నిలకడ చెంది ఉన్నవి. 77

వ్యాఖ్య: రాత్రి పగలు కూడ ఎవడు సదా సూర్యరశ్మిని చూచు చున్నాడో వానికి సదా సూర్యరశ్మి కనపడుటచే కాల మంతయు పగలే యగును. 78

వ్యాఖ్య: ఎవడు ఈ మధువిద్యా రహస్యమును తెలిసి ఉపా సించునో వానికి ఈ లోకమందే పరంజ్యోతి యొక్క అనుభవమగును. 79

# 44. దహర విద్యాధికరణమ్

శ్లో॥ హృదయం పరమం వ్యోమ తదుక్తం దహరాహ్వయమ్।
ఆత్మనస్తు స్వరూపం తదృషయః పరిచక్షతే 80

పరమం వ్యోమ=పరాకాశమే, హృదయం=హృదయము; తత్=అది. దహరాహ్వయమ్=దహరమను పేరున, ఉక్తం=చెప్పబడుచున్నది. తత్=అది; ఆత్మనః=తనయొక్క; స్వరూపం=స్వరూపమని; ఋషయః = ఋషులు, పరిచక్షతే = తెలుపుచున్నారు.

శ్లో॥ వ్యోమైవ జ్యోతిరుద్దీప్తేః సూక్ష్మత్వాజ్జ్యోతిరేవ ఖమ్ ।
తచ్ఛ్రేష్ఠం ప్రాణమావిశ్య భజతే పురుషాహ్వయమ్ 81

ఉద్దీప్తేః=ప్రకాశించుట వలన. వ్యోమైవ = ఆకాశమే; జ్యోతిః=తేజము; సూక్ష్మత్వాత్=అతి సూక్ష్మమైన దగుట వలన. జ్యోతిరేవ=ఆ దీప్తియే, ఖమ్=ఆకాశము, తత్=ఆఆకాశదీప్తి; శ్రేష్ఠం ప్రాణమ్=శ్రేష్ఠప్రాణమును ఆవిశ్య=ఆవేశించి; పురుషాహ్వయం = పురుషుడు అను సంజ్ఞను (జీవ సంజ్ఞను); భజతే=పొందుచున్నది.

శ్లో॥ మజ్జన్నివ మనోవృత్త్యా దహరే నిష్ఠితో భవేత్
చిన్వన్నివోత యుక్తాత్మా స్వాత్మనిష్ఠైవ సామతా । 82

మనోవృత్త్యా=మనస్సున భావనచే; దహరే=దహరాకాశమున; మజ్జన్నివ=మునిగిన వానివలె భావించి, నిష్ఠితః=దహరమందు నిష్ఠగలవాడు; భవేత్=అగును, ఉత=లేక, యుక్తాత్మా=యోగయుక్తుడై; చిన్వన్నివ=చింతనము చేయుచుండినను; సా=అది; ఆత్మనిష్ఠైవ=ఆత్మనిష్ఠ అనియే; మతా=చెప్పబడుచున్నది.

శ్లో॥ నిష్ఠితః సతతం విద్వాన్దహరే యుక్తమానసః ।
బ్రహ్మాండే సంస్థితాన్కామాన్సర్వానపి చ సాధయేత్ ॥ 83

# 44. దహర విద్యాధికరణము

వ్యాఖ్య : హృదయమే పరమాకాశము. అదే దహరము. దానినే ఋషులు ఆత్మ స్వరూపమని తెలిపిరి. 80

వ్యాఖ్య : ఆ తేజము యొక్క సూక్ష్మావస్థ ఆకాశము. దాని దీప్త్యవస్థ జ్యోతి యగుచున్నది. కాన వాటి రెండింటికి భేదము లేదు. ఆ జ్యోతి శ్రేష్ఠప్రాణము నావేశించి పురుష శబ్ద వాచ్యమగుచున్నది. 81

వ్యాఖ్య : దహరాకాశమున మనోవృత్తిచే సదామునిగినట్లు లేదా దహరాకాశచింతనము చేయుచు ఆత్మనిష్ఠను అంద గలడు. (ఇదియే రమణోపదేశము). చిన్నన మనగా పోయిన వస్తువును సదా వెదకుచున్న ఆలోచనము. 82

వ్యాఖ్య : దహరనిష్ఠనందిన పండితుడు లోకమునందలి అన్ని

యుక్తమానసః=యోగయుక్తమైన మనసు కలవాడై, దహరే=దహరాకాశమున; సతతం=సదా; నిష్ఠితః=నిష్ఠచెందిన; విద్వాన్=పండితుడు; బ్రహ్మాండే=విశ్వమున. సంస్థితాన్=ఉన్న; సర్వాన్కామాన్ అపిచ=అన్నికోరికలను కూడ; సాధయేత్=సాధింప గలడు.

శ్లో॥ ప్రథమాదేవతా సైవ యా ప్రోక్తా దహరాహ్వయా
నిష్ఠితో దహరే విద్వాన్దేవతైవ స్వయం భవేత్ 84

యా=ఏది; దహరాహ్వయా = దహరాకాశమో; సా= అది; దేవతా=దేవత అని; ప్రోక్తా=చెప్పబడుచున్నది; దహరే= దహరాకాశమున నిష్ఠితః=నిలకడచెందిన; విద్వాన్ =పండితుడు; స్వయం=తానుగా, దేవత ఇవ=దేవతయే. భవేత్=అగును.

## 45. వైశ్వానర విద్యాధికరణమ్

శ్లో॥ ఆత్మనోఽభిమానస్య యదుపాస్తిర్నిరంతరా
వైశ్వానరస్య విద్యేయం కీర్తితా మునిసత్తమైః 85

ఆత్మనః=ఆత్మయొక్క; అభిమానస్య=నేను అను భావము యొక్క; నిరంతరా=సరళమగు. ఉపాస్తిః=ఉపాసనము; యత్ = ఏదో, ఇయం=ఈ ఉపాసనయే వైశ్వానరస్య విద్యా=వైశ్వానర విద్యయని; మునిసత్తమైః=ఋషిశ్రేష్ఠులచే; కీర్తితా= నుతింపబడినది.

శ్లో॥ అభిమాన స్త్వహం వృత్తి రాత్మనః పరికీర్త్యతే।
తత్ర నిత్యం స్థితి ర్విద్యా తయా వైశ్వానరే స్థితిః 86

ఆత్మనః=ఆత్మయొక్క; అభిమానః తు=నేను అనుభావము; అహంవృత్తి=అహంవృత్తియని, పరికీర్త్యతే=చెప్పబడుచున్నది. తత్ర=అక్కడ, నిత్యం=సదా, స్థితిః=ఉనికి; విద్యా=విద్యాశబ్ద వాచ్యము తయా=దానిచే; వైశ్వానరే=వైశ్వానరునియందు; స్థితిః=ఉనికి జరుగును.

కామములను సాధింపగలడు. 83

వ్యాఖ్య : దహరాకాశమే పరాదేవత అగుచున్నది. అక్కడ నిష్ఠ చెందిన వాడు ఆ దేవతయే యగును. 84

# 45. వైశ్వానర విద్యాధికరణము

వ్యాఖ్య . నేను అను ఆత్మభావమును సదా ధ్యానించుట వైశ్వానర విద్యయని ఋషులు తెలిపిరి. 85

వ్యాఖ్య · ఆత్మాభిమానమైన నేను అను భావమునందు సదా ఉనికియే నిష్ఠ. నేను అనునది ఏది యని వెదకి అందు నిలచుట నిష్ఠ. అది వైశ్వానరుని యందే అగును కాన అదియు విద్య అగుచున్నది. 86

శ్లో॥ ప్రాదేశమాత్రం తం ప్రాహుః దేవం వైశ్వానరం విదః ।
భాక్తమేవ బుధైర్జ్ఞేయం తత్ప్రమాణ ప్రకల్పనం 87

విదః=పండితులు; దేవం వైశ్వానరం=దేవుడైన వైశ్వానరుని; ప్రాదేశ మాత్రం=జెత్తెడు ప్రమాణము కలవానిగా; ప్రాహుః = పలుకుచున్నారు; తత్ప్రమాణ ప్రకల్పనం=ఆ ప్రమాణ కల్పన; బుధైః=పండితులచే, భాక్తం=లాక్షణికమని; జ్ఞేయం= తెలియదగినది.

శ్లో॥ కేచిజ్జాగరితం స్థానం మత్వా వైశ్వానరం విదుః
చుబుకాది లలాటాన్తం ప్రమాణం తత్ప్రచక్షతే 88

కేచిత్ = కొందరు; జాగరితం స్థానం = జాగ్రదవస్థయందైన స్థానమును; మత్వా=తలచి; వైశ్వానరం=వైశ్వానరునిగా; విదుః= తెలియుచున్నారు; తత్ =దానిని; చుబుకాది లలాటాన్తం=గడ్డము చివర మొదలు లలాటాంతము వరకు; స్థానం=తావుగా. ప్రచక్షతే=పలుకుచున్నారు.

శ్లో॥ ప్రాజ్ఞమేవాపరే తం తు మత్వా వైశ్వానరం విదః
ప్రమాణం తత్ప్రభాషన్తే నాభ్యాది హృదయావధి ॥ 89

అపరే విదః=కొందరు పండితులు; తం వైశ్వానరం=ఆ వైశ్వానరుని: ప్రాజ్ఞం ఏవ=ప్రాజ్ఞునిగ: మత్వా=తలచి; నాభ్యాది హృదయావధి=నాభి మొదలు హృదయము వరకు; తత్ప్రమాణం=ఆ కొలతను; ప్రభాషన్తే=పలుకుచున్నారు.

శ్లో॥ తైజసం పురుషం కేపి మత్వా వైశ్వానరం విదః ।
కంఠాన్తం హృదయారంభం తత్ప్రమాణం ప్రచక్షతే ॥ 90

కేపి విదః= కొందరు పండితులు; తైజసం పురుషం= తైజస పురుషుని, వైశ్వానరం మత్వా=వైశ్వానరునిగా తలచి, హృదయారంభం=హృదయము నుండి, కంఠాంతం=కంఠము

వ్యాఖ్య : ఆ వైశ్వానరుడు ప్రాదేశమాత్ర పురుషుడని అందురు. అది ఉపాసనా సౌకర్యమునకైన కల్పనయే కాని ప్రమాణము వాస్తవము కాదని భావము. 87

వ్యాఖ్య : జాగ్రదవస్థ యందైన వాడు వైశ్వానరుడు. వాని ఉనికి చుబుకాది లలాటాంతమని కొందరందురు. ఇచ్చటను ప్రమాణము భాక్తమే యగును. 88

వ్యాఖ్య : కొందరు వైశ్వానరుని ప్రాజ్ఞునిగ తలచి, వాని కొలతను నాభి నుండి హృదయము వరకు తెలుపుచున్నారు. 89

వ్యాఖ్య : కొందరు వైశ్వానరుని తైజస పురుషునిగ భావించి హృదయము మొదలు కంఠము వరకు వాని ఉనికిగా తెలుపుచున్నారు. ప్రాజ్ఞుడు నిద్రయందు ద్రష్ట. తైజసుడు స్వప్నమందు ద్రష్ట. జగత్తునందు వైశ్వానరుడు ద్రష్ట అని భావము. మత భేదముచే వైశ్వా

వరకు; తత్ప్రమాణం=వాని కొలతను; ప్రచక్షతే=తెలుపు చున్నారు.

శ్లో॥ ఉపకోసల విద్యాయా మస్యాం చాపి స్థితిః సమా
భేదో విలోకనాచ్ఛుద్దా త్తధాహం వృత్తి సంయుతాత్ ॥ 91

అస్యాంచ=వైశ్వానర విద్యయందును; ఉపకోసల విద్యాయాం=ఉపకోసల విద్యయందును, స్థితిః=ఉనికి; సమా=సమానమైనది (ఉపకోసల విద్య), విలోకనాత్ = ఆత్మాలోకనముచే, శుద్ధా=శుద్ధమైనది, అహం వృత్తి సంయుతాత్ = నేను అను మూలవృత్తిని కలిపి ధ్యానించుటచే. భేదః=భిన్నత్వము కలుగు చున్నది.

శ్లో॥ యస్తు వైశ్వానరం పశ్యే దాత్మానం తపసో బలాత్
దురాధర్ష మహావీర్యా స స్వయం దేవతా భవేత్ 92

తపసో బలాత్ = తపోబలముచే; యఃతు = ఎవడైతే, ఆత్మానం వైశ్వానరం పశ్యేత్=తనను వైశ్వానరునిగా చూచు చున్నాడో; దురాధర్ష మహావీర్యా=ఎదురులేని బలముకల; సః= వాడు; స్వయం దేవతా=తానే దేవతగా, భవేత్ =అగును.

## 46. ద్విజన్మాధికరణమ్

శ్లో॥ ఏషతూద్దేశతః ప్రోక్తో విద్యానాం సంగ్రహోమయా
సర్వాస్వపి చ విద్యాసు సంస్కార స్త్వాన్తరో భవేత్ 93

మయా = నాచే; ఏష విద్యానాం సంగ్రహః=సంక్షేపముగ ఈ విద్యలయొక్క రూపము; ఉద్దేశతః=స్వరూపములో; ప్రోక్తః=చెప్పబడినది; సర్వాస్వపిచ విద్యాసు=అన్ని విద్యలయందు; ఆన్తరః సంస్కారః = అంతరమగు సంస్కారము; భవేత్ =అగును.

నరుని మూడు అవస్థల యందును ద్రష్టగా భావించి
పండితులు వాని ఉనికిని ప్రమాణమును తెలిపిరి. 90

వ్యాఖ్య. ఉపకోసల విద్యయందును, వైశ్వానర విద్యయందును నిష్ఠ సమానమైనదే అగును. కాని దీని యందు అహం వృత్తి సంయోగముతో ధ్యాన మారంభించుట వలన ఇది భిన్న మగుచున్నది. రెండింటి యందును ద్రష్ట యందు నిలకడ చెందుట అను సామ్యము కలదు. ఆరంభమున విద్యాభేద మున్నను పూర్ణ నిష్ఠలో భేదము లేదు. 91

వ్యాఖ్య: ఎవడైతే తన తపోబలముచే తనను వైశ్వానరునిగా చూచుచున్నాడో వాడు ఎదురులేని బలము కలవాడై దేవస్వరూపుడే అగును. 92

# 46. ద్విజన్మాధికరణము

వ్యాఖ్య. నేను విద్యలయొక్క సంగ్రహ స్వరూపమును తెలిపితిని. అన్ని విద్యలకును ప్రయోజనము అంతర సంస్కారము కలుగుట అగుచున్నది. 93

శ్లో॥ భక్త్యా వా మంత్రయోగేన కర్మయోగేన వా పునః
భవేదాంతర సంస్కారో విద్యాభిరివ దేహినామ్ ॥ 94

భక్త్యా వా = భక్తిచేగాని. మంత్రయోగేన = మంత్రజపముచేగాని; కర్మయోగేన వా = కర్మయోగముచేగాని; పునః=తిరిగి; విద్యాభిరివ=విద్యలచే జరుగుతీరున; దేహినామ్= ప్రాణులకు; ఆంతర సంస్కారః=ఆత్మ సంస్కారము; భవేత్ = అగును.

శ్లో॥ ధర్మ ఏష పరః సూక్ష్మో యేన సంస్క్రియతేఽ న్తరమ్
సచోక్తలక్షణా ద్యోగ చతుష్కా న్నాతిరిచ్యతే ॥ 95

ఏషః = ఈ సంస్కారము; పరః = శ్రేష్ఠమైన; సూక్ష్మ=అతి సూక్ష్మమగు; ధర్మః=ధర్మము; యేన=ఏ ధర్మముచే; అంతరం= లోపల; సంస్క్రియతే = సంస్కారమును పొందుచున్నదో; సచ = ఆ ధర్మము. ఉక్తలక్షణాత్ =పూర్వమందు చెప్పబడిన; యోగచతుష్కాత్ =కర్మయోగ, భక్తియోగ, మంత్రయోగ, జ్ఞానయోగములను నాల్గింటికంటె, న అతిరిచ్యతే = భిన్నమైనది కాదు.

శ్లో॥ సంస్కారేణాంతరేణైవ ద్వితీయం జాయతే పునః ।
తమేవాహు ర్ద్విజన్మానం శాక్త మన్యత్ర తత్పదమ్ ॥ 96

అంతరేణ సంస్కారేణ = అంతర సంస్కారముచే; మనుజుడు, పునః ద్వితీయం = రెండవసారి తిరిగి. జాయతే = పుట్టుచున్నాడు, తం=వానిని, ద్విజన్మానం = ద్విజన్మునిగ; ఆహుః= పలుకుచున్నారు; అన్యత్ర=ఇతరులయందు; తత్పదం=ఆ ద్విజ పదము. శాక్తం=లాక్షణికము.

వ్యాఖ్య : విద్యలచే ఏ సంస్కారము జరుగునో అట్టి సంస్కారము భక్తియోగము, కర్మయోగము, మంత్రజపము, వీనిచే కూడ దేహధారుల కగును. 94

వ్యాఖ్య : ఆంతర సంస్కారమును కలిగించునదియే ధర్మ సూక్ష్మము. అది మంత్రయోగ, కర్మయోగ, భక్తి యోగ, జ్ఞానయోగములకన్న భిన్నము కాదు. జ్ఞాన యోగము అను పదము ఇక్కడ విద్యకు పర్యా యము. 95

వ్యాఖ్య : ఎవనికి యోగములందే దానిచేనైన ఆంతర సంస్కా రము కలుగుచున్నదో వాడే ద్విజన్ముడు. అట్టి సంస్కారమును పొందక జాతిమాత్రముచేనైన ద్విజన్ముడను పదము లాక్షణికము. అనగా ఆ సంస్కా రము ఏ జాతి వానికైన కావచ్చును. వాడు ద్విజ న్ముడు. సంస్కారమునందని బ్రాహ్మణుడు కూడ ద్విజన్ముడనుటకు అనర్హుడని భావము. 96

# అష్టమః పరిచ్ఛేదః

## 47. దేవయానాధి కరణమ్

శ్లో॥ గతః శతాధికాం నాడీం శరీరా దుపసంహృతః
విజ్ఞానాత్మా దేవయాన ముత్క్రాన్తో మార్గ మృచ్ఛతి 1

శరీరాత్ = దేహమునుండి, ఉపసంహృతః= వేరైనవాడై, శతాధికాంనాడీం=బ్రహ్మనాడిని (సుషుమ్నానాడిని), గతః= పొందిన; విజ్ఞానాత్మా=జ్ఞానానుభవముకల ఆత్మ; ఉత్క్రాన్తః= శరీరమునుండి మీదకు లేచి; దేవయానం మార్గం= దేవయాన మార్గమును; ఋచ్ఛతి=పొందుచున్నది.

శ్లో॥ సుషుమ్నాయాః పురోభాగం విదు ర్నాడీం శతాధికామ్
తయోర్ధ్వ మాయ న్నమృతో భవతీతి ప్రచక్షతే 2

సుషుమ్నాయాః=సుషుమ్నానాడియొక్క, పురోభాగం= ముందరి భాగమును, శతాధికాం నాడీం=శతాధికానాడి (బ్రహ్మనాడి) అని, విదుః= తెలియుచున్నారు. తయా=ఆ సుషుమ్నా నాడిద్వార, ఊర్ధ్వం=ఉత్తమలోకములకు; ఆయన్ = వెళ్లుచు; అమృతః=మరణభయము లేనివాడుగ, భవతి=అగుచున్నాడు అని; ప్రచక్షతే=చెప్పుచున్నారు.

శ్లో॥ దేవయానం గతో మార్గ మమృతో ఒశిథిల స్మృతిః
ఉత్తమం విష్టపం యాతి పునరావృత్తి వర్జితః 3

అమృతః = అమృత స్వరూపుడై; అశిథిల స్మృతిః = ఆత్మ స్వరూపజ్ఞానముతో, దేవయానం మార్గం= దేవయాన మార్గమును; గతః=పొందినవాడై; ఉత్తమం విష్టపం=బ్రహ్మలోకమును; పునరావృత్తి వర్జితః=తిరిగి జన్మలేనివాడై, యాతి=పొందుచున్నాడు.

# ఎనిమిదవ పరిచ్ఛేదము

ఇాదు సంస్కారము పొందిన వారి మార్గము వివరింపబడును.

## 47. దేవయానాధికరణము:

వ్యాఖ్య శరీరాభిమాన త్యాగముచే దేహమునుండి ఆత్మ తేజము వేరగును ఆ విజ్ఞానాత్మ బ్రహ్మనాడి ద్వార ఉత్క్రాన్తిని చెంది దేవయాన మార్గమున పునరావృత్తి లేని లోకము నందును. శాస్త్రజన్య జ్ఞానము అనుభవముతో నుండిన అది విజ్ఞానమగును. అహంకారము, మనోగతమైన సంస్కారమగును. అది పరిజ్ఞాగతమైన దేహమునుండి ఆత్మ వేరగును. 1

వ్యాఖ్య: బ్రహ్మనాడి, శతాధికానాడి, సుషుమ్నానాడి అను పేరులు కల నాడి ఇళ, పింగళలమధ్య సూక్ష్మమై ఉన్నది. దీనినే నచికేతో పాఖ్యానమున కఠోపనిషత్తు 'శతంచై కంచ నాడ్యః' అని తెలిపినది. ఆనాడీ పురోభాగమును పొంది విజ్ఞానాత్మ ఉత్క్రాంతి చెంది పునరావృత్తి లేని స్థానమును పొందును, దీనినే గీత 'యత్రకాలేత్వనా వృత్తి మావృత్తించైవ యోగినః' అని వివరించినది. 2

వ్యాఖ్య: ఆత్మస్మృతిని వీడక దేవయాన మార్గమున పునరా వృత్తి లేని ఉత్తమలోకమును యోగి పొందును. ఇది జీవన్ముక్తి కాదు. 3

శ్లో॥ స్పృహణీయా గతిః ప్రోక్తా మునిభిః ప్రాణినా మిహమ్
అత్ర శాశ్వత ఆనన్దో నాశోఽత్ర న కదాచన॥ 4

ప్రాణినాం=జీవులకు, ఇహ=ఈలోకమున, స్పృహణీయా=నుతింపదగిన, గతిః=గతియని: మునిభిః=మునులచే; ప్రోక్తా=చెప్పబడినది: అత్ర=ఇక్కడ, శాశ్వతః=నిత్యమగు: ఆనందః=ఆనందముకలదు, అత్ర=ఇక్కడ; నాశః=మరణము, న కదాచన=ఎప్పుడును లేదు.

శ్లో॥ ఉత్తమో యేన మార్గేణ తేజసా యాతి పూరుషాన్
వయం తేనైవ మార్గేణ శక్నుమో యాతు ముత్తమమ్ 5

ఉత్తమః=ఉత్తమ పురుషుడు: యేనమార్గేణ = ఏ మార్గముచే, తేజసా = తేజస్సుచే; పూరుషాన్ = జీవులను. యాతి = పొందుచున్నాడో; తేన ఏవ మార్గేణ = ఆ మార్గము చేతనే; వయం = మనము, ఉత్తమం = ఉత్తమ పురుషుని; యాతుం = పొందుటకు శక్నుమః = సమర్థుల మగుచున్నాము.

శ్లో॥ మార్గోఽయమేవ ప్రాణానాం ఏషైవ సరణి స్త్విషామ్
రేణుభి స్తైజసై ర్బద్ధో దివ్యం పంథా అసౌ స్మృతః 6

ప్రాణానాం = ప్రాణములకు; ఏషఏవ = ఇదే. మార్గః = త్రోవ; త్విషామ్ = తేజస్సులకు; ఏష ఏవ = ఇదే; సరణిః = పద్ధతి తేజసైః రేణుభిః = తేజస పరాగముచే; బద్ధః = నిర్మితమగు; దివ్యం పంథా = దివ్య మార్గమని: అసౌ = ఇది; స్మృతః = తెలువబడినది.

వ్యాఖ్య: ఈ దేవయాన మార్గము కొనియాడదగినదని మునులు తెలిపిరి. ఇచ్చట శాశ్వతానందము కలదు. తిరిగి జన్మము యిక్కడ ఉన్నవారికి లేదు. మరణమును లేదు. 4

వ్యాఖ్య: 'తత్సృష్ట్వా తదేవానుప్రవిశతి' అను తీరున ఉత్తముడు ఏ తైజస మార్గమున జీవులయందు ప్రవేశము చేయుచున్నాడో, ఆ మార్గముననే మనము ఉత్తముని పొందుట శక్యమగుచున్నది. ఈ అనుప్రవేశము మాయావరణమునందే కలదు.
'పూర్ణే శరీర శిల్పే ద్వారేణ బ్రహ్మరంధ్ర సంజ్ఞేన నాడీపథేన గత్వా తైజ మనుమావిశ స్యమేయ బలే' అను ఉమా సహస్ర శ్లోకము ఇందుకు ప్రమాణము. దేవయాన మార్గ గమనమును మాయావరణము నందే జరుగును. కావున ఇది జీవన్ముక్తావస్థ కాదు. కాని యీ మార్గము నందిన వానికి మరి మరణము, సంసార బంధము ఉండవు. 5

వ్యాఖ్య: ఇది ప్రాణములకు మార్గము. ఇదియే తేజో మార్గము. ఇది తైజసమగు అణువులతో నిర్మింపబడినది. దీనినే దివ్య మార్గ మందురు. 6

# 48. పితృయాణాధికరణమ్

శ్లో॥ దేహాత్తో దేవతాసేవీ యద్యప్యనుప సంహృతః
ఉద్ధృతోఽనుగ్రహా చ్చన్ద్రం పితృయాణేన గచ్ఛతి॥ 7

దేహతః = శరీరముతో; (నేను ఈ శరీరము అను భావముతో,) దేవతాసేవీ = దేవతలను సేవించి; అనుపసంహృతః యద్యపి = శరీరమునుండి వేరు కాకున్నను; అనగ్రహాత్ = దేవతానుగ్రహమువలన; ఉద్ధృతః = దేహమునుండి వేరుచేయబడి; పితృయాణేన = పితృయాణ మార్గమున, చంద్రం = చంద్రుని; గచ్ఛతి = పొందుచున్నాడు.

శ్లో॥ ప్రాణానాం కామదిగ్ధానా మపాం చన్ద్రత్విషామపి
పితౄణాంచ పిశాచానా మేష మార్గః ప్రకీర్తితః 8

కామదిగ్ధానాం = కోరికలు కల; ప్రాణానాం = ప్రాణములకు; చంద్రత్విషాం అపాం = రసాత్మకములగు జలములకు, పితౄణాం = పితరులకు, పిశాచానాం = పిశాచములకు; ఏషమార్గః = ఈ పితృయాణమార్గము, ప్రకీర్తితః = తెలుపబడినది.

శ్లో॥ తత్ర భోగాన్ సోఽనుభూయ పునరావర్తతే భువమ్
అమృతశ్చేదావిశతి మృతశ్చే త్పూర్వవత్క్రమః॥ 9

తత్ర = చంద్రలోకమున, భోగాన్ = భోగములను, సః = వాడు, అనుభూయ = అనుభవించి; భువం = భూలోకమునకు; పునరావర్తతే = మరల వచ్చును; అమృతః చేత్ = మరణము లేకున్న; ఆవిశతి = ఒక ప్రాణిని ఆవేశించును; మృతః చేత్ = మరణించిన; పూర్వవత్ = పంచాహుతి క్రమమున; క్రమః = క్రమాగతి యగును.

శ్లో॥ తస్యైన్దురశ్మి భూతత్వా న్నాస్త్యత్ర ప్రథమాహుతిః
మరణం చా ప్యమరణం తథా తత్ర యథా భువి 10

# 48. పితృయాణాధికరణము

వ్యాఖ్య: దేవతలను భక్తితో సేవించి దేహాభిమానము తొలగకున్నవాడు ఆ దేవతానుగ్రహముచే శరీరము నుండి వేరు చేయబడి పితృయాణ మార్గమున చంద్రలోకము పొందును. దేహాభిమానము వీడినవాడు దేవయాన మార్గమున పోవును వీడని వాడు పితృయాణ మార్గము నందునని భావము. 7

వ్యాఖ్య: కోరికలు కలవారల ప్రాణములకు, రసాత్మకములగు జలములకు, పితృదేవతలకు, పిశాచములకు ఇది మార్గమని చెప్పుచున్నారు. ఆహుతి క్రమమున రెండవ ఆహుతి యందగు ద్రవ్యమే చంద్రత్వాపాం అపాం అని తెలుపబడినది. 8

వ్యాఖ్య: పితృయాణ మార్గమున వెళ్ళినవాడు అక్కడ భోగముల ననుభవించి మరల భూలోకమునకు వచ్చును. మరణ కాలమున అక్కడ స్మృతియున్న ఆవిష్టుడగును. స్మృతిలేకున్న పంచాహుతి క్రమమున జన్మించును. 9

వ్యాఖ్య: చంద్రమండలము చేరిన వారును, భూమి యందు వలె మరణించుదురు. లేక స్మృతి కలవారును కావచ్చును.

తస్య=మృతిచెందిన ప్రాణికి; ఇందు రశ్మి భూతత్వాత్ = చంద్రకాంతిస్వరూప మగుటచే; (రసాత్మక మగుటచే). అత్ర=ఈ ప్రాణి విషయమున; ప్రథమాహుతిః = మొదటి ఆహుతి; నాస్తి= లేదు; మరణం=చావు; అమరణం=మరణము లేకుండుట; యథా భువి= భూమియందు వలె; తథా=ఆ విధముగ; తత్ర=అక్కడ అగును.

శ్లో॥ చంద్రలోకం గతానాం చ తతో విద్యాబలాత్పునః
దేవయానేన గమనం నాసాధ్యమితి శుశ్రుమ ॥ 11

చంద్రలోకం=చంద్రలోకమును గతానాంచ=పొందిన వారలకు. తతః=అచ్చటనుండి; విద్యాబలాత్ =విద్యోపాసనచే; దేవయానేన=దేవయాన మార్గమున; గమనం= ఊర్ధ్వగమనము; నాసాధ్యం=అసాధ్యము కాదు అని, శుశ్రుమ=వినుచున్నాము.

శ్లో॥ పూర్వోఽర్చిరాదిః మార్గః స్యా ద్ధూమాది రియ మూచ్యతే
ధూమ స్తోయవికారోఽత్ర జ్ఞాతవ్య స్తత్త్వకోవిదైః 12

పూర్వం= మొదటిది; (దేవయానము). అర్చిరాదిమార్గః= అర్చిరాది మార్గము; (తైజసము). స్యాత్ = అగును; ఇయం = ఇది (పితృయాణ మార్గము); ధూమాదిః = ధూమాది మార్గమని, ఉచ్యతే = తెలుపబడుచున్నది; అత్ర = ఇక్కడ. ధూమః = ధూమమనగ; తోయవికారః = జలవికారమని. తత్త్వకోవిదైః = పండితులచే; జ్ఞాతవ్యః = తెలియదగినది.

శ్లో॥ పథోః కాలవిశేషాణాం ఉభయత్రచ యా శ్రుతిః
విశేషణతయా తాం తు జానీయా దౌపచారికీమ్ 13

ఉభయత్ర= రెండింటియందు; పథోః = మార్గములకు, కాలవిశేషాణాం = ఉత్తరాయణ, దక్షిణాయనములను కాలవిశేలను తెలుపు; యా శ్రుతిః = ఏ వేదమంత్రము కలదో, తాం = దానిని, విశేషణతయా = విశేష్యము లేక అప్రధానముగ నుండు

స్మృతి ఉన్న ఆవేశము చెందుదురు మరణించిన వారి ప్రాణములు రసాత్మకములే కావున మొదటి ఆహుతి వీరికి లేదు నాలుగాహుతులలో పురుషసంజ్ఞ నందుదురు. 10

వ్యాఖ్య : చంద్రలోకము పొందినవారు ఉపాసనా మహత్వముచే దేవయాన మార్గమున ఉత్తమగతి నందవచ్చునని వినుచున్నాము. 11

వ్యాఖ్య : అర్చిరాది మార్గమని దేవయానమునకు పేరు పితృయానమునకు ధూమాది మార్గమని పేరు. ఇచ్చట ధూమమనగా తోయవికారమని అర్థము. 12

వ్యాఖ్య : ఆరు మాసములు ఉత్తరాయణము ఆరు మాసములు దక్షిణాయనము. అట్లే ఉత్తరాయణ మార్గము, దక్షిణాయన మార్గము అని శ్రుతి తెలిపినది. అట్లే గీతయు ఉత్తరాయణ దక్షిణాయన మార్గములంగ వీనిని తెలిపినది. భారతము కూడ భీష్ముడు ఉత్తరాయణమునకై వేచి యుండుటను తెలుపుచున్నది. ఇట్లైనను అచ్చట కాలము అప్రధానము. దక్షిణాయనమున దేవయాన

టచే; ఔపచారికీమ్ = లాక్షణికమైనదిగ, జానీయాత్ = తెలియవలెను.

## 47. తృతీయస్థానాధికరణమ్

శ్లో॥ దేవానుగ్రహ మప్రాప్తః కర్మణా చరితేన వా
అవిజానన్నుతాత్మానం తృతీయస్థానభాగ్భవేత్ ॥ 14

కర్మణా = ధర్మకర్మలచే గాని, చరితేన వా = శీలము, భక్తి మొదలగువానిచే గాని; దేవానుగ్రహం = దేవతానుగ్రహమును; అప్రాప్తః = పొందనివాడును, ఉత = లేక; ఆత్మానం = ఆత్మస్మృతిని; అభిజానన్ = తెలియని వాడును; తృతీయస్థానభాక్ = మూడవ మార్గమును పొందినవాడు; భవేత్ = అగును.

శ్లో॥ జననం మరణం చేతి పరిణామస్తు భౌతికః ।
యత్రైవ తజ్జడం విశ్వం తృతీయస్థాన ముచ్యతే । 15

జననం = పుట్టుక, మరణం చ ఇతి = చావు అనునది; భౌతికః = భూత తత్త్వములచేనైన; పరిణామః = మార్పు; యత్రైవ = ఎక్కడ విశ్వం = ప్రపంచము; తజ్జడం = ఆత్మావభాస లేని జడమగునో, అది; తృతీయస్థానం = మూడవస్థానమని; ఉచ్యతే = పలుకబడుచున్నది.

శ్లో॥ శీఘ్రస్యాప్రకృత్యంబుభావో మరణసంజ్ఞకః ।
ఆహుతి క్రమతస్తస్య శీఘ్రభావో జనుః పునః ॥ 16

శీఘ్రస్య = శీఘ్రప్రాణమునకు; ప్రకృత్యంబు భావః = జలసామాన్య రూపము వచ్చుటః మరణ సంజ్ఞకః = మరణ మనబడు;

మార్గమున ఊర్ధ్వగతి నందవచ్చును. కాన కాలము గౌణమని తెలియవలయును. రాత్రిః కృష్ణః శుక్లః అహః మొదలగు పదములును తదభిమాన దేవతలనే తెలుపును. కాని కాలవాచకములుగ భావింపరాదు. శ్రౌతము గీతార్థము కాదు. కాన శ్రుతి విషయము కాదని బాదరాయణుల భావము. 13

## 47. తృతీయ స్థానాధికరణము

వ్యాఖ్య : ఆత్మస్వరూపము నెరుగని వాడు కర్మచేగాని, భక్తిచే గాని, దైవానుగ్రహము పొందని వాడును, మూడవ స్థానము నందును. 14

వ్యాఖ్య : భౌతికపరిణామములచే జననమరణములగును. అట్టి స్థితి యందు విశ్వము జడతుల్యమగును. ఇదే మూడవ స్థానము. 15

వ్యాఖ్య : శ్రేష్ఠప్రాణము సామాన్య జలభావమునందుట మరణము. అదిమరల శ్రేష్ఠప్రాణరూపమునందుట జననము. ఇది

తస్య=దానికి; ఆహుతి క్రియతః=పంచాహుతి క్రియముచే; శ్రేష్ఠభావః=శ్రేష్ఠప్రాణ రూప మగుట; పునః జనుః=పునర్జన్మ యగుచున్నది.

శ్లో॥ అపాం సాధారణీనాం చ మృతప్రాణస్య చాప్యపామ్
జన్మప్రకరణే తుల్యా గతి ర్వేద్యా మనీషిభిః ॥ 17

సాధారణీనాం అపాం=సామాన్య జలములకు; మృతప్రాణస్యచ అపామ్=చనిపోయి జలభావము నందిన వారికిని; జన్మప్రకరణే = జన్మ అగుటయందు తుల్యాగతిః = సమానమగు క్రమము; మనీషిభిః=పండితులచే; వేద్యా=తెలియదగినది.

శ్లో॥ స్వస్య ప్రకృతి భూతానాం యత్పాకో వివిధ_స్త్వపామ్
తదేవ నారకం కష్టం యావజ్జన్మ పునర్భవేత్ 18

స్వస్య=శ్రేష్ఠ ప్రాణమునకు; ప్రకృతి భూతానాం=మూలమైన; అపాం=జలములకు; వివిధః=అనేక విధములగు; యత్పాకః=ఏ పరిణామమో; యావజ్జన్మ=జన్మవరకునగు; తదేవ=అదే, నారకం=నరక మందగు; కష్టం=కష్టము.

శ్లో॥ ఇయమే వాత్మహాత్యా యజ్జడభావః ప్రమాదతః।
లోకా అసురా ఏతే స్యు ర్యేషు నాత్మావభాసతే॥ 19

ప్రమాదతః = ఆత్మను మరచుటచే; యత్ = ఏ; జడభావః=ప్రకృత్యంబు భావమో, ఇయమేవ = ఇదే; ఆత్మహత్యా=ఆత్మ హననము; ఏతే=ఇవే, అసురాలోకాః=అసుర అను లోకములు; స్యుః=అగుచున్నవి, యేషు=ఏలోకములందు; ఆత్మా=ఆత్మ; నావభాసతే=ప్రకాశింపదో.

శ్లో॥ ప్రాణానాం భాసకం బ్రహ్మ భూతానామిహ పాచకమ్
ప్రాణప్రధానః స్వర్గః స్యా న్నరకం శుద్ధ భౌతికమ్ 20

పంచాహ్నుతి క్రియముచే నగును. 16

వ్యాఖ్య: చనిపోయి జలభావమందిన వానికి సాధారణ జలములకు జన్మకలుగు నప్పుడు పంచాహ్నుతి క్రియము సమానమని తెలియదగి యున్నది. 17

వ్యాఖ్య: శ్రేష్ఠ ప్రాణములకు మూలమగు జలము శ్రేష్ఠ ప్రాణరూప మందుట వరకు అయిన ఏ వివిధ పరిణామ క్రమము కలదో, అద్దే నరకయాతన అనబడును. కేవల మరణము తృతీయ స్థాన మందగునది నరకయాతనలకు హేతువని భావము. 18

వ్యాఖ్య: ఆత్మను మరచుటచే ప్రకృత్యంబు భావము కలుగును. ఇందు ఆత్మ భాసింపదు. కాన ఇవియే అసుర లోకములు. ఈశోపనిషత్తు 'అసుర్యానామ ఏ లోకాః' అని వీనినే తెలిపినది. 19

వ్యాఖ్య: బ్రహ్మాయే ప్రాణములను భాసింపజేయును. భూతపాకము కలిగించును. ప్రాణ భాసమున్న స్వర్గము.

బ్రహ్మ = ఆ బ్రహ్మము; ప్రాణానాం = ప్రాణములకు, భాసకం = ప్రకాశింప చేయునది; భూతానాం = భూతములకు; ఇహ = ఈ లోకమున; పాచకమ్ = పరిణామము కలిగించునది; ప్రాణప్రధానః = ప్రాణము ప్రధానముగ భాసించునది, స్వర్గః = స్వర్గము; స్యాత్ = అగును; శుద్ధ భౌతికమ్ = భూత పరిణామము; నరకం = నరక మగును.

శ్లో॥ విజ్ఞానం జయతి స్వర్గే నరకే తూపహన్యతే
శరీరిణాం శరీరేషు తస్య దృష్టా గతి ర్ద్వివిధా॥ 21

స్వర్గే = స్వర్గమున; విజ్ఞానం = విజ్ఞానము; జయతి = ప్రకాశించును; నరకేతు = నరకమందు, ఉపహన్యతే = నశించును; శరీరిణాం = దేహధారుల; శరీరేషు = దేహములందు; ద్వివిధా = రెండు విధములుగ; తస్య గతిః = దాని గమనము, దృష్టా = చూడ బడుచున్నది.

శ్లో స్థానా త్తృతీయా త్సర్వోపి విజ్ఞాన పరిపంథినః
పచ్యమానాత్సదా శక్త్యా జుగుప్సేత శరీరభృత్ 22

శరీరభృత్ = దేహధారి. శక్త్యా = ఆత్మ శక్తిచే; పచ్యమానాత్ = పరిణామము చెందుచున్న; విజ్ఞాన పరిపంథినః = విజ్ఞానమునకు శత్రువగు; తృతీయాత్ స్థానాత్ = మూడవ మార్గము నుండి, సర్వోపి = అందరును; జుగుప్సేత = ఏవగించుకొనవలసినది.

## 50. సంపదధికరణమ్

శ్లో పరిచ్ఛిన్న స్త్వనుభవః సంసార ఇతి కథ్యతే
అనుభూతి రఖండాతు సంపది త్యభిధీయతే॥ 23

పరిచ్ఛిన్నః = ఖండమగు; అనుభవః = అనుభూతి; సంసారః = అజ్ఞానమని; కథ్యతే = చెప్పబడుచున్నది; అఖండా = అపరి

భూతపాకము నరకము. 20

వ్యాఖ్య : స్వర్గమున విజ్ఞానము భాసించును నరకమున నశించును. దేహధారులకు శరీరము లందీ రెండు విధములగు విజ్ఞాన గతులు గలవు. 21

వ్యాఖ్య : విజ్ఞాన భాస లేనట్టియు, భూతపరిణామ ర్యాప్తమైన ట్టియు మరాళ్వ స్థానమును పొందుటకు ప్రతి జీవియు వవగించు కొనవలెను. విజ్ఞానమయ జీవితమునకై ఎల్లరు ప్రయత్నింపలెను. ఆత్మ హానులు కారాదు. 22

## 50. సంపదధికరణము

వ్యాఖ్య : వ్యక్తి మనస్సుతో ఏకీభవించినపుడు అనుభవము పరిమిత మగును. ఇదే సంసారము. ప్రజ్ఞతో ఏకీభవించి

చ్ఛిన్నమగు: అనుభవః = అనుభూతి; సంపత్ = సంపద అని; అభిధీయతే = తెలుపబడును

శ్లో॥ పృథక్కృతో జనో దేహా త్కేవలం ప్రాణమాశ్రితః ।
పశ్యేత్సమస్త మాత్మానం ఫలానా మవధిస్తు సః ॥ 24

జనః = మనుజుడు: దేహాత్ = దేహమునుండి; పృథక్ కృతః = వేరై; కేవలం ప్రాణం = కేవల ప్రాణ తేజమును; ఆశ్రితః = ఆశ్రయించి; సమస్తం = సకల జగమును; పశ్యేత్ = చూచును: సః = ఆ చూపు; ఫలానాం = విద్యాఫలములకు; అవధిః = అవతలిచోటు.

శ్లో॥ ప్రాణాదపి పృథగ్భావం మన్యన్తే కేపి సంపది ।
తదా భోక్తు రభావేన భవేత్సంప త్సుషుప్తివత్ ॥ 25

కేపి = కొందరు: ప్రాణాదపి = ప్రాణముల కంటే: పృథ గ్భావం = వేరగుటను; సంపది = సంపదయందు: మన్యన్తే = తలచుచున్నారు: తదా = అప్పుడు; భోక్తుః = అనుభవించు వాని యొక్క; అభావేన = లేమిచే; సంపత్ = సంపద సుషుప్తివత్ = నిద్రవలె; భవేత్ = అగును.

శ్లో దేవయానేన మార్గేణ గతానా మూర్ధ్వవిష్టపమ్ ।
కలోకం వా సిద్ధి బలా త్సుస్థిరా సంప దిష్యతే । 26

దేవయానేన మార్గేణ = దేవయాన మార్గముచే; ఊర్ధ్వ విష్టపమ్ = ఉత్తమ లోకమును: గతానాం=పొందినవారలకున్నూ: సిద్ధిబలాత్ = తపస్సిద్ధిచే: కలోకంవా = బ్రహ్మలోకమున (శుద్ధాకాశమున): గతానాం = పొందినవారలకున్నూ: సుస్థిరా = నిలకడ గల; సంపత్ = సంపద; ఇష్యతే = అంగీకరింప బడుచున్నది.

శ్లో॥ భవత్యత్రైవ సంపన్నో యది విద్యాబలా న్నరః ।
దేహం త్యక్త్వా స తు స్థానం తయో రన్యతర ద్వ్రజేత్ 27

నపుడు అఖండమగు అనుభవము కలుగును. ఇదియే సంపద అని చెప్పబడును. 23

వ్యాఖ్య : దేహమునుండి వేరై ప్రాణము నావేశించి విశ్వము నంతను చూచుట సంపద అనబడును. అదే జీవిత పరమ లక్ష్యము. 24

వ్యాఖ్య : ఇక్కడ ప్రాణ శబ్దము శ్రేష్ఠ ప్రాణవాచకము. దేహము నుండే కాక ప్రాణము నుండి కూడ ఆత్మ తేజ పృథక్కరణమును కొందరు తలచుచున్నారు. కాని అట్టి సంపద నిద్రవలె అనుభవించువాడు లేకుండుట వలన అగును. ప్రాణము యొక్క మూలవృత్తి అహంకారము. దానికి సంపదనుభవము గోచరమగును. ప్రాణము కన్న పృథక్కరణము నంగీకరించిన భోక్త ఆత్మయే కాని నిద్రయందువలె వేరుగా ఉండడని భావము. 25

వ్యాఖ్య : దేవయాన మార్గమున ఉత్తమ లోకముల నందిన వారలకునూ, తపో బలముచే బ్రహ్మలోకము నందిన వారలకునూ, సంపద నిలకడగ నుండునని పండితులనుచున్నారు. వారికి అఖండానుభవము కలుగునని భావము. 26

వ్యాఖ్య : విద్యాబలముచే ఈ లోకముననే సంపద నందిన వ్యక్తి దేహ పరిత్యాగానంతరము ఊర్ధ్వలోకమును గాని;

విద్యాబలాత్ = విద్యోపాసనచే; అత్రైవ = ఈ లోకము ననే; సంపన్నః = అఖండానుభవము కలవాడు, భవతి యది = అగునో: సః = వాడు; దేహంత్యక్త్వా = దేహమును విడిచి; తయోః = ఉత్తమలోక బ్రహ్మలోకములలో (సగుణ బ్రహ్మ, శుద్ధాకాశమ్ము); అన్యతరత్ = ఒకదానిని; వ్రజేత్ = పొందును.

శ్లో॥ దేహాన్తే సంపదే ప్రోక్తా సహజా స్థితి రాత్మని
అత్రైవ సంపదే ప్రోక్తం పురుషస్య విలోకనమ్ ॥ 28

ఆత్మని = స్వరూపమందు: సహజాస్థితిః = సహజమగునిష్ఠ; దేహాంతే = దేహావసానమున; సంపదే = సంపదకొరకు; ప్రోక్తా = చెప్పబడుచున్నది. పురుషస్య = ఉత్తమ పురుషుని: విలోకనం = దర్శనము; అత్రైవ = ఇక్కడనే; సంపదే = సంపద కొరకు, ప్రోక్తా = చెప్పబడుచున్నది.

శ్లో॥ అవిలోక్యాపి పురుషం శక్నోతి స్థాతు మాత్మని
ప్రథమస్య మహాభాగ్యం తస్యస్యా ద్యో విలోకయేత్ 29

పురుషం = ఆది పురుషుని: అవిలోక్యాపి = చూడకున్నను; ఆత్మని = తన స్వరూపమందు; స్థాతుం = నిలకడ చెందుటకు; శక్నోతి = సాధించుటకు సమర్థుడగును; యః = ఎవడు; విలోకయేత్ = పురుషుని చూచునో; తస్య = వానికి. ప్రథమస్య = ఆది పురుషుని; మహాభాగ్యం = సంపద; స్యాత్ = అగును.

శ్లో॥ ఇతీయం విశ్వమీమాంసా వాసిష్ఠేన ప్రవర్తితా ।
యద్యత్ప్రాధాన్యతో జ్ఞేయం తత్సర్వ మిహ విద్యతే । 30

ఇతీయం విశ్వమీమాంసా = ఈ విశ్వమీమాంస అనునది యీ విధముగ, వాసిష్ఠేన = వసిష్ఠ వంశజుడైన గణపతి మునిచే. ప్రవర్తితా = ప్రచారము గావింపబడినది. ప్రాధాన్యతః = ముఖ్యముగ: యత్ యత్ = ఏదేది; జ్ఞేయం = తెలియవలసినవో;

కలోకమును గాని పొందును. 'న తస్య ప్రాణా ఉత్క్రా-
మంతే' అని శ్రుతి ప్రాణోత్క్రమణమును నిషేధించు
చున్నది. 'అత్రైవ సమవలీయంతే' అని తెలుపుచున్నది.
కాన అఖండ బ్రహ్మ భావమును ఇక్కడే చెందునని
భావము. సిద్ధులు కలవాడగుటచే శుకునివలె మహిమ
లను కనపరచును. 27

వ్యాఖ్య. ఆత్మనిష్ఠ దేహాంతమున సంపద కగును. ఉత్తమ
పురుష దర్శనము ఈ లోకమున సంపద కగును. 28

వ్యాఖ్య: ఆత్మనిష్ఠను ఆదిదేవుని దర్శింపక కూడ పొందవచ్చును.
కాని ఆది దేవుని దర్శించిన వానికి మహాభాగ్యము
కలుగును. జీవన్ముక్తుడగును. సర్వశక్తి సంపన్నుడగును.
చూడని వానికి దేహాంతమున సంపద కలుగును. 29

వ్యాఖ్య ఈ విశ్వమీమాంస వాసిష్ఠ గణపతి మునిచే తెలుపి

తత్సర్వం = అది అంతయు; ఇహ = ఈ గ్రంథమున; విద్యతే = కలదు.

ఇతి శ్రీ భగవాన్ మహర్షి రమణాన్తేవాసినో
వాసిష్ఠస్య నరసింహసూనో ర్గణపతేః కృతిః
విశ్వమీమాంసా

(సమాప్తా)

బడినది. ఇందు ముఖ్యముగ తెలియ వలసిన విషయము
లన్నియు కలవు. 30

భగవాన్ రమణ మహర్షియు, కావ్య కంఠ గణపతి మునియు ఆచార్యులుగ విద్యా సాధకుడైన వాసిష్ఠ శివరామ పుత్రుడైన నరసింహ శర్మచే యీ వ్యాఖ్య ప్రచురితమైనది.

(సమాప్తం)

# సవరణలు

| పేజి. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 12. | 5 | సతాతః | సత్త్వాతః |
| 13. | 15 | గుణాగులు | గుణాదులు |
| 13. | 16 | అని | అవి |
| 14. | 2 | నిమత్తం | నిమిత్తం |
| 16 | 24 | జాత్రృ | జ్ఞాతృ |
| 18. | 4 | జ్ఞాతుర్ఞానస్య | జ్ఞాతుర్జ్ఞానస్య |
| 18 | 7 | జ్యోతిరాకృతితాం | జ్యోతిరాకృతితా |
| 18. | 18 | జ్ఞాతుర్ఞానం | జ్ఞాతుర్జ్ఞానం |
| 24 | 11 | యథా | యథాస్యాత్ |
| 24. | 14 | అగుచున్నది | స్యాత్ =అగుచున్నది |
| 26. | 7 | రజోమయా_న్తరిక్షం | రజోమయాస్యాన్తరిక్షం |
| 27. | 8 | విషయకమై | విషయకమై |
| 27. | 9 | కలదిమై | కలదియై |
| 28. | 4 | ద్విదేవం | ద్విదైవం |
| 30. | 8 | శసనా | శ్వసనా |
| 36. | 14 | సంజ్ఞోపచారికే | సంజ్ఞోపచారికీ |
| 39. | 8 | మూడింటీ | మూడింటి |
| ,, | 10 | ఉపనిషతు | ఉపనిషత్తు |
| 40. | 20 | భువా | భువాం |
| 42. | 14 | భూమ్యాయత్త_ | భూమ్యాయత్త |
| ,, | 25 | అనంతం | అనంతం=అంతములేని |
| 44. | 5 | పురాణానా | పురాణానాం |
| 45. | 14 | — | — |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 46. | 4 | శక్యోః | శక్త్యోః |
| 56. | 14 | యోష్టయో | యోష్టమో |
| 58. | 14 | రసనము = | రసనం = |
| 60: | 20 | అర్యమా = | అర్యమాస్యాత్ = |
| 62. | 1 | యః స్వప్నః | యత్ స్వప్నః = |
| 64. | 9 | విఘజ్యతే = | తత్ విభజ్యతే = |
| 74. | 15 | శానివానిగను; | శానివానిగను; మన్వానః= తలచుచు |
| 80 | 9 | హృదయు | హృదయే |
| " | 23 | (గంధకర్త) | (గ్రంథకర్త) |
| 82 | 24 | ధన్యః = | ధన్యః ఆహుః |
| 83. | 6 | స్వరము | సర్వము |
| 94. | 18 | కమలా | కమలామతా |
| 98 | 17 | నవా | నవా ఇతి |
| 102. | 4 | ఉక్తి భంగి | ఉక్తి భంగీ |
| 112. | 22 | మతిః | సూక్ష్మదీప్తిః = సూక్ష్మమగు తేజమే; మతిః |
| 116. | 9 | హృదయం ముదీర్యతే | హృదయం కముదీర్యతే |
| 122 | 3 | విపశ్చితః | విపశ్చిద్భిః |
| 124 | 20 | ప్రాజ్ఞః | ప్రాజ్ఞాః |
| 130 | 7 | అనుమాస్త | అనుమానస్తు |
| 137. | 4 | ఇతరునికే | ఇతరునిచే |
| 138. | 4 | ధర్మః = | ధర్మః ఇతి = |
| 140. | 9 | చ్ఛాని | చ్ఛాన్తి |
| 144 | 5 | అన్యాని రూపాణి | అన్యాని సర్వాణి రూపాణి |

| పేజి. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 152 | 8 | ఈశ్వరునికే అని | ఈశ్వరునికే అని, ఆహుః = చెప్పుదురు |
| 152. | 25 | సామంత్రేషు | సామమంత్రేషు |
| 154. | 13 | ఛదస్సు | చ్ఛందస్సు |
| " | 18 | బ్రహ్మణోకేషు | బ్రహ్మణోక్తేషు |
| 156. | 24 | శరీరవ్యాపిని | శరీరవ్యాపినీ |
| 158. | 3 | ఆతాన్మాం | ఆత్మానాం |
| " | 4 | సర్మన్ | స్మరన్ |
| 160. | 14 | తత్ = అది | తత్ = అది; తండులేషుతిలా ఇవ = బియ్యమునందు నువ్వులు కలిపినట్లు |
| 162 | 24 | జ్ఞాయోగము | జ్ఞానయోగము |
| 164 | 10 | దివ్యం = | దివ్యం |
| " | 24 | పాజ్ఞుడు | ప్రాజ్ఞుడు |
| 166 | 1 | జ్ఞానదేవ | జ్ఞానాదేవ |
| " | 2 | పన్ధాను | పన్ధాన |
| " | 8 | విజాన్పృథగ్ | విజానన్పృథగ |
| " | 11 | విజానాన్ | విజానన్ |
| 168 | 16 | ఏతస్యై | ఏతస్యైవ |
| 170. | 17 | ప్రణవం=ఓంకారము | తత్ ప్రణవమ్ = ఆ ఓంకారము |
| 172. | 14 | శ్రేష | శ్రేష్ఠ |
| 177. | 3 | శబ్ధాధిపు | శబ్దాధిపు |
| 178. | 17 | సలితే | సలిలే |
| 189. | 2 | లోపల దిగునో | లోపలది అగునో |
| 202 | 21 | లక్ష్యైవ | లక్ష్మ్యైవ |

| పేజి. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 204. | 8 | దేవమానేన | సః = వాడు; దేవయానేన |
| 212. | 23 | విర్వాన్దహతే | విద్వాన్దహరే |
| 230, | ” | 47 | 49 |
| ” | 8 | అభిజానన్ | అవిజానన్ |



